# మారుపనాలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## భ్రాంతి
రచన: వసుంధర

## హంతకుడి ఫోటోలు
రచన: బొమ్మిడి అచ్చారావు

## మృత్యు భస్మం
రచన: వి. యస్. రావ్

రాక్షసవేట — మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —173
మే, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1,

# భ్రాంతి

## వసుంధర

హోటల్లో కూర్చుని టిఫిన్ తింటున్నాడు నరేంద్ర.

అప్పుడతడి వద్దకు సర్వర్ వచ్చి ఓ కాగిత మిచ్చాడు. నరేంద్ర సర్వర్ వంక చిరాగ్గా చూసి—"ఇంకా కాఫీ తాగందే—అప్పుడే బిల్లు తెచ్చేశా వేమిటి?" అన్నాడు.

"బిల్లు కాదండి. ఒకాయన మీ కీ చీటీ ఇమ్మన్నాడు" అన్నాడు సర్వరు.

నరేంద్ర చీటీ అందుకుని చూశాడు.

"నా పేరు విభీషణ్. హోటల్ గజపతిలో రూం నంబరు పదహారుకి—సాయంత్రం నాలుగున్నరకు వస్తే నన్ను కలుసుకోవచ్చు—" అని ఉందా చీటీలో.

నరేంద్ర ఉలిక్కిపడి సర్వర్ వంక చూసి—"ఈ చీటీ నీకిచ్చినాయన ఎక్కడున్నాడు?" అనడిగాడు.

"ఆయన కార్లో దిగేడండి. నన్ను పిలిచి ఈ చీటీ యిచ్చి మళ్ళీ కార్లోనే వెళ్ళిపోయాడండి—" అన్నాడు సర్వర్.

"మనిషెలాగున్నాడు?"

"ఎత్తుగా, బలంగా ఉన్నాడు. పెద్ద పెద్ద మీసాలు జాలపాల జాత్తు. పాంటు, షర్టు బదులు పంచికట్టుకుని ఉంటే—ఎస్వీరంగారావు రాక్షస వేషంలాగుండేది...."

నరేంద్ర ఉలిక్కిపడి—"అయితే అతడు గౌతమ్ అయుండాలి. కానీ అదెలా సాధ్యం?" అన్నాడు.

సర్వర్ ఏమనాలో తెలియక అతడివంక ఆశ్చర్యంగా చూశాడు.

"గౌతమ్.... గౌతమ్...ఎలా వచ్చాడు?" అస్పష్టంగా గొణుక్కున్నాడు నరేంద్ర.

"సార్—కాఫీ తెచ్చేదా?" అన్నాడు సర్వర్.

"వద్దు—బిల్లు తీసుకురా...."

సర్వర్ బిల్లుతీసుకు రాగానే అంతవరకూ తింటున్న టిఫిను కూడా వదిలేసి వెంటనే లేచి వెళ్ళిపోయాడు నరేంద్ర.

"ఇతగాడి కేమయిందో? అసలా చీటీలో ఏముందో" అనుకుంటూ ఆశ్చర్యపడ్డాడు సర్వరు.

## 2

నరేంద్ర తిన్నగా యింటికి వెళ్ళి బట్టలు మార్చుకునే సరికి టైము తొమ్మిదయింది. అతడు మంచంమీద వెనక్కివాలి పడుకుని ఆలోచించసాగాడు.

వచ్చిన వ్యక్తి వర్ణన గౌతమ్‌కు సరిపోతోంది. నా పేరు విభీషణ్ అని చీటీలో వ్రాశాడతడు. అతడు గౌతమ్ అనడానికది మరింత బలమైన సాక్ష్యం. కానీ గౌతమ్ బ్రతికుండడానికి వీల్లేదు

అతణ్ణి తన చేతులతో తాను స్వయంగా హత్య చేశాడు.

"నువ్వు హంతకుడివి. నిన్ను పట్టించడానికి వాళ్ళే స్వయంగా వచ్చారు. నువ్వింక తప్పించుకోలేవు...." అంది నరేంద్ర మనసు.

నరేంద్ర మనసునిండా భయం. తనువునిండా భయం. ఆ భయం అతణ్ని వర్తమానం నుంచి గతంలోకి తీసుకుని పోతోంది....

అసలిదంతా విశాలాక్షి కారణంగా వచ్చింది.

విశాలాక్షి చలపతి కూతురు. చలపతి ఆ ఊళ్ళో బాగా పేరున్నవాడు. పేరున్నవాళ్ళక్కూడా సింహ స్వప్నం.

చలపతికి డబ్బుంది. డబ్బుకు మించిన తెగింపుంది. ఆ తెగింపు అతడికింకా యింకా డబ్బు సంపాదించి పెడుతోంది. డబ్బు సంపాదించడానికతడు చేసే పనులు మంచివి కావని చాలామందికి తెలుసు. కానీ అతడు చేసే పనులు చెడ్డవని చాటుగా అనుకునేందుక్కూడా అంతా భయపడతారు.

అటువంటి చలపతి కూతురు విశాలాక్షి. కానీ ఆమెను చూస్తే ఎవరికీ భయమనిపించదు. పుట్టినప్పుడే ఆ పాపను చూడగానే ముద్దుపెట్టుకోవాలనిపించేలా ఉండేది. వయసు పద్దెనిమిది దాటినాక ఇప్పటికీ ఆమెను చూస్తే అలాగే అనిపిస్తుంది. దానికి తగ్గట్టే విశాలాక్షి అలంకరణ పురుషులను రెచ్చగొట్టేదిగా ఉంటుంది. ఆమె ఆధునికమైన దుస్తులు ధరించడమే కాదు. అందమైన ఆమె శరీరంలోని వంపుసొంపుల తీరుతెన్నెలు శిల్పంలాగ స్పష్టంగా తెలియడానికా అన్నంత బిగుతుగా దుస్తులు ధరిస్తుందామె.

విశాలాక్షివైపు ఓసారి చూడగానే ఎవరూ చూపులు

మరల్చుకోలేరు. ఎవడికైనా తుంటరి బుద్ధి పుట్టినా—ఆమె చలపతి కూతురని యెవరో చెబుతారు. ఆ హెచ్చరిక చాలు—మనిషిని సన్మార్గంలో ఉంచడానికి!

ఒకరోజున ఓ దురదృష్టవంతుడు విశాలాక్షిని చూసి ముచ్చటపడ్డాడు. అతడు దురదృష్టవంతుడు కావడంవల్ల యెవరూ అతడ్ని చలపతి గురించి హెచ్చరించలేదు. అతడామెను బీచివద్ద చూశాడు. అవకాశంకోసం వేచి ఉన్నాడు. కాస్త కనుచీకటి పడగానే—సమీపంలో జనం పలచబడ్డారన్న జ్ఞానం కలగ్గానే అతడామె చేయి పట్టుకుని లాగాడు. దాంతో కూర్చున్న మనిషి నిలబడిందామె.

ఫేడెడ్ జీన్స్‌మీద స్పోర్ట్సు బనియన్ బిగించి కట్టిందామె. కనుచీకట్లో కూడా మిరుమిట్లు గొలిపే అందమామెది.

అతడామెను చటుక్కున కౌగలించుకున్నాడు.

విశాలాక్షి పెనగులాడింది.

అతడికి భల్లూకపు పట్టులా ఉంది. అందులోనూ వెచ్చటి ఆమె దేహ స్పర్శ అతడిలో భల్లూకానికి తేనెలా పరిమళిస్తోంది.

ఆమెను ముద్దుపెట్టుకోవాలని అతడి ప్రయత్నం.

"హెల్ప్!" అని అరిచింది విశాలాక్షి.

సముద్రపు ఘోషలో ఆ పిలుపు యెంతోదూరం వెళ్ళలేదు. అయినా ఆ సమయంలో ఆమె పిలుపందేటంత దూరంలో ఉన్నాడు నరేంద్ర.

అతడు జరుగుతున్నది చూశాడు. వారిద్దరూ ప్రేయసీ ప్రియులా అన్న అనుమానమతడిలో ఉంది. ఆమె హెల్ప్ అని కేక వేయగానే ఆ అనుమానం పోయింది.

నరేంద్ర బలమైనవాడు కాదు కానీ అతడికి మార్షల్ ఆర్ట్సు కొన్ని కొంతవరకూ తెలుసు.

విశాలాక్షి "హెల్ప్" అని అరిచిన రెండు క్షణాల్లో అతడామెను సమీపించాడు. మూడో క్షణంలో దురదృష్టవంతుడు నేలకూలాడు.

"థాంక్స్—" అంది విశాలాక్షి.

ఆ పలుకునిండా ఆడతనం ధ్వనించి నరేంద్రను కదిపేసింది. అప్రయత్నంగా అతడూ "థాంక్స్!" అన్నాడు.

"మీరు నాకు థాంక్సెందుకు చెబుతున్నారు?" అందామె నవ్వుతూ.

నరేంద్ర తడుముకోకుండా—"నన్ను సాయానికి పిల్చినందుకు-మీకు సాయపడడం నా అదృష్టం-" అన్నాడు.

అప్పటికే ఆమె అతడి నాకర్షించింది.

విశాలాక్షి చేత ఆకర్షించబడడానికి కారుచీకటిలో కూడా ఒక్క చూపు చాలు!

"ఇంతవరకూ నాపైన ఇలా యెవరూ ధైర్యం చేయలేదు. ఇది మొదటి కేసు. సమయానికి మీరు రక్షించారు...." అంది విశాలాక్షి.

"నేను మిమ్మల్ని రక్షించి ఉంటే అది నా అదృష్టం. కానీ మీకు నాదో సలహా. మీ దుస్తులిక్కడ తిరిగే ఆడవారికి భిన్నంగా వున్నాయి. ఈ ఊళ్ళో యిలాంటి దుస్తులతో తిరగడంవల్ల ఏదో క్షణంలో ఏ పురుషుడికైనా మీమీద దాడిచేయాలనిపించవచ్చును" అన్నాడు నరేంద్ర.

"ఈ దుస్తుల్లో తప్పేముంది? విదేశాల్లో ఆడవాళ్ళివే వేసుకుంటున్నారు. సినీ నటీమణులివి వేసుకుంటున్నారు. ప్రచారానికి మోడల్ గర్ల్సు యివి వేసుకుంటున్నారు.

ఢిల్లీ, కలకత్తా, బొంబేలాంటి మహానగరాల్లో కూడా స్త్రీలు దుస్తులు వేసుకుంటున్నారు. నా స్నేహితురాండ్ర కూడా యిలాంటి దుస్తులంటేనే మోజు. ఇంట్లో తలిదండ్రులొప్పుకోరని బాధపడుతూంటారు. నాకలాంటి బాధలేదు కాబట్టి నేను వేసుకుంటున్నాను...."

"మీకు మాత్రం యెందుకు బాధలేదు? ఇప్పుడేం జరిగిందో చూశారుగా...." అన్నాడు నరేంద్ర.

"ఏం జరిగింది? ఒకడు నన్ను తాకాలనుకున్నాడు. మరుక్షణం నేలను తాకాడు. ఇంకా లేవలేక అలాగే పడివున్నాడు...." అని నవ్వింది విశాలాక్షి.

"అందుక్కారణం నేను...."

విశాలాక్షి వెన్నెలలు కురిపించే చిరునవ్వుతో—

"మా నాన్న పేరు చలపతి. ఆయన్ను మెప్పించడం కోసం నన్ను రక్షించడానికెందరో కాసుక్కూర్చుని ఉంటారు. నేను ప్రమాదంలో పడాలని శతవిధాల దేవుడ్ని ప్రార్థిస్తూంటారు—" అంది.

"చలపతి ఎవరు?" అన్నాడు నరేంద్ర.

"చలపతి పేరు తెలియదా మీకు? ఈ ఊరొచ్చి ఎన్నాళ్ళయింది?"

"రెండు నెలలు...." అన్నాడు నరేంద్ర.

"అంటే మీదీ ఊరు కాదా?"

"కాదు—కాలేజీలో లెక్చరరుగా అపాయింటయ్యాను. ఇదే నా మొదటి ఉద్యోగం...."

"కానీ—రెండు నెలలంటే—అరవై రోజులు. రోజుకు ఇరవై నాలుగు గంటలు. గంటకరవై నిముషాలు. నిముషానికరవై సెకన్లు. ఇన్ని సెకన్లలో ఒక్కసారి కూడా మీరు మా నాన్న గురించి వినలేదంటే నమ్మ

శక్యంకావడంలేదా ఉంది...."

"ఎవరండీ ఆయన? అంత గొప్పగా చెబుతున్నారు?"

"తెలుసుకోవలసిందే! ఆయన మహిమవల్లే మీరిప్పటి కష్టంనుండి బీచివద్ద ఉద్భవించి నన్ను రక్షించారు...." అంది విశాలాక్షి.

"నాకు మీ నాన్న గురించికాక—మీ గురించే ఇంకా ఇంకా తెలుసుకోవాలనిపిస్తోంది...." అన్నాడు నరేంద్ర.

"కానీ మా నాన్న గురించి తెలుసుకున్నాక ఇంకేమీ అనిపించదు—"

నరేంద్ర చిరాగ్గా ఆమె వంక చూసి—"మీరు పదే పదే మీ నాన్న గురించి యెందుకు చెబుతున్నారో నాకర్థంకావడంలేదు—" అన్నాడు.

"అర్థంకావాలంటే ఓ పని చేయండి. కింద స్పృహ తప్పి పడున్న మనిషి చెవిలో 'నేను చలపతి కూతుర్ని' అని చెప్పండి. తర్వాతేం జరుగుతుందో చూడండి—"

నరేంద్ర కిందకు వంగి ఆమె చెప్పినట్టే చేశాడు. మరుక్షణం ఆ మనిషి చటుక్కున లేచి మెరుపులా మాయమయ్యాడు.

"ఇప్పుడు వీడ్ని కార్ల్ లూయిస్ కూడా పట్టుకోలేడు" అని కిలకిలా నవ్వింది విశాలాక్షి.



వారం రోజుల్లో విశాలాక్షి, నరేంద్రల మధ్య స్నేహం బలపడింది. ఇద్దరూ ఒకరినొకరు అభిమానించుకున్నారు. ప్రేమించుకోసాగారు.

నరేంద్ర ఈలోగా చలపతి గురించి చాలా విన్నాడు. కానీ అతడదేమీ పట్టించుకోలేదు.

"మా నాన్నంటే నీకు భయంవేయడంలేదా?" అనడి

గింది విశాలాక్షి ఒకసారి.

"హోటల్లో టిఫిను చేస్తూ వంట వాడి గురించి ఆలోచిస్తామా?" అన్నాడు నరేంద్ర.

"అయితే నువ్వు నన్ను ప్రేమించడంలేదా?"

"ఆ అనుమానం నీకెందుకొచ్చింది?"

"నువ్వు మా నాన్నను కలుసుకోకుండా మన ప్రేమ ఫలించదు కదా!" అంది విశాలాక్షి.

"విశాలా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. కానీ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న నమ్మకం నాలో ఇంకా కలగలేదు...."

"ఎందుకని?" అంది విశాలాక్షి.

నరేంద్ర మాట్లాడలేదు.

"నేను నిన్ను ప్రేమిస్తున్నానని యిప్పటికే చాలా సార్లు చెప్పాను. అయినా నీకు నమ్మకం కలగలేదంటే నీ కంటికి నేనో వంచకురాలిలా కనిపిస్తున్నానన్న మాట...."

"కాదు విశాలా! నువ్వు నా కంటికో దేవతా మూర్తిలా కనబడుతున్నావు. నువ్వు నన్ను ప్రేమించేటంత అదృష్టం నాకుందా అనిపిస్తూంటుంది...."

విశాలాక్షి నిట్టూర్చి—"హమ్మయ్య! అంతేకదా— ఇంకా ఏమో అనుకున్నాను...." అని—"నువ్వు మా నాన్నను కలుసుకో. మన ప్రేమ గురించి నిర్భయంగా చెప్పు...." అంది.

నరేంద్ర చలపతిని కలుసుకుని తన ప్రేమ గురించి చెప్పేశాడు.

చలపతి ఆశ్చర్యపోయి వెంటనే కూతుర్ని పిలిచాడు.

విశాలాక్షి నరేంద్ర మాటలు నిజమేనని చెప్పింది.

చలపతి వెంటనే- "మిస్టర్ నరేంద్రా! నీ ధైర్యానికి నిన్నభినందిస్తున్నాను. నువ్వు నాకు అనుచరుడిగా ఉండ దగ్గవాడివి—" అన్నాడు.

"నేను మీ అల్లుణ్ని కావాలనుకుంటున్నాను...."

"ముందు అనుచరుడివి కావాలి. తర్వాతే అల్లుడివి."

"మీకంటివారు అనుచరులను అల్లుళ్ళు చేసుకుంటారంటే నేను నమ్మను " అన్నాడు నరేంద్ర.

"గుడ్ ....తెలివిగా మాట్లాడుతున్నావు. అల్లుడివయ్యాకేనా—నా అనుచరుడివవుతావా?"

"మామలకనుచరులు కావడం మా యింటి సంప్రదాయం కాదు—"

చలపతి చిరాగ్గా—"నువ్వు నా కూతుర్ని నిజంగా ప్రేమిస్తూంటే ఆ ప్రేమకోసం యేమైనా చేయగలవు-చేస్తావు...." అన్నాడు.

"నేను విశాలాక్షిని ప్రేమిస్తున్నది నాకోసం. మీ కోసం కాదు. నేనేం చేసినా ఆమెను సుఖపెట్టడానికే. దుఃఖంలో ముంచడానికీ, ప్రమాదంలో ఉంచడానికీ కాదు...."

"అంటే?"

"చలపతిగారూ! మీ పద్ధతుల గురించి నాకంటే మీకే బాగా తెలుసు. ఎల్లకాలం రోజులొకరివి కావు. ఏదో ఒకరోజున మీరు చట్టంముందు తలవంచక తప్పదు. ఆ రోజున మీ డబ్బు, పలుకుబడి, అధికారం—ఎందుకూ కొరగావు. మీ అమ్మాయినే డబ్బున్నవాడికో కట్టబెట్టినా వాడామెకు డబ్బు నేతప్ప సుఖాన్నివ్వలేడు. ఈ ప్రపంచంలో సుఖపడడానికి డబ్బొక్కటే మార్గం కాదు. ఒకోసారి అది సుఖానికి అడ్డంకి అవుతుంది కూడా. నాకు

మీ డబ్బు అవసరంలేదు. నిజంగా అవసరంలేదు. నేను మీ అమ్మాయిని ప్రేమిస్తున్నాను. నా జీవితం, మీ పద్ధతిలో కాక నా పద్ధతిలో నడవాలి. ఎందుకంటే నేను నా పద్ధతిని కూడా ప్రేమిస్తున్నాను....”

చలపతి ఆలోచనలో పడ్డాడు.

“మీరు నిజంగా మీ అమ్మాయిని ప్రేమిస్తూంటే మా ప్రేమను కాదనరు. ఆలోచించుకోండి—” అని వెళ్ళిపోయాడు నరేంద్ర.

• • •

మర్నాడే విశాలాక్షి నరేంద్రను కలుసుకుంది. ఆమె ముఖంలో ఉత్సాహంలేదు.

“అలా ఉన్నావేం?” అన్నాడు నరేంద్ర.

“నాన్నకు నువ్వు నచ్చలేదు. నీ ధైర్యం నచ్చింది.”

“అయితే?”

“మన పెళ్ళి జరగదు....”

“నాకు నమ్మకముంది. మన పెళ్ళి జరుగుతుంది....”

“నరేన్! మన పెళ్ళి జరిగినా నువ్వు నన్నిలా దుస్తులు ధరించనిస్తావా? ఫ్రీగా తిరగనిస్తావా? విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టనిస్తావా?”

“నో—” అన్నాడు నరేంద్ర.

“అయితే నువ్వు నన్ను శాసిస్తావన్నమాట....”

“అవును....”

“అంటే నువ్వు నిరంకుశంగా ఉంటావన్నమాట....”

“విశాలా! నువ్వేమనుకున్నా సరే! నా పద్ధతులు నావి. నా వ్యక్తిత్వం నాది. కానీ ఒకమాట చెబుతున్నాను విను. నేనేం చేసినా అది నేనూ ఆచరిస్తాను....నా పద్ధతిలో జీవిస్తూ నిన్నూ అనుసరించమంటాను....”

అన్నాడు నరేంద్ర.

"నేనూ అంతే! వివాహమైనా యిప్పటిలాగే విచ్చల విడిగా తిరగడం నా యిష్టం. నువ్వూ విచ్చలవిడిగా తిరిగినా నేనేమీ అనుకోను—" అంది విశాలాక్షి.

"శీలానికి ప్రాధాన్యతనివ్వనివాళ్ళు వివాహం గురించి ఆలోచించకపోవడమే మంచిది—" అన్నాడు నరేంద్ర చటుక్కున.

అప్పుడు విశాలాక్షి ముఖం ఎర్రబడింది—"నేను శీలానికి ప్రాధాన్యత నివ్వనని నీకెవరు చెప్పారు?"

"స్త్రీ పురుషులు విచ్చలవిడిగా తిరిగితే శీలానికి ప్రాధాన్యత ఉండదు—"

"అది నీ భ్రమ! విచ్చలవిడిగా తిరగడంలో మనిషి చలాకీతనానికి తృప్తి కలుగుతుంది. శీలాన్ని కాపాడుకోవ డంలో మనిషి వ్యక్తిత్వం నిలబడుతుంది. ఇన్నాళ్ళుగా నా పరిచయంలో నా శీలం గురించి నీకనుమానం కలి గిందా?"

"శీలం గురించి నేనాలోచించలేదు కానీ భరించలేని వ్యామోహం మాత్రం కలిగింది నాకు. అందరూ ఆ వ్యామోహాన్నాపుకోగలరని నేననుకోను. నా వ్యక్తిత్వం నన్ను శాసించగలిగింది—"

"నిన్ను శాసించినది నీ వ్యక్తిత్వం కాదు....నా వ్యక్తిత్వం ...ఈ విషయంలో నీకేమైనా సందేహాలుంటే వెళ్ళి గౌతమ్‌ని కలుసుకో...."

"గౌతమ్ ఎవరు?"

"మా నాన్న ముఖ్యానుచరుల్లో ఒకడు. ఏదో విధంగా నన్ను పొందాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తున్న వాడు...."

నరేంద్ర ఆశ్చర్యపడి—"గౌతమ్ గురించి నువ్వింత వరకూ నాకు చెప్పలేదు...." అన్నాడు.

"ఇంతవరకూ నా శీలం ప్రసక్తి రాలేదు నువ్వా?" అంది విశాలాక్షి.

• • •

చెయ్యెత్తు మనిషి గౌతమ్. మగాళ్ళనే ఆకర్షించే రూపు రేఖలు....

అతడొకరోజున హోటల్లో టిఫిన్ చేస్తూండగా దూరాన్నుంచి విశాలాక్షి నరేంద్రకు చూపించి—"అతడే గౌతమ్—" అని చెప్పి వెళ్ళిపోయింది.

నరేంద్ర కౌంటర్ వద్ద అతడికోసం యెదురుచూశాడు. వచ్చి బిల్లిచ్చేదాకా ఆగి—"నీ పేరు గౌతమ్ కదూ!" అన్నాడు.

"అవును మిస్టర్ నరేంద్రా!" అన్నాడు గౌతమ్.

నరేంద్ర ఆశ్చర్యపడి—"నేను నీకు—తెలుసా?" అన్నాడు.

గౌతమ్ నవ్వి—"పద—మాట్లాడుకుందాం—" అని ముందుకు నడిచాడు.

నరేంద్ర అతడిననుసరించి కారెక్కాడు.

కార్లో డ్రైవింగ్ సీట్లో గౌతమ్....అతడి పక్కనే నరేంద్ర....

కారు స్టార్టయింది.

"నువ్వు విశాలాక్షితో ప్రేమలో పడగానే నాకు తెలిశావు...."

"ఎందుకని?"

"విశాలాక్షిని నేను కంటికి రెప్పలా కాపాడు కుంటాను. ఆ సంగతి చలపతికి తెలుసు. అందుకే ఆయన

కూతురి గురించి నిశ్చింతగా ఉన్నాడు..."

"అంటే....చలపతి నీకు విశాలాక్షి డ్యూటీ అప్ప గించాడన్నమాట...." అన్నాడు నరేంద్ర.

"నాకెవరూ డ్యూటీ అప్పగించరు. నేనే డ్యూటీ తీసుకుంటాను...."

"కానీ నువ్వు చలపతి అనుచరుడివని విన్నాను...."

"విశాలాక్షి కోసం నేను చలపతి అనుచరుణ్ణయ్యాను. ఆమెకోసం ఆయనేం చెప్పినా చేస్తూంటాను. ఆదాయ నకు తెలుసు...."

"ఆమెను నువ్వు ప్రేమిస్తున్నావా?"

"అవును..."

"మరైతే పెళ్ళిచేసుకోలేదేం?"

కారాపాడు గౌతమ్. ఇద్దరూ కారు దిగారు. పక్కనే పార్కుంది. గౌతమ్ పార్కులోకి నడిచాడు. నరేంద్ర అతడిననుసరించాడు.

ఇద్దరూ ఓ క్రోటన్సు పొద దగ్గర కూర్చున్నారు.

గౌతమ్ సిగరెట్ వెలిగించి నరేంద్రకూ ఆఫర్ చేశాడు.

"నో థాంక్స్!" అన్నాడు నరేంద్ర.

"అయితే సరే — ఇందాకా నన్నేదో అడిగినట్లున్నావు...."

"నువ్వు విశాలాక్షిని ప్రేమిస్తూంటే — పెళ్ళిచేసుకో వచ్చుగదా!"

"విశాలాక్షి నన్ను ప్రేమించడంలేదు...."

"ఎందుకని?"

"ఆమెకు నా శీలంపై నమ్మకంలేదు...."

"నమ్మించడానికి నువ్వు ప్రయత్నించలేదా?"

"అలాంటి ప్రయత్నాలు చేయడం నాకు చిరాకు. ఆడపిల్ల నన్ను నన్నుగా ప్రేమించాలి "

నరేంద్ర అతడి వంక చిత్రంగా చూసి—"అంటే నిజంగానే నీ ప్రవర్తన సరైనదికాదా? నీ ప్రవర్తనను విశాలాక్షి భరించాలని నువ్వనుకుంటున్నావా?" అన్నాడు.

"అవును మగాడికున్న చురుకు ఆడదానికుండదు. అందుకే ఇంట్లో సుఖం లభిస్తున్నంతకాలం ఆడది మగాడి తిరుగుళ్ళ గురించి ఆలోచించకూడదు ..."

"అయితే నువ్వు విశాలాక్షికి తగిన వరుడివికాదు...."

నరేంద్ర వంక గౌతమ్ అదోలా చూశాడు—"అంత త్వరగా ఓ అభిప్రాయానికి రాకు. ఇబ్బంది పడతావు. నేను మూర్ఖంగా ఆలోచించే పాతరకం మగాడ్నికాదు. విశాలాక్షి ఎలాంటి వాతావరణంలో ఎలా పెరిగిందో నాకు తెలుసు. ఆమెకు విచ్చలవిడిగా తిరగడం అలవాటు. ఆ అలవాటునామె వదులుకోలేదు. కానీ వివాహమైతే భర్త ఆమె ప్రవర్తనను మార్చుకోమంటాడు. నేనైతే అలాగనను. ఆమె నాకు భార్యగా ఉండి నేను కోరినప్పుడల్లా నాదైతే చాలు. ఈ తప్పుడెలా తిరిగినా నేను పట్టించుకోను. ఏమీ అనను. అభ్యంతర పెట్టను. నావంటి భర్త విశాలాక్షికి వరం...."

"ఈ విషయం నువ్వు చలపతికి చెప్పాల్సింది...."

"చలపతికి చెప్పి ప్రయోజనంలేదు. ఆయనకు నేను అనుచరుడిగా మాత్రమే నచ్చాను. అల్లుడిగా నచ్చలేదు. అదాయన మొదట్లోనే చెప్పాడు...."

"అయితే ఆమెమీద ఆశలు వదులుకున్నావా?"

"లేదు. ఆమె ఒప్పుకుంటే చలపతి కాదనలేడని

నాకు తెలుసు. చలపతి కూతురు ఇష్టానికి వ్యతిరేకంగా ఏమీ చేయడు ..."

"అయితే యిప్పుడేం చేస్తున్నావు?"

"విశాలాక్షికి నా గొప్పతనం, విశాల హృదయం గురించి చెబుతున్నాను. ఆమె అర్థంచేసుకోగలదని ఆశిస్తున్నాను. మా ఇద్దరి స్వభావం, ప్రవర్తన ఒకలాంటివి. వుయ్ మేక్ యాన్ ఐడియల్ కపుల్ ....ఆదామె గుర్తించే రోజొస్తుంది "

"ఇంతవరకూ ఆమె గుర్తించలేదు. ఇకముందు కూడా గుర్తించకపోతే?"

"నీకు తెలుసో తెలియదో—ప్రస్తుతం మా యిద్దరి మధ్య ఓ సవాలు నడుస్తోంది...." అన్నాడు గౌతమ్.

"ఏమిటది?" కుతూహలంగా అడిగాడు నరేంద్ర.

"ఆరు నెలల క్రితం నేనామెకు ఏడాది గడువిచ్చాను. ఈ ఏడాదిలోగా ఆమె నన్ను పెళ్ళాడేందుకంగీకరించక పోతే— నేనామెను బలవంతంగా అనుభవిస్తాను. ఒక సారి నాతో అనుభవం రుచిచూసిన యే ఆడదీ మరో మగాడ్ని పెళ్ళిచేసుకోదు. నేను సరసంలో శ్రీకృష్ణుడ్ని మించినవాడ్ని. శృంగారంలో వాత్స్యాయనుడ్ని ఔపోసన పట్టినవాడ్ని.... నా సామర్థ్యానికి ఋజువులెన్నో ఉన్నాయి...."

"అయితే...."

"శాశ్వతంగా ఆమెను నా దాన్ని చేసుకుందుకే నేనామెను బలవంతం చేస్తాను. ఈలోగా ఆమె ఆలోచించుకుందా సరేసరి ... లేదా.... ఇంక ఆమెకు ఆర్నెల్లు మాత్రమే గడువుంది...."

"నీ షరతు విని ఆమె ఏమంది?"

"ఏమంటుంది?" అని చెప్పుకోమన్నట్లు నవ్వాడు గౌతమ్.

"సాచి లెంపకాయ కొట్టి ఉంటుంది...."

"అలాకొడితే ఆమె విశాలాక్షి ఎందుకవుతుంది?" అని నవ్వాడు గౌతమ్—"ఆమె ఏమందో తెలుసా?.... నేను అద్భుతమైన ఆడదాన్ని. నేను మనసారా వశమైతే—ఆ పురుషుడు జీవితంలో నన్ను తప్ప మరో స్త్రీని కన్నెత్తి కూడా చూడలేడు. అందుకని బలవంతం గురించిన దురాలోచన ఉంచుకోకు. నా మనసును జయించడానికి ప్రయత్నం చేయి. నీకూ నాకో ఏడాది మాత్రమే గడువిస్తున్నాను. ఏడాదిలో నువ్వు నాకు నచ్చావా సరేసరి, లేకుంటే ఆ తర్వాత నువ్వు నాకు నీ ముఖం కూడా చూపించకూడదు....అంది...."

"బాగుంది—ఇద్దరికిద్దరే! పురుషుల్లో నీవు అపర శ్రీకృష్ణుడివి స్త్రీలలో ఆమె స్వర్గలోకపు అప్సరస. నీ విషయంలో లాగే ఆమె విషయంలో కూడా ఋజువులున్నాయా?" అన్నాడు నరేంద్ర నవ్వుతూ.

గౌతమ్ మరో సిగరెట్ వెలిగించి—"ఆమె గురించి అలా మాట్లాడకు. ఆమె నిప్పు...." అన్నాడు.

నరేంద్ర ఆశ్చర్యపడి — "నీకామెపై అలాంటభిప్రాయమున్నప్పుడు—ఆమెకు దూరంగా ఎందుకుండవు? నిప్పును ముట్టుకుంటే కాలుతుందని తెలియదా?" అన్నాడు.

"నిప్పుకు నేను భయపడను. అది నన్ను కాల్చలేదు. అందుకు ఋజువు కావాలంటే—ఇదిగో చూడు...." అంటూ గౌతమ్ నోట్లో వెలుగుతున్న సిగరెట్‌ను ఎడమ

అరచేతిలో ఉంచి గుప్పెట మూశాడు.

నరేంద్ర అతడివంక ఆశ్చర్యంగా చూశాడు.

కొద్దిక్షణాల తర్వాత గౌతమ్ గుప్పెట తెరిచి—“చూశావా—నిప్పు నన్ను కాల్చలేదు. ఆరిపోయింది-” అన్నాడు.

నరేంద్ర చలించకుండా — “అయితే నువ్వెందుకు ఆగినట్లు?” అన్నాడు.

“నాకు నిప్పంటే భయంలేదు. కానీ నీరంటే భయం. విశాలాక్షి నిప్పయితే చలపతి నీరులాంటివాడు. అదీ సామాన్యమైన నీరు కాదు. సుడిగుండాలతో కూడిన ఉప్పెన వంటి ప్రవాహపు నీరు. గజ ఈతగాడు కూడా ఆ ప్రవాహంలోంచి ప్రాణాలతో బైటపడలేడు. విశాలాక్షి జోలికి వెడితే నన్నా ప్రవాహం ముంచేస్తుంది....”

“అయితే ఏం చేస్తావు?”

“గడువిచ్చాను గా..అంతవరకూ ఆగుతాను. ఈలోగా విశాలాక్షి నేనంటే మనసుపడిందా — సరేసరి! లేదా ఆమెను బలవంతంగా అనుభవిస్తాను. అప్పుడామె నా దారికి రాకతప్పదు....”

“రాకపోతే?”

“జీవితంలో ఒక్కసారైనా విశాలాక్షిని అనుభవించాలన్నది నా కోరిక. అదితీరకుండా బ్రతికి ప్రయోజనంలేదు. అదితీరాక చచ్చినా బాధలేదు....”

“చాలా చిత్రంగా ఉంది....”

“చిత్రంగానే ఉంటుంది. కానీ ఈ కథ నేను నీకెందుకు చెప్పానో తెలుసా?” అన్నాడు గౌతమ్.

నరేంద్ర బదులుపలికేలోగానే—“విశాలాక్షి నా గడువు గురించి తండ్రికి చెప్పలేదు. అంటే సీరియస్‌గా ఆలో

చిస్తోందనే అర్థం. కానీ ప్రస్తుతం ఆమెకు నీతో పరిచయమయింది. నువ్వామెకు నచ్చావు. పైకి చెప్పకపోయినా చలపతికి కూడా నువ్వు నచ్చావనే అనిపిస్తోంది నాకు. అందుకే నేనీ కథ చెప్పాను...."

"ఎందుకు?"

"విశాలాక్షి విషయంలో నువ్వు నా ప్రత్యర్థివి. నిన్ను నేనెప్పుడు తల్చుకుంటే అప్పుడు కాలరాయగలను. కానీ విశాలాక్షికోసం—ఆ పని చేయలేను. నిన్నేమైనా చేస్తే ఆమె నన్ను క్షమించదు. అయితే నేను నిన్ను వదిలిపెడతానని అనుకోకు. నా కడుపు పూర్తయ్యేదాకా నువ్వామెకు శారీరకంగా కానీ మానసికంగా కానీ దగ్గరకాకూడదు. అలాచేశావో ఈ ప్రపంచానికి దూరమవుతావు...."

"నువ్వు నన్ను బెదిరిస్తున్నావా?"

"లేదు—హెచ్చరిస్తున్నాను "

"అయితే నేనిక విశాలాక్షిని కలుసుకోకూడదా?"

"కలుసుకోవచ్చు. కానీ నీ అదుపులో నువ్వుండాలి."

"నేను నిన్ను కలుసుకున్నాను కాబట్టి కథ చెప్పావు. కలుసుకోకపోతే—ఏం చేద్దువు?"

"వెర్రివాడా—నిన్ను నా దగ్గరకు పంపమని విశాలాక్షికి చెప్పింది నేనే!" అని నవ్వాడు గౌతమ్.

* * *

"గౌతమ్ నిజంగానే ప్రమాదకరమైన మనిషి. చెప్పాలంటే ఎందర్నో భయపెట్టే మా నాన్న కూడా అతడంటే భయపడతాడు...." అంది విశాలాక్షి.

"నాకు గౌతమ్ అంటే భయంలేదు...." అన్నాడు నరేంద్ర.

"నేను నమ్మలేను...." అంది విశాలాక్షి.

"నిన్ను నమ్మించాలంటే ఏం చేయను?"

"అతడ్ని చంపేయగలవా?"

"చంపడమా?" అని ఉలిక్కిపడ్డాడు నరేంద్ర.

"చూశావా—భయపడ్డావు...." అంది విశాలాక్షి.

"నేను భయపడేది గౌతమ్‌కి కాదు. హత్యకి...."

"ఆ హత్య గౌతమ్‌ని కాబట్టి—భయపడుతున్నావు."

"లేదు విశాలా! నేను మనిషికి భయపడను. కానీ నేరస్తుడ్ని కావడం నా జీవితాశయం కాదు...."

"ప్రేమకోసం ఏమైనా చేయొచ్చు...."

"అది విచక్షణ లేని ప్రేమ...."

"ప్రేమకు విచక్షణ ఉండదు..."

నరేంద్ర నవ్వి—"నేను నీకంటే ఎక్కువగా నా జీవితాన్ని ప్రేమిస్తున్నాను. దాన్నెంతో అందంగా తీర్చిదిద్దుకోవాలని నా కోరిక. ఆ అందమైన జీవితంలో నీవూ ఒక భాగం కావాలని నేననుకుంటున్నాను. అందుకు నేనేమైనా చేయగలను. కానీ నువ్వు నా అందమైన జీవితాన్ని నాశనం చేసుకోమంటున్నావు...." అన్నాడు.

"అంటే?"

"హత్యలు, నేరాలు మనిషిని సుఖజీవితానికి దూరం చేస్తాయి. నా మాట విని నువ్వూ ఆలోచించి చూడు.." అన్నాడు నరేంద్ర.

"కానీ సుఖజీవితానికి హత్య అవసరమైతే?"

"మంచి మనిషికి హత్య సుఖజీవితాన్నివ్వదు...."

విశాలాక్షి నరేంద్ర వంక రెప్పలార్పకుండా చూసింది. అతడి ముఖం గంభీరంగా ఉంది.

"నరేంద్రా! నీవు చాలా గొప్పవాడివి. నేను నా పద్ధతులు నీ కనుకూలంగా మార్చుకుందుకు ప్రయత్నిస్తాను. మా నాన్న నిరాకరించినా నిన్ను పెళ్ళి చేసుకుంటాను—" అంది విశాలాక్షి. ఆమె మాటల్లో పట్టుదల ధ్వనించింది.

* * *

వారం రోజుల అనంతరం....

చలపతినుంచి నరేంద్రకు పిలుపు వచ్చింది. అతడు వెళ్ళాడు.

"నీలో మంచితనం, విశాలదృక్పథం, ఆత్మాభిమానం ఉన్నాయి. నీవంటి మనుషులు అరుదుగా ఉంటారు. నిన్ను నేను అల్లుడిగా చేసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు చలపతి.

"అంతా నా అదృష్టం—" అన్నాడు నరేంద్ర.

"మీ పెళ్ళి వెంటనే జరుగుతుంది " అన్నాడు చలపతి.

"వెంటనే వద్దు...." అన్నాడు నరేంద్ర...."ఎవరిలోనూ మార్పు వెంటనే రాదు. మీ అమ్మాయి విశాలాక్షి ఇంతకాలం పెరిగిన వాతావరణం వేరు. మన సమాజంలో ఆమె పద్ధతులు హర్షించబడవు. పురుష ప్రపంచం ఆమెను వెంటాడి వేధించి ఆరాధిస్తున్నట్లు కనబడుతూనే అపహాస్యం చేస్తుంది. ఇలాంటివి నాకెన్నో తెలుసు. అందుకే నేను విశాలాక్షిలో మార్పు కోరుకుంటున్నాను. ఆ మార్పును భర్తగా నేను శాసించకూడదు. వరుడిగా చూడగలగాలి...."

"అమ్మాయిలో మార్పు వచ్చేసింది...." అన్నాడు చలపతి.

"అది తాత్కాలికం. పెళ్ళికి ముందే కొంతకాలం పాటు ఆమె నేను కోరిన పద్ధతిలో జీవించి అందులోని ఇబ్బందులను స్వానుభవంతో తెలుసుకోగలగాలి. ఆలాంటి జీవితం తనకు బాగుంటుందనిపిస్తేనే మా పెళ్ళి జరుగుతుంది. పెళ్ళంటే నూరేళ్ల పంట అని మీకు నేను చెప్పనవసరం లేదు...."

చలపతి మాట్లాడలేదు.

* * *

ఆ సాయంత్రం విశాలాక్షి నరేంద్రను కలుసుకుని—

"నేను నిన్నారాధిస్తున్నాను. అందుకే నీ పద్ధతిలోకి మారాలనుకుంటున్నాను. నువ్వు మన పెళ్ళిని వాయిదా వేస్తున్నావు. ఎందుకు?" అంది.

"విశాలా! నువ్వు నాపట్ల ఆకర్షించబడ్డావు. ఆ మోజులో ఏమైనా చేయగలననుకుంటున్నావు? నీలో అసహనం బాగా ఉంది. మోజు తీరిపోతే అసహనం బైటకు వస్తుంది. అప్పుడు మన జీవితం నరకమవుతుంది. ఏ అసహనం నిన్నిప్పుడు పెళ్ళికి పురికొల్పుతుందో అదే అసహనం రేపు విడాకులకు దారితీస్తుంది.

అలా జరక్కూడదనే నేను మన పెళ్ళిని వాయిదా వేస్తున్నాను. అనవసరంగా తొందరపడకు. కనీసం ఏడాదిపాటు నా పద్ధతిలో జీవించు. అందుకు నువ్వు నీ ప్రస్తుత వేషాధారణకు, స్నేహితులకు స్వస్తి చెప్పాలి. ఒక భారత యువతి ఎలా ఉంటుందో అలా మసలాలి. ఆరోగ్యకరమైన భోజనం తీసుకోవాలి. మనసుకు ఆరోగ్యాన్నిచ్చే పుస్తకాలు చదవాలి. అది ఓ ఏడాదిగడిస్తే నా కొత్త పద్ధతి నీక్కూడా నచ్చితే.... అప్పుడు మన పెళ్ళి జరుగుతుంది—"

"సరే—ఏడాది తర్వాత మన పెళ్ళి జరిగితే అప్పుడు మళ్ళీ వాళ్లో మార్పు రాదా?" అంది విశాలాక్షి.

"రాదు. ఈ పద్ధతిని ఒక ఏడాది కాలంపాటు భరించగలిగిన దానివి—జీవితకాలం భరించగలవు...." అన్నాడు నరేంద్ర.

"కానీ నీకోసం ఇప్పటినుంచే ఈ పద్ధతిని భరించ గలను—" అంది విశాలాక్షి.

"అది కొత్త మోజు. ఆకర్షణ...."

"ఆకర్షణకు తట్టుకుని నిలబడగల శక్తి స్త్రీకే ఎక్కువుంటుంది. నువ్వు నీ ధోరణిలోనే ఆలోచిస్తున్నావు తప్ప నా సమస్యార్థం చేసుకోవడంలేదు. నేను నీపట్ల ఆకర్షితురాలినై వెంటనే వివాహం చేసుకుంటాననడం లేదు. నన్ను గౌతం సవాలు చేశాడు. అందుకింక కొన్ని నెలలు మాత్రమే గడువుంది. ఆ సవాలు పూర్తయ్యే లోగా మన పెళ్ళి జరిగిపోవాలి...."

"పెళ్ళయితే గౌతం సమస్య తీరిపోతుందా?"

"తీరిపోతుంది. అప్పుడు నాన్న నన్ను గౌతం నుంచి రక్షిస్తాడు...."

"ఇప్పుడెందుకు రక్షించడు?"

"నాన్న గౌతమ్‌కి ఓ ముఖ్యమైన పని అప్పగించాడు. అది గౌతంవల్లనే అవుతుంది. ఆ పని పూర్తయ్యేదాకా నాన్న గౌతం నేమీ చేయడు. అందుకే గౌతం సవాలుకు తెలివిగా వ్యవధిని నిర్ణయించాడు...."

"పని పూర్తికాకపోతే మీ నాన్నకేమవుతుంది?"

"లక్షల్లో నష్టం...."

"కూతురి సుఖంకోసం ఆమాత్రం త్యాగంచేయలేడా మీ నాన్న?"

"ఇప్పుడు మాత్రం నా సుఖానికేమిలోటు వచ్చింది
అని నాన్న అంటాడు. గౌతం తన సవాలు నిలబెట్టు
కుంటే అతడికే నన్నిచ్చి పెళ్ళిచేయడానిక్కూడా
ఆయన సిద్ధం. సమస్య ఆయనది కాదు. నాది. నువ్వు
తప్ప ఇంకెవరూ నాకక్కర్లేదు. నాన్న మన పెళ్ళి
కభ్యంతర పెట్టడంలేదు. వెంటనే వివాహం జరిపించ
డానికి సిద్ధంగా ఉన్నాడు. మన పెళ్ళి జరిగితే—తనకు
లక్షల్లో నష్టంవచ్చినా సరే—గౌతమ్ నో కంట కనిపెట్టి
అదుపుచేస్తూండగలనని హామీ ఇచ్చాడు. కానీ నువ్వు"
ఆగింది విశాలాక్షి.

"బెంగపడకు విశాలా! అనర్థమేమీ జరుగదు. మన
పద్ధతిలో మనముందాం. అంతా దైవానికే వదిలిపెడ
దాం—" అన్నాడు నరేంద్ర.

విశాలాక్షి నిట్టూర్చింది.

* * *

విశాలాక్షి జీవన విధానంలో ఊహించని మార్పు
వచ్చింది.

ఆమె వేషధారణలో పూర్తి మార్పు వచ్చింది.
ఒకప్పుడామె మోహినిలా కనబడి రెచ్చగొట్టేది. ఇప్పు
డామె వరమిచ్చే దేవతలా ఉంది.

ఆమె పూర్తిగా పాత స్నేహాలకు స్వస్తి చెప్పింది.
ఇప్పుడామె స్నేహితులు మంచి పుస్తకాలు, మంచి అల
వాట్లు.

ఆహారపుటలవాట్లతో సహా అన్నీ మార్చుకుంద
విశాలాక్షి.

ఆమె సంకల్ప బలమెటువంటిదో కానీ ఆ మార్పు
నామె మనస్ఫూర్తిగా ఇష్టపడుతోంది.

కూతురిలో వచ్చిన మార్పు చలపతికి కూడా ఎంతో నచ్చింది. ఆయన కూతురితో—"నరేంద్ర చెప్పేదాకా మన పద్ధతిలో తప్పుందనే నాకు తోచలేదు—" అని బాధపడ్డాడాయన.

రోజులు గడుస్తున్నాయి. నెలలు గడుస్తున్నాయి.

ఒకరోజున విశాలాక్షి నరేంద్రను కలుసుకుని-"నాకు చాలా భయంగా ఉంది. గౌతమ్ అనుకున్నది సాధించేలాగున్నాడు—" అంది.

"నీ సహకారం లేనిదే అదతడివల్ల కాదు...."

"ప్లీజ్—నన్ను నమ్ము. గౌతమ్‌లో ఏదో ఆకర్షణ ఉంది. అది నిజం. నేను మనస్ఫూర్తిగా నిన్నే ప్రేమిస్తున్నాను. నువ్వే కావాలనుకుంటున్నాను. కానీ అతణ్ని కాదనగలనా అని భయమేస్తోంది...."

"ఈ సమస్య పెళ్ళయ్యాక కూడా రావచ్చు...."

"రాదు. భారత స్త్రీ పవిత్రతకు ప్రాధాన్యతనిస్తుంది. ఆమె యే సంప్రదాయంలో పెరిగినా పవిత్రత దూరం కాలేదు. పెళ్ళికాని ఆడపిల్ల పర పురుషుడికి లొంగిపోతే—అతణ్ని పెళ్ళిచేసుకునే అవకాశముంటుంది కాబట్టి ఆమె మనసు బలహీనం కావచ్చు. పెళ్ళయిన ఆడది తప్పుచేయలేరు. నా మాట విను. మనం పెళ్ళిచేసుకుందాం...." అంది విశాలాక్షి.

"విశాలా! ముందు నీవు నీ అసహనాన్ని జయించు. ఆ అసహనం నీలో లేనిపోని భయాలను సృష్టిస్తోంది..."

"నీ ధోరణే నీది తప్ప నన్నర్థంచేసుకోవేం?" అంది విశాలాక్షి.

"నిన్ను నేను బాగా అర్థంచేసుకున్నాను........" అన్నాడు నరేంద్ర.

విశాలాక్షి నిట్టూర్చి వెళ్ళిపోయింది.

ఆతర్వాత ఆమె మళ్ళీ అతణ్ని కలుసుకోలేదు. నరేంద్ర కూడా తా మొకరికొకరు దూరంగా ఉండడమే మంచిదనుకుని ఊరుకున్నాడు తప్ప ఆమె గురించి తెలుసు కొనేందుకు ప్రయత్నించలేదు.

అలా నెలరోజులు గడిచాయి.

ఒకరోజున నరేంద్రకు ఉత్తరం వచ్చింది విశాలాక్షి నుంచి.

"డియర్ నరేంద్రా!

అంతా అయిపోయింది. గౌతమ్ తన పవాల్లో నెగ్గాడు. నేనిక నీకు నా ముఖం చూపించలేను'

సెలవు. విశాలాక్షి."

ఇంతే ఆ ఉత్తరం....

నరేంద్రకా ఉత్తరం చదవగానే కళ్ళు తిరు గుతున్నట్లయింది... అలా జరుగుతుందని అతడనుకోలేదు. ఆరోజే అతడు విశాలాక్షిని కలుసు కునేందుకు ప్రయత్నించాడు.

విశాలాక్షి ఇంట్లోనే ఉంది. అతికష్టంమీద ఆమె అతడి ఎదుటకు వచ్చింది.

"ఏం జరిగింది విశాలా?" అనడిగాడు.

"ఏం జరిగిందో తెలుసుకోవాలనుకుంటే నన్నడక్కు. జరిగింది నేను గుర్తుచేసుకోలేను. దయుంచి వెంటనే వెళ్ళిపో. నా మనసు బాగోలేదు. నేను బాగా అప్సె ట్టయ్యాను. ఆత్మహత్య చేసుకోలేదంటే ఇంకా ఆశ్చ ర్యంగా ఉంది. నీకు సంబంధించి నేను చనిపోయినట్లే లెక్క...." అందామె.

"అయితే గౌతమ్‌ను పెళ్ళిచేసుకుంటావా?"

విశాలాక్షి కళ్ళెర్రబడ్డాయి—"వాడిని పెళ్ళిచేసుకోవడం ఈ జన్మకు జరగని పని. నేను వీలుంటే స్వయంగా నా చేతులతో చంపాలనుకుంటున్నాను. అదే యిప్పుడు నా జీవితాశయం..."

"వద్దు విశాలా! నీవంటి సుకుమారి ఇప్పుడు హత్యల గురించి ఆలోచించకూడదు. నీముందింకా నూరేళ్ళ జీవితముంది...."

"నా సుకుమార జీవితం ఓ కిరాతకుడి చేతిలో నలిగిపోయింది. దాంతో నా మనసు గట్టిపడి శిలగా మారిపోయింది. ఇక నీవేమీ చెప్పకు. నా దారి నాది. నీ దారి నీది...."

నరేంద్ర ఆమెతో ఇంకా మాట్లాడాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. అతడు తన గదికి వెళ్ళిపోయాడు. అతడు గదిలో మంచంమీద పడుకుని ఆలోచిస్తూండగా దగ్గరగా మూసి ఉన్న తలుపు తోసుకుని లోపలకు గౌతమ్ వచ్చాడు. అతడ్ని చూస్తూనే నరేంద్ర ఉలిక్కిపడి లేచాడు.

"నన్ను గుర్తుపట్టావా?" అన్నాడు గౌతమ్ నవ్వుతూ.

"ఇక్కడికెందుకొచ్చావ్?" అన్నాడు నరేంద్ర.

"అయ్యో! నువ్వు నా కోసం వెతుకుతూ ఉంటావనుకుని జాలిపడి నేనే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను...."

"ఎందుకు?"

"నువ్వు నిజంగా విశాలాక్షిని ప్రేమిస్తూంటే నీకు నన్ను చంపేయాలన్నంత కోపముండి ఉండాలి...."

గౌతమ్ వంక అదోలా చూస్తూ—"నాకు నువ్వంటే కోపమూ ఉంది. విశాలాక్షిపట్ల ప్రేమా ఉంది. కానీ నిన్ను చంపాలని అనుకోవడంలేదు—" అన్నాడు.

"ఎందుకని?"

"నిన్ను చంపితే నేను హంతకుడినై ఉరికంబ మెక్కాలి. అందువల్ల ఏం ప్రయోజనం సాధించినట్లు? పవిత్ర గంగాజలం పాపుల్ని శుద్ధి చేస్తుందితప్ప పాప పంకిలం కాదు. నేను విశాలాక్షిని పెళ్ళిచేసుకుంటాను. సుఖంగా జీవితం గడుపుతాను—"

గౌతమ్ నవ్వి—"విశాలాక్షిని గంగతో పోలుస్తున్నావు. అంటే ఆమెను ప్రతిరోజూ ఒక పాపికి అప్పగించుకుంటావా?" అన్నాడు.

నరేంద్ర ముఖం ఎర్రబడింది—"సరిగ్గా మాట్లాడు-" అన్నాడు.

"నేను సరిగ్గా ఆలోచిస్తున్నాను కాబట్టి సరిగ్గానే మాట్లాడుతున్నాను. నీ మాటలే సరిగ్గా లేవు విశాలాక్షి దగ్గరైనప్పుడల్లా నేను నీకు గుర్తుకొస్తూంటాను. నువ్వు సుఖపడలేవు...."

"అయితే యేమంటావ్?"

"విశాలాక్షిని నేనే పెళ్ళి చేసుకుంటాను. నువ్వు తక్షణం ఈ ఊరొదిలి వెళ్ళిపో. మళ్ళీ మా కెవ్వరికీ నీ ఊసుకూడా తెలియకూడదు"

"ఎందుకని?"

"ప్రస్తుతానికి చలపతి నామీద పీకదాకా పగ బట్టాడు. నన్నాయన బ్రతకనివ్వడు. తన కూతురు నిన్ను ప్రేమిస్తోందని ఆయనకు తెలుసు. ఏదో ఒకరోజున విశాలాక్షిని నీకు కట్టబెట్టచ్చునన్న ఆశ ఆయనకుంది. నువ్వు లేకపోతే ఆయనకు నేను తప్ప గతిలేదు. నువ్వు కనపడకుండాపోతే ఆయన నన్నేమీ చేయడు. తాత్కాలికావేశం దిగజారి మామూలు మనిషయ్యాక ఆయన

నా ప్రయోజనం కూడా గుర్తిస్తాడు...."

"నేనెక్కడికీ వెళ్ళను. నా విశాలను కష్టాల్లోనూ, దుఃఖంలోనూ వదిలి నేనెక్కడికీ వెళ్ళలేను. నేనిక్కడే ఉంటాను. ఆమెనోదార్చుతాను...."

నరేంద్ర ఇంకా యేదో అనబోతూ ఆగిపోయాడు.

గౌతం చేతిలో పదునైన కత్తి మెరుస్తోంది.

"కత్తినెందుకు తీశావ్?" అన్నాడు నరేంద్ర.

"నువ్వు నా మాట వినకపోతే నేను నిన్ను చంపాలనుకుంటున్నాను. అయితే అందుకు గడువిస్తున్నాను.." అంటూ ఆ కత్తిని నేలమీద పెట్టి నాలుగడుగులు వెనక్కు వేసి."పదంకెలు లెక్కపెట్టేలోగా నీ నిర్ణయం చెప్పు. నేను నిన్ను చంపేదీ లేనిదీ నీ నిర్ణయంమీద ఆధారపడి ఉంటుంది...." అన్నాడు.

"ఎంత ధైర్యం నీకు? నా గదికి వచ్చి నన్నే చంపుతానంటావా?"

"నీలాంటి పిరికివాడి ముందు నాలాంటి వాడికేం__ నీకంటే పిరికివాడిక్కూడా ధైర్యం వస్తుంది...."

"నేను పిరికివాడిననుకుంటే నువ్వు పొరబడ్డావు...."

"లేను. ప్రేమించిన ఆడదాన్ని బలవంతంచేసిన నేను నీ ఎదురుగా నిలబడ్డాను. నన్నేమీ చేయాలనిపించడం లేదు. నా కళ్ళలోకి సూటిగా చూడు. నీవు నిజంగా పిరికివాడివి. కాకపోతే నన్ను చంపాలనుకుంటావు...." అన్నాడు గౌతం.

అప్పుడు నరేంద్రకేమయిందో తెలియదు. అతడు మెరుపు వేగంతో నేలమీది కత్తిని తీసుకున్నాడు. గౌతంను నేలమీద పడగొట్టాడు.

"ఏయ్....నన్ను చంపకు...." అన్నాడు గౌతం.

"అయితే నాతో చలపతి ఇంటికిరా. విశాలాక్షి కాళ్ళమీద పడు. నీ తప్పుకు చలపతి వేసే శిక్షను ధైర్యంగా అనుభవించు...." అన్నాడు నరేంద్ర.

"నాకు షరతులు చెప్పకు. నన్ను కావాలనుకున్నా నువ్వు చంపలేవు. నువ్వు చంపినా నేను మళ్ళీ తిరిగి రాగలను. నీకు అనుమానముంటే పరీక్షించుకో. ఇప్పుడు నేను గౌతంని. నువ్వు నన్ను చంపితే నేను పునర్జన్మ నెత్తి తిరిగివస్తాను. అప్పుడు నేను నువ్వు కోరిన పేరుతో పలుకుతాను. నీకేం పేరుకావాలో చెప్పుకో. ఆ పేరుతో నే నిన్ను పలకరిస్తాను—"

"నువ్వు నన్ను భయపెడుతున్నావు...."

"భయంకాదు. నా శక్తిసామర్థ్యాలకు ఋజువు.... పేరు చెప్పు...."

"విభీషణ్...." అన్నాడు నరేంద్ర చటుక్కున.

"విభీషణా.... ఆదేం పేరు! నేను చలపతిలాంటి రాక్షసుడికి ద్రోహం చేసిన మంచిరాక్షసుడినా?"

"నువ్వేమైనా అనుకో — నీకు పేరు పెట్టడానికి నేనెక్కువగా ఆలోచించలేదు. నోటికి వచ్చిన పేరు చెప్పాను...."

"పేరు చెప్పావు. అయితే నన్ను చంపుతావా? నీకంత ధైర్యమా?"

గౌతం ఇంకా యేదో అనబోతుండగా నరేంద్ర కత్తిని సూటిగా అతడి గుండెల్లో దింపాడు. రక్తం ఉవ్వున చిమ్మింది. గౌతం పెద్దగా కేక పెట్టబోగా— నోరు నొక్కి ఆపేశాడు.

కాసేపటికి గౌతంలో చలనం ఆగిపోయింది. ఒళ్ళు చల్లబడింది.

నరేంద్రకు జరిగింది తెలిసింది. అతడికి భయం వేసింది. గుండె చిక్కబట్టుకునేందుకతడికి కాసేపు పట్టింది.

తను చంపింది ఓ దుర్మార్గుడ్ని. కిరాతకుడ్ని. తను జైల్లో పనిచేసే ఉరితీసే మనిషి—అనుకుంటే చేసినపని న్యాయమైనదే అవుతుంది.

“నేను నేరం చేయలేదు....” అని సరిపెట్టుకున్నాడు నరేంద్ర.

తర్వాత అతడు గదంతా శుభ్రం చేశాడు. ఎక్కడా రక్తం మరకలు లేకుండా తుడిచాడు. కనుచీకటి పడే దాకా ఆగి వీధిలోకి వచ్చాడు. అక్కడ గౌతం కారుంది. వీధిలో ఎవ్వరూ మసలడంలేదు.

నరేంద్ర శవాన్ని కారు డిక్కీలోకి చేర్చాడు. కారును డ్రైవ్ చేసుకుంటూ ఓ కొండప్రాంతాలకు వెళ్ళాడు. అక్కడ్నుంచి డిక్కీలోని శవాన్ని అగాధంలోకి తోసేశాడు. గౌతంలో ఏమాత్రమైనా ప్రాణం మిగిలివుంటే ఆ దెబ్బతో పోయుండాలి.

తర్వాత నరేంద్ర కారు డ్రైవ్ చేసుకుంటూ ఊళ్ళోకి వచ్చాడు. ఒకచోట కారును వదిలిపెట్టి ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.

తర్వాతేం జరిగిందో అతడికి తెలియదు.

మర్నాడు నిద్రలేచేసరికి జరిగిందంతా కలలా ఉందతడికి.

రెండురోజులపాటు బయటి ప్రపంచాన్ని చూడ్డానికి కూడా భయపడ్డాడతడు. కానీ తను గౌతంను చంపేనన్న విషయం విశాలాక్షికి తెలియజేయాలనుకున్నాడతడు.

“డియర్ విశాలా!

నేను నీ తరపున గౌతంపై పగతీర్చుకున్నాను.

అతడ్ని నా గదిలో కత్తితో పొడిచి చంపి శవాన్నతడి కార్లోనే తీసుకుని వెళ్ళి కొండమీది నుంచి అగాధంలోకి తోసేశాను. కానీ నన్నభినందించడానిక్కూడా నా దగ్గర రావద్దు. నన్ను మరిచిపో. గౌతం చేసిన తప్పుకి నిన్ను నీవు నేరస్తురాలిగా భావించుకున్నావు. నాకు దూరంగా ఉండాలనుకున్నావు. నేను స్వయంగా తప్పు చేసినాను కాబట్టి నువ్వు క్షమించినా నన్ను నేను క్షమించుకోలేను. నేను నేరస్థుడ్ని. నేనిక సుఖ జీవితానికి అర్హుణ్ని కాదు. నా నేరం నన్ను సాధించి వేధిస్తుంది. మన మిక ఒకరినొకరు మరిచిపోదాం. సెలవు. నీ

నరేంద్ర."

ఈ ఉత్తరాన్నతడామెకు పోస్టు చేశాడు. ఆమె ఈ ఉత్తరం సాయంతో తనను పోలీసుల కప్పగిస్తుందని కానీ తన నేరానికి తను సాక్ష్యం వదిలిపెడుతున్నానని గానీ అతడు భయపడలేదు.

అతడు విశాలాక్షిని ప్రేమిస్తున్నాడు. ప్రేమ ఉన్న చోట అపనమ్మకముండదు. నరేంద్ర నమ్మకం వృధా పోలేదు. విశాలాక్షి అతణ్ని కలుసుకోలేదు. పట్టించే ప్రయత్నం చేయలేదు.

ఇద్దరూ ఒకరికొకరు దూరంగా ఉంటున్నారు.

అలా మూడు నెలలు గడిచాయి.

ఈరోజా విభీషణ్ పేరుతో అతడికో ఉత్తరం వచ్చింది.

విభీషణ్ పేరు చనిపోయేముందు క్షణాలలో

గౌతంకి నరేంద్ర పెట్టిన పేరు. ఆ తర్వాత అది మరొకరికి చెప్పే అవకాశం లేకుండా అతడి ప్రాణాలు పోయాయి. కత్తిపోటుకే అతడు చచ్చిపోయాడు. ఆపైన కొండపైనుంచి అగాధంలో పడ్డాడు. అటువంటివాడు బ్రతికిరావడం అసాధ్యం.

కానీ వచ్చినట్లే వుంది. ఎలా జరిగింది?

"అన్నింటికీ కాలమే జవాబు చెబుతుంది—" అనుకున్నాడు నరేంద్ర.

## 3

సాయంత్రం నాలుగున్నరకు హోటల్ గజపతిలో రూం నంబరు పదహారు తలుపులు తట్టాడు నరేంద్ర.

"కమిన్—తలుపులు తీసుకుని రావచ్చు—" అన్న గొంతు లోపల్నుంచి వినిపించింది. అది గౌతం గొంతు....

నరేంద్ర తలుపు తోసుకుని లోపలకు వెళ్ళాడు.

"తలుపు గడియ పెట్టు నరేంద్రా!" అన్నాడు గదిలోని వ్యక్తి. అతడి వీపు మాత్రం నరేంద్రకు కనబడుతోంది.

నరేంద్ర తలుపు గడియ పెట్టాడు.

ఆ వ్యక్తి వెనక్కు తిరిగాడు.

"గౌతం!" అన్నాడు నరేంద్ర ఆశ్చర్యంగా.

"గౌతం కాదు....విభీషణ్..." అన్నాడతడు.

"నువ్వు....ఎలా బ్రతికొచ్చావు?"

"నేను బ్రతికిరాలేదు. బ్రతికున్నప్పుడులేని అద్భుత శక్తులతో తిరిగి వచ్చాను. నావంటి వాళ్ళకు బ్రతుకు కంటే చాలా పెద్ద వరం....నా శక్తిసామర్థ్యాలు చూస్తావా?" అన్నాడు విభీషణ్.

నరేంద్ర మాట్లాడలేదు.

విభీషణ్ ఉన్నట్లుండి గాలిలోకి లేచాడు. సముద్రం దాటిన హనుమంతుడిలా గాల్లో తేలుతూ కాసేపుతిరిగి నేలమీదకు దిగి—"చూశావా?" అన్నాడు.

నరేంద్రకు ముచ్చెమటలుపోశాయి.

"నువ్వు నన్నెందుకు పిలిచావు?"

"నీతో నాకు ముఖ్యమైన పనుంది...."

"నీకు నామీద పగ లేదా?"

"నాకు అద్భుత శక్తులతోకూడిన పునర్జన్మనిచ్చావు. నీమీద నాకు కోపమెందుకు? పైగా నీనుంచి నేను కొన్ని ప్రయోజనాలు సాధించాలనుకుంటున్నాను కూడా—" అంటూ నవ్వాడు నరేంద్ర.

"ఏమిటవి?"

"నువ్వు విశాలాక్షికి దూరంగా ఉండకు. ఆమె మానసికస్థితి యిప్పుడు మామూలయింది. నువ్వు చిత్తశుద్ధితో ప్రయత్నిస్తే విశాలాక్షి నిన్ను పెళ్ళి చేసుకుంటుంది. మీ పెళ్ళి జరగాలన్నది నా కోరిక...."

"అందువల్ల నీకేం ప్రయోజనం?"

"విశాలాక్షి మంచిది. ఆమెపట్ల నాకు కోపంలేదు. కానీ చలపతి నరరూప రాక్షసుడు. అతడి ఆటకట్టించాలి. అందుకు నేను నీ సాయం కోరుతున్నాను..."

"అద్భుత శక్తులున్న నీకు సాయమా?" అన్నాడు నరేంద్ర ఆశ్చర్యంగా.

"నా శక్తి మనుషులను భయపెట్టడానికేగానీ మరెందుకూ పనికిరాదు. చలపతిలాంటి వాడిని జయించడానికి అద్భుత శక్తులు సహకరించవు. నీలాంటివారే పనికివస్తారు. నీవు అతడింటికి వెళ్ళి మాటలతో మభ్యపరిచి వాళ్ళింట్లో

ఓ మనిషివిగా, విశాలాక్షిని పెళ్ళిచేసుకో. నీ ద్వారానే చలపతి పతనం కావాలి. అందుకు నేను నా అద్భుత శక్తులతో నీకు సహకరిస్తాను చలపతింట్లో ఎక్కడెక్కడ కీలక పత్రాలు దొరుకుతాయో నేను నీకు చెబుతాను. వాటి సాయంతో చలపతిని కొంతకాలం మానసికంగా కృంగించి తర్వాత పోలీసుల కప్పజెప్పవచ్చు...." అన్నాడు విభీషణ్.

"నేను నీ మాట వినను. భయపడనివాళ్ళను నువ్వేమీ చేయలేనని నువ్వే చెప్పావు—" అన్నాడు నరేంద్ర.

"నేనేమీ చేయలేనిమాట నిజం. కానీ అద్భుత శక్తులతో సామాన్య మానవుడు తెలుసుకోలేని విశేషాల నెన్నింటినో నేను తెలుసుకోగలను. నువ్వు నామాట వినకపోతే నా మాట వినేవారు మరికొందరు దొరుకుతారు. వాళ్ళను చలపతిమీద కేకాదు—నీమీద కూడా ప్రయోగిస్తాను. నీ జీవితం నరకమవుతుంది. నిన్ను నీడలా వెంటాడి వేధిస్తాను. నాతో శత్రుత్వం నీకు మంచిది కాదు. నాతో స్నేహం నిన్నెన్నో విధాలా కాపాడుతుంది...."

"అయితే నేనాలోచించుకోవాలి. అందుకు వ్యవధి కావాలి...."

"ఆలోచించుకో. కానీ వ్యవధి ఇరవై నాలుగుగంటలు మాత్రం. మరో షరతు, నే నిలా దెయ్యాన్నై తిరుగుతున్నట్లు నీకు తప్ప ఇంకెవ్వరికీ తెలియకూడదు...."

"ఎందుకని?"

"చలపతివంటి వాడికి ఏ ఆధారమూ దొరక్కుండా శిక్ష లభించాలి. ఆధారం దొరికిందంటే అద్భుతశక్తుల్ని కూడా దెబ్బతీయగల మొనగాడాయన—"

"సరే—" అన్నాడు నరేంద్ర సాలోచనగా.

"రేపు సరిగ్గా ఇదే సమయానికిక్కడకు రా—" అన్నాడు విభీషణ్.

## 4

నరేంద్ర వెంటనే చలపతి ఇంటికి వెళ్ళలేదు.

కాసేపతడు బీచివద్ద గడిపాడు. ఉన్నంతసేపూ అతడికి విభీషణ్ గురించిన ఆలోచనే!

చనిపోయిన గౌతం ఎలా తిరిగొచ్చాడు? చనిపోయే ముందుచేసిన వాగ్దానాల్ని నిలబెట్టుకోడానికీ, కోరికలు తీర్చుకోవడానికీ మనిషినావహించుకుని ఉన్న ఆత్మ దెయ్యమై తిరిగి వస్తుందా? హోటల్ గదుల్లో బస చేస్తుందా?

విభీషణ్ పేరు మరో వ్యక్తికి తెలియడానికి వీల్లేదు కాబట్టి—హోటల్లో మకాం చేసిన వ్యక్తి అచ్చం గౌతం లాగే ఉన్నాడు కాబట్టి—ఇంకేమీ సందేహంలేదు. వచ్చిన వ్యక్తి గౌతం! ఆ గౌతంని తను స్వయంగా హత్యచేశాడు. శవాన్ని కొండమీంచి అగాధంలోకి తోసేశాడు. కాబట్టి వచ్చినది వ్యక్తి కాదు—గౌతం ఆత్మ!

ఆ ఆత్మ తన్ను చలపతికి వ్యతిరేకంగా పనిచేయమని శాసిస్తోంది. తనమాట వినకపోతే యేమైనా చేయగలనని బెదిరిస్తోంది.

ఇప్పుడు తనేం చేయాలి?

బాగా ఆలోచించేక ఒకవిధంగా ఇదీ మంచిదేనని పించింది నరేంద్రకు. విశాలాక్షి గౌతంకు లోబడిపోయిందని తెలిసేక తనాకసితో గౌతంను చంపేశాడు. ప్రతి పన్న శత్రువుని చంపేయడం బాగానే ఉంది. ప్రతిపన్న

ప్రియురాలి నేం చేయాలి?

తానొక హంతకుడినన్న భ్రమలో ప్రియురాలిని విస్మరించాడు నరేంద్ర. చనిపోయిన గౌతం విభీషణ్ పేరుతో తిరిగివచ్చాడు. సంతోషంగా ఉన్నాడు. అతడికి తనపై కోపంలేదు. తనుమాత్రం విశాలాక్షి నెందుకు విస్మరించాలి?

హత్యచేసి తను నేరస్థుడయ్యాడు. బలాత్కారానికి గురైన ప్రియురాలిని విస్మరించి తన నేరాల సంఖ్యను పెంచుకోవడం సబబుకాదు.

నరేంద్ర లేచినిలబడ్డాడు. అతడికి విశాలాక్షిని కలుసుకోవాలని ఆత్రుతగా ఉంది. ఎలాగో అలా ఆమెను సంతోషంగా ఉంచాలి.

అయితే తనిప్పుడు విభీషణ్ కి సహకరించి చలపతిని కష్టాలపాలు చేయబోతున్నాడు. తండ్రిని కష్టాలపాలు చేసే కూతురు సంతోషంగా ఉండగలదా?

కానీ చలపతి నేరస్థుడు. సమాజ విద్రోహి....

ఇలా ఆలోచించగానే నరేంద్రకు నవ్వొచ్చింది.

ఈ సమాజం నేరస్థులతో నిండిపోయి వుంది. చిన్న నేరాలు చేసినవాడు సామాన్యుడిగా వుండిపోతున్నాడు. పెద్ద నేరాలు చేసేవాడు పెద్దమనిషి అవుతున్నాడు. ఏ నేరాలూ చేయనివాడు సామాన్యులలో సామాన్యులై అసామాన్య నాయకులను నేరస్థుల నుంచి ఎన్నుకుంటున్నాడు.

ఎవరెలాపోతే తనకెందుకు? చట్టం, సమాజం భరిస్తున్న నేరాలను తానెందుకు ఎదురీదాలి?

"చలపతి నేరాలతో నాకు నిమిత్తంలేదు. నేనతడి నేరాలలో పాలుపంచుకోను. చట్టవిరుద్ధం కాదనిపించే

విధంగా ముందు జీవితం గడుపుతాను....” అనుకున్నాడు నరేంద్ర.

అప్పుడతడికి తను చేసిన హత్య గురించి గుర్తుకు వచ్చింది.

నరేంద్ర యెక్కువగా ఆలోచించకుండా తిన్నగా చలపతి ఇంటికి వెళ్ళాడు. చలపతి అతణ్ని చూసి—“ఏం నాయనా! ఇన్నాళ్ళకు నీకు మళ్ళీ నా యిల్లు గుర్తొచ్చిందా?” అన్నాడు.

“నేను మీ యింటికి రాకపోవడానికి కారణం మీ అమ్మాయికి తెలుసు. అన్నీ నేనామెకు ఉత్తరంలో రాశాను. జరిగిన ఘోరానికి మనసు చిక్కబట్టుకునేందుకే వ్యవధి కావలని వచ్చింది....” అన్నాడు నరేంద్ర.

“అయితే మా అమ్మాయిని పెళ్ళిచేసుకుంటావా?”

నరేంద్ర తల అడ్డంగా ఆడించి—“అది నావల్ల కాదు. ఎందుకో మీ అమ్మాయికి తెలుసు ” అన్నాడు.

“నాకూ తెలుసు. నీలాంటివారి ప్రేమ అందమైన అమ్మాయికి ప్రియుడు కావడానికే! ఆపదలో వున్న ప్రియురాలికి చేయూతనిచ్చే బాధ్యత నీకున్నట్లు నీ ప్రేమ నీకు చెప్పలేదా?”

“మీరు పొరబడ్డారు. నేను విశాలాక్షిని ప్రాణం కంటె మిన్నగా ప్రేమించాను కాబట్టే నేరానికి అమడ దూరంలో వుండాలనుకునే నేను గోవిందును నా చేతులో కత్తితో పొడిచి చంపాను. ఆవిధంగా నేను హంతకుడ్ని' నేరస్థుడ్ని. విశాలాక్షి అత్యాచారానికి గురయింది' అందులో ఆమె తప్పేమీలేదు. అందువల్ల ఆమె పవిత్రురాలు. ఒక హంతకుడిగా నేనామె జీవితంలో ప్రవేశించలేను. ప్రవేశించి సుఖపెట్టలేను....”

"సరే—ఇవన్నీ నీబోటి బూటకపు ప్రేమికుడు చెప్పే కబుర్లే! ఇప్పుడు నువ్వు నాకాళ్ళట్టుకుని ప్రతిమాలినా నా కూతుర్ని నీకివ్వను. ఎందుకో తెలుసా?" అన్నాడు చలపతి. తెలియదన్నట్లు నరేంద్ర తలాడించగానే ఆయన అసలు విషయం వివరించి చెప్పాడు.

గౌతంచేత అత్యాచారానికి గురైన రెండుమాసాలకు విశాలాక్షికి తను ఒత్తమనిషి కాదన్న అనుమానం కలిగింది. ఆమెను వెయ్యికళ్ళతో కనిపెట్టి కాపాడుకుంటున్న చలపతి — తనకు బాగా పరిచితురాలైన ఓ లేడీ డాక్టరుకు విషయం చెప్పి తన కూతురికి అబార్షన్ జరిపించమనీ, ఈ విషయం రెండో కంటికి తెలియకూడదనీ కోరాడు. లేడీ డాక్టరు విశాలాక్షిని పరీక్షించి ఒక ఆశ్చర్యకరమైన విశేషం చెప్పింది.

విశాలాక్షి గర్భవతికాదు. అంతవరకూ ఆమె పురుష స్పర్శనే ఎరుగదు.

"అదెలా సాధ్యం?" అన్నాడు నరేంద్ర ఆశ్చర్యంగా.

"అదే అందరికీ అనుమానం వచ్చింది. తర్జన భర్జనలు చేయగా ఒకవిధంగా జరిగుండవచ్చుననిపించింది. నా గురించి బాగా తెలిసిన గౌతం నా కూతురిపై అత్యాచారం చేయలేడు. వాడామెను హిప్నొటైజుచేసి తనామెను బలత్కారం చేశాడన్న భ్రాంతిలో వుంచాడు."

"అలా జరిగే అవకాశముంటుందా?" అన్నాడు నరేంద్ర.

"నేను గౌతం గురించి ఆరాతీయగా అతగాడికి హిప్నొటిజంలో మంచి ప్రావీణ్యముందనీ—దాన్నతడు

నేరాలు చేయడానికి కాక — నేరాలు చేసిన భ్రాంతి కలిగించడానికే ఉపయోగిస్తాడనీ తెలిసింది...."

"ఈ విషయం నాకు వెంటనే ఎందుకు చెప్పలేదు?"

"నమ్మతగదిగా వుండని ఈ నిజాన్ని నీదాకా రానివ్వడానికి అమ్మాయి అంగీకరించలేదు...."

"అయితే గౌతం నన్ను కూడా అలాంటి భ్రాంతికే గురిచేశాడేమో. లేకుంటే నేను హత్యలు చేయలేను...." అంటూ నరేంద్ర తన అనుభవం మొత్తం చలపతికి— వివరించాడు.

అంతా విన్న చలపతి "అర్థమయింది. గౌతం నా కూతుర్ని పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. ఆమెను బలత్కార భ్రాంతికి గురిచేశాడు. అది తెలిస్తే నేను బ్రతకనివ్వనని తెలిసి నన్ను నమ్మించడానికి నీచేత చంపబడిన భ్రాంతిని నీకు కలిగించాడు. గౌతం చనిపోయాడనే నేననుకున్నాను. బలాత్కారానికి గురైన భ్రాంతిలో నా కూతురు తన్ను పెళ్ళాడుతుందన్న భ్రమ తొలగిపోగానే గౌతం నాకు భయపడడం ప్రారంభించాడు. నిన్ను, నా కూతుర్ని హిప్నాటిజానికి గురిచేసి-ఇప్పుడు నన్ను సాధించాలనుకుంటున్నాడు .... ఇలా జరిగుంటుందన్న ఊహే నాకు రాలేదు. చాలా చిత్రంగా వుంది...." అన్నాడు.

కాసేపు నరేంద్రకు నోట మాటరాలేదు.

గౌతం విభీషణ్‌గా ఎలా వచ్చాడో ఇప్పుడు తెలిసిపోయింది. అసలిలా జరిగుండవచ్చునన్న అనుమానం తన కెందుకు రాలేదో?

"ఇప్పుడు నేనేం చేయాలి?" అన్నాడు నరేంద్ర.

"నేను నీకో ఉత్తరం రాసిస్తాను. అది తీసుకుని వెళ్ళి

రేపు గౌతంని కలుసుకో. కథ సుఖాంతమవుతుంది ..."
అన్నాడు చలపతి.

"అంటే?"

చలపతి మారుమాట్లాడకుండా ఉత్తరం వ్రాయసాగాడు. ఆయన వ్రాస్తూంటే ఏం వ్రాస్తున్నాడోనని కుతూహలంగా చదవసాగాడు నరేంద్ర.

"డియర్ విభీషణ్!

నిన్ను నేను, నా కూతురు మనస్ఫూర్తిగా క్షమిస్తున్నాం. మోసంచేయగల స్థితిలో కూడా నీవు నీ విద్యను మోసానికి ఉపయోగించలేదు. అందుకు నిన్నభినందిస్తున్నాను. నీకు కృతజ్ఞుణ్ణి కూడా!

నాకు భయపడి నామీద కత్తికడితే—కత్తి పడేది నీమీదేనని నీకూ తెలుసు. నేను నీ భయం పోగొట్టాను కాబట్టి నువ్వు నీ కత్తిని ఒరలో పెట్టు.

విశాలాక్షి నీకు పనికిరాదు. నరేంద్ర నాకు పనికిరాడు. వాళ్ళిద్దర్నీ వాళ్ళకు నచ్చిన బాటలో జంటగా నడవనిద్దాం.

ప్రస్తుతానికి నీదీ నాదీ ఒకే బాట! నాకు సమాంతరంగా వేరే బాటలో నడవాలనుకోక- నా బాటలోకే రా!

నిన్ను గాలిలోంచి నేలకు దింపి మళ్ళీ గౌతంని చేయడానికే ఈ ఉత్తరం. అర్థమయింది కదూ!

నీ శ్రేయోభిలాషి

చలపతి"

అప్పుడు నరేంద్రకో అనుమానం వచ్చింది.

## 43

గౌతం కలిగించిన భ్రాంతి అద్భుతం! అటువంటి గౌతంని భయపెట్టి శాసించగల చలపతి మరో అద్భుతం!

అయితే గౌతం తనకు భ్రాంతి కలిగించాడా లేక గౌతమ్ తనకు భ్రాంతి కలిగించాడన్న భ్రాంతిని చలపతి కలిగించాడా?

ఏది నిజం? ఏది భ్రాంతి?

—:అ యి పో యిం ది:—

# హంతకుడి ఫోటోలు

## బొమ్మిడి అచ్చారావు

చాలా మంద్రస్వరంలో వినిపిస్తూన్న వెస్ట్రన్ మ్యూజిక్ మనోరంజకంగా వుంది.

"ఏమిటలా చూస్తున్నావు? ఐస్‌క్రీం తిను, కరిగి పోతోంది" అన్నది వినీల కళ్ళు అరమోడ్పులుగా చేసి శ్రీధర్ వైపు చూస్తూ.

అతనామె అందమైన కృశతంకే తదేక దీక్షతో చూస్తున్నాడు.

ఎ.సి. చెయ్యబడ్డ ఆ రెస్టారెంట్ గదిలో ఓ మూలగా వున్న టేబిల్ దగ్గర కూచున్న వాళ్ళందరికీ చుట్టూ యింకా మైనపు బొమ్మలా కదులుతున్న మనుషుల గురించి పట్టడంలేదు. ఆ గదిలో ఆ మాటకొస్తే ఆ లోకంలోనే తామిద్దరే వున్నట్టు 'అంతా ప్రేమమయం, జగమంతా ప్రేమమయం' అన్నట్టు లోకంలోని ఏ శక్తి తమని విడదీయలేనట్టు తన్మయత్వంలో వున్నారు.

"నిన్నిలా చూసే హక్కు, అధికారం నాకు తప్ప

మరెవరికున్నాయి?" అన్నాడు గర్వంగా.

"సరే, దానిక్కూడా ఓ సమయం, సందర్భం, స్థలం వుంటాయి. మన మిక్కడికొచ్చింది ఇలా ఒకర్నొకరు చూసుకుంటూ వుండిపోవటానికి కాదు. ముఖ్యమైన సమస్యని చర్చించటానికి!"

"అఫ్‌కోర్స్, ఇదీ అంత ముఖ్యమైనదే!"

"ఏమిటి, గుడ్లప్పగించి చూడటమా?"

"నీలో బొత్తిగా రసాస్వాదన కరువై పోతోంది దేవీ! ఇలా ఒకరి కళ్ళలోకి మరొకరు రెప్పవెయ్యకుండా చూసుకుంటూ, ఆ చూపుల్లో సుధారసాన్ని చిమ్ముకుంటూ, అనురాగాన్ని, ప్రేమని, ఆత్మీయతని, నిష్కామమైన కోరికని ప్రకటించుకుంటూ గంటలతరబడి గడిపి వేయగలగటం ఓ గొప్ప ఆర్టు తెలుసా?"

"తెలుసు మహాశయా! ఈ ఆర్టుని ప్రదర్శించుకోటానికి ముందు ముందు చాలా రోజులున్నాయి. బోలెడు భవిష్యత్తుంది. ఇప్పుడే ఆ డ్రిల్ పోగొట్టుకుంటే జీవితం నిస్సారమైపోతుంది. సో.... పాయింట్‌కిరా!"

"ప్రస్తుతం పాయింట్ దగ్గరే వున్నాను" అతని చూపులు ఉత్తుంగ తరంగాల్లో లేచిపడ్తున్న ఆమె సమున్నత వక్షస్థలంమీద వున్నాయి.

"ఛీ, నీకు బొత్తిగా సిగ్గులేదు" అన్నది అందంగా సిగ్గుపడుతూ వినీల.

"వినూ ఐ లవ్ యూ సో మచ్."

"ఐ టూ శ్రీ!..డోంట్ వేస్టు టైం. మన కార్యక్రమం గురించి మాట్లాడు. మీ వాళ్ళతో మన విషయం కదిలించావా?"

"ఇంకా లేదు...మా డాడీ మూడ్ బావోలేదు,

ఈమధ్యనే వ్యాపారంలో రెండు లకారాలకి నష్టం వాటిల్లి బెంగగా దిగులుగా వున్నాడు. ఇప్పుడు మన సంగతి చెప్పటంవల్ల మంచికన్నా చెరుపే జరిగే అవకాశాలెక్కువ."

"మరి..మరి..మా యింట్లో నా పెళ్ళి గురించి ఒత్తిడెక్కువైపోయింది. ఈ సంవత్సరంతో నా డిగ్రీ పూర్తయిపోతుందిగా! వేసవిలో పెళ్ళిచేస్తామంటున్నారు."

"వేసవిలోనేగా! ఇంకా మూడ్నెల్ల టైముంది. పరిస్థితులు చక్కబడటానికి వొక్క నెల చాలు. నాక్కూడా నిన్ను దూరంగా వుంచాలంటే చాలా బాధగా వుంది. ఎప్పుడో అకస్మాత్తుగా నిన్నేమైనా చేసేస్తానేమోనని భయంగా వుంది."

"ఓహో, నీ కడుపులో యిలాంటి దురాలోచన కూడా వుందన్నమాట. అయితే రేపట్నుంచి నీకు కనిపించను."

"అహాహా, అంత పెద్ద శిక్ష విధించకు రాణీ, భరించలేను....ఏమైనా చేస్తానని భయంగా వుందన్నానుగా! అలా చెయ్యటానిక్కూడా చాలా ధైర్యం కావాలి, బట్ ఆయామ్ టిమిడ్!"

"నువ్వు పిరికివాడివేం కాదు—హీమాన్‌వి."

"నువ్వు ఆదివారం సీరియల్స్ టి.వి.లో చూస్తున్నావని నాకు తెలుసు. వాటిని చూసి మర్చిపో!"

"ఉహు, మరచిపోను. ఈ సీరియల్స్‌లో కొన్నిటికి జనం బాగా ప్రతిస్పందిస్తున్నారని ఇటీవల కొన్ని చర్యలు స్పష్టం చేశాయి. అందుకే ఈసారి నేషనల్ ప్రోగ్రామ్స్‌లో వచ్చే సీరియల్స్ మిస్ కాకూడదనుకుం

టున్నాను."

ఆమె ఏ సీరియల్ గురించి చెప్తున్నదీ అర్థమయ్యింది శ్రీధర్ కి. దాని విషయమై యెంత అనర్థం, రాద్ధాంతం జరిగిందీ కూడా గుర్తొచ్చింది.

"మన టాపిక్ సైడ్ ట్రాక్ న పోతోంది బేబీ! లెటజ్ కమ్ టు ద పాయింట్!" అన్నాడు శ్రీధర్.

"నీ పాయింటేమిటో నాకు తెలుసు. ఆలస్యం చెయ్యటం మనిద్దర్లో యెవరికీ మంచిది కాదు. తర్వాత నీకు దూరమై నా స్వార్థం చూసుకున్నానని నన్ను నిందించొద్దు."

"ఇండైరెక్టు గా — నాకు దూరం కాబోతున్నానని హెచ్చరిస్తున్నావన్న మాట!"

"నేనాడదాన్ని శ్రీ! స్వతంత్రం లేనిదాన్ని. పైగా మధ్య తరగతి కట్టుబాట్లకు తలొగ్గి సంప్రదాయాన్ని గౌరవించే కుటుంబంలోనించి వచ్చినదాన్ని, నీలాంటి హాయ్యర్ క్లాస్ మనుషుల మనస్తత్వాల గురించి విని, చూసి బెంగతో భయంతో వణికిపోతున్న దాన్ని. నీమీది మనసును వెనక్కు మరల్చుకోలేకపోతున్న బలహీనురాల్ని. నన్ను ఇరుకున పడెయ్యకు శ్రీ!"

శ్రీధర్ ముఖం గంభీరముద్ర దాల్చింది. అంతక్రితం వరకు అతని కళ్ళలో నించి తొంగిచూస్తున్న కొంటెతనం, ఆకతాయితనం మెరుపులా మాయమయ్యాయి. తదేక దీక్షతో ఆమెకే పే చూస్తున్నాడు.

చక్కటి శరీరచ్ఛాయతో ఆరోగ్యంతో మిలమిల మెరుస్తున్న బుగ్గలతో అనిర్వచనీయమైన గులాబీబాల ముగ్ధత్వంతో, దేనికదే ప్రత్యేకతను సంతరించుకున్న అంగాంగ సౌందర్యంతో, సౌకుమార్యంలో నిపుణురాలైన వృత్తిలో

నిష్ణాతుడైన చిత్రకారుడు అహోరాత్రాలు శ్రమించి చిత్రించిన తైలవర్ణ చిత్రంలా రమణీయంగా వుందామె.

దాదాపు ఆరడుగుల పొడవుతో, అందంగా బలంగా పెరిగిన శరీరంతో విశాలమైన ఛాతీతో ఐశ్వర్యం తెచ్చిన హుందాతనంతో వయసులో వున్న అమ్మాయిల్ని కొద్ది క్షణాలసేపైనా తన వైపు ఆకర్షించుకోగల వర్చస్సుతో ఓ చిన్న సైజు రాకుమారుడిలా వెలిగిపోతున్న శ్రీధర్‌ని తన కడగంటి చూపుతో, తన అమాయకత్వంతో, ముగ్ధత్వంతో కట్టిపడేసింది వినీల.

అందుకే ఆమెను చూడకుండా ఒక్కరోజైనా గడప లేని స్థితిలో వున్నాడతను. ఆమెతో మాట్లాడలేక పోయిన రోజు అతనికి పిచ్చెత్తిపోతుంది. తిండి సహించదు. కంటికి నిద్రరాదు. దేనిపైనా ఏకాగ్రత కుదరదు.

కాని, తండ్రికి నచ్చచెప్పి ఆమెను చేపట్టగల ధైర్యం లేక, ఆమె పెళ్ళి ప్రస్తావన తెచ్చినప్పుడల్లా వాయిదా వేస్తున్నాడు. కాని ఆమెను ఒదులుకోవటానికేమాత్రం సిద్ధంగాలేడు.

అతనేదో చెప్పాలని నోరు తెరిచాడు.

సరిగ్గా అప్పుడే ఓ ఇరవై సంవత్సరాల యువకుడు వారి ముందుకొచ్చి వినీలని చూస్తూనే ఆనందంగా శబ్దం చేసి, "హల్లో, వినీలా, నువ్వేనా? ఇంతసేపూ యెవరో అనుకున్నాను డిమ్‌లైట్ షేడ్‌లో...." అంటూ ఆమె పక్కనే వున్న మరో కుర్చీలో చనువుగా కూచున్నాడు.

విస్తుపోయి అతనివంక చూసిన వినీల అతన్ని గుర్తించి "నువ్వా శరత్!" అన్నది మెల్లిగా.

శ్రీధర్ ఆశ్చర్యాన్ని పెదాల వెనక బిగబట్టి వినీల వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇతను నా క్లాస్ మేట్ శరత్" అని శ్రీధర్‌కి పరిచయం చేసి, "మీట్ మై ఫ్రెండ్ శ్రీధర్! మా కాలేజీలో రెండు సంవత్సరాల సీనియర్. స్టూడెంట్స్ యూనియన్ ప్రెసిడెంట్ గా కూడా పని చేశాడు" అన్నది వినీల.

శరత్ ఓహో అన్నట్టు కళ్ళెగరేసి మళ్ళీ కబుర్లలో పడిపోయాడామెతో. అర్థం పర్థం లేకుండా యేదేదో వాగేస్తున్న శరత్‌ని ఎలా వదిలించుకోవాలో తెలీక తలపట్టుకుని కూచుంది వినీల. శరత్ మాత్రం తన ధోరణి మార్చుకోలేదు.

శ్రీధర్‌కి అతని ప్రవర్తన చిరాకుని, అసహనాన్ని తెచ్చిపెట్టింది. అతన్ని వారించటానికి మరో మార్గం లేక బేరర్ని పిలిచి బిల్ తెప్పించి అందులో ఏభై రూపాయల నోటు వేసి, "కమాన్ వినీలా, వెళ్దాం!" అంటూ లేచాడు.

వినీల రిలీఫ్‌తో పైకి లేచింది. శరత్ గురించి ఆమెకు బాగా తెలుసు. ఊరికే వదరటం అలవాటు తనకి. పైగా కాలేజీలో 'గ్రూపిజం' మెయిన్‌టైన్ చేస్తూం టాడు. ఓ చిన్న సైజు గూండాగా పేరు తెచ్చు కున్నాడు. అలాంటి వాడితో సౌమ్యంగా వ్యవహరించ డమే మేలని ఆమెకు తెలుసు.

రెస్టారెంట్ బయటివరకు వాళ్ళిద్దర్నీ అనుసరించి వచ్చాడు శరత్.

అయితే శ్రీధర్ తన కార్లో కూచోని వినీలని కూర్చుండబెట్టి క్షణాల్లో అక్కడ్నుంచి కారును పరు గెత్తించటంతో వాక్ప్రవాహానికి ఆనకట్టపడింది.

అయితే ఇదంతా మరో జతకళ్ళు మొదట్నుంచీ పరిశీలనగా చూస్తూన్న విషయం ఆ ముగ్గురిలో ఎవరికీ తెలీదు.

## 2

"అయితే, ఆ శ్రీధర్ గాడ్ని ఫినిష్ చెయ్యలేమంటావా? షేమ్... షేమ్...." అన్నాడు బాబూరావ్, శరత్ వంక హేళనగా చూస్తూ.

"నో....నో....లేనని కాదు. కాని వాడి వెనక అంగబలం, అర్థబలం దండిగా వున్నాయి. పొరపాటున మనం బయటపడిపోతే, జీవితాంతం కటకటాల వెనక మగ్గిపోతాం. అది నాకిష్టంలేదు" చెప్పాడు శరత్.

"పూర్ ఫెలో! మరీ అంత దద్దమ్మల్లాగా పట్టుబడి పోతామా? అందుకు సరైన పథకేదో ఎన్నుకుంటే సరి!"

"సరైన పథకం అంటే....!?"

"మనక్కావలసింది శ్రీధర్ పీడ శాశ్వతంగా వదిలి పోవటమే కదా....!"

"అదొక్కటే కాదుగా! వినీలని మనవైపు మళ్ళించుకోవాలి—ఐమీన్ నావైపు."

"అవునోయ్, ఈ బాధంతా ఆమెని దక్కించుకోవటం కోసమేనని నాకు తెలియదా? ఆ శ్రీధర్ గాడు బతికున్నంతకాలం వినీల నీ ముఖం చూడదు, అంతే కదా!....అయితే గురూ, ఇక్కడో చిన్న తిరకాసుంది. శ్రీధర్ పోయినంత మాత్రాన వినీల నిన్ను వరిస్తుందని ఏమిటి గ్యారంటీ?"

ఉలిక్కిపడి చూశాడు శరత్ స్నేహితుడివంక.

"అంటే........వినీలని ఆకర్షించగల శక్తి నాలో లేదంటావా?"

"నేను నీ సామర్థ్యాన్ని శంకించటంలేదు. వినీల తన ఇష్టానికి వ్యతిరేకంగా మనసు మార్చుకుంటుందా అని!"

"మార్చుకునేలా చేస్తాం."

"అదే—ఎలాగా అని!"

"ఆడది ప్రాణంకన్న మిన్నగా భావించుకునే దేమిటి?"

"యూ మీన్ క్యారెక్టర్..."

"ఎస్—అదే!"

"అంటే వినీలమీద అత్యాచారం జరపటానిక్కూడా సిద్ధపడుతున్నావా?"

"తప్పనిసరి పరిస్థితులెదురైతే అందుక్కూడా వెను దియ్యను నేను. ఐ హులఅర్ ట్రక్, నాకు వినీల కావాలి!"

"ఆమె ఆ విధంగా కావాలంటే శ్రీధర్ గాడ్ని ఫినిష్ చెయ్యాల్సిన పనేముంది? వినీలని ఇప్పుడు మాత్రం నువ్వు నీక్కావలసిన విధంగా నీ కోరిక తీర్చుకుని వదిలేయొచ్చుగా! ఈ యాతనంతా దేనికి?"

"దేనికా? కసి! వినీలని తన చుట్టూ తిప్పుకుంటూ ఆమెని వల్లో వేసుకుని కులుకుతున్నందుకు వాడికి శిక్ష పడాల్సిందే! అది ఏకంగా మరణశిక్షే అయితే సరిగా సరిపోతుంది!" శరత్ గొంతులో కసి, స్థిరనిశ్చయం జంటగా పలికాయి.

బాబూరావ్ తలూపి, "ఓకే! కమాన్ టెల్ మీ వాట్ యూ ప్లాన్డ్? ఈ విషయంలో నేన్నే విధంగా సహాయపడగలను?" అన్నాడు.

"అసలు నా ప్లాన్కి ఊపిరి, ఆయువుపట్టు నువ్వే! నేను అటు వినీలకి, ఇటు శ్రీధర్కి కూడా బాగా తెలుసు. అంచేత నేను చాలా తేలిగ్గా బయటపడిపోయే

ప్రమాదముంది. నువ్వయితే యెవరికీ తెలీదు. ఎవరూ నిన్ననుమానించరు...."

ఆ తర్వాత శరత్ చెప్పినదంతా అక్షరం పొల్లు పోకుండా విన్నాడు బాబూరావ్.

చివరగా, "నువ్వు నామీద పెట్టిన ఈ బాధ్యతను ఆనందంగా భరించదల్చుకున్నాను. వినీల నీ స్వంతం కావాలని మనసారా కోరుకుంటున్నాను. విష్ యూ బెస్టాఫ్ లవ్!" అన్నాడు బాబూరావ్ నవ్వుతూ 'లవ్' అన్న మాటను ఒత్తిపలుకుతూ.

శరత్ హుందాగా నవ్వాడు. దర్జాగా చెయ్యి ముందుకు చాపాడు. బాబూరావ్ అతని చేతిని మృదువుగా నొక్కి వదిలాడు.

"ఇప్పట్నుంచీ ఆ పనిమీదే వుంటాను" అన్నాడు.

శరత్ జేబునించి కందరూపాయల నోట్లకట్టతీసి అతని కందించాడు, హీరోహోండా బైక్ కీ చెయిన్‌తో బాటు.

మరుక్షణం బాబూరావ్ ఎక్కిన హోండా మెత్తగా శబ్దం చేస్తూ రివ్వున దూసుకుపోయింది.

# 3

"ఏంటిది. మా వినీలని ప్రేమించావా, పెళ్ళి చేసుకుంటావా? ఇంతకీ నీ పేరేమిటి? ఎవరబ్బాయివి? నీ వివరాలేమీ చెప్పకుండా పెద్దవాళ్ళు సంప్రదించవలసిన అతి ముఖ్యమైన విషయాన్ని నువ్విలా సీదాసాదాగా వచ్చి అడగటం నాకు నచ్చలేదు." భూషణరావు గొంతులో ధ్వనించిన కాఠిన్యానికి ఉలిక్కిపడ్డాడు శ్రీధర్.

"మీరు నన్నపార్థం చేసుకోకండి. ఈ విషయం మా పెద్దవాళ్ళొచ్చి మిమ్మల్నడగటమే న్యాయమని నాకూ తెలుసు. కాని.... పెద్దవాళ్ళు విశాలహృదయులు కాని

ప్పుడు చిన్నవాళ్ళ మనసు కరిగి వాళ్ళ కోరికని సహృదయంతో ఆమోదించనప్పుడు, చిన్నవాళ్ళే ముందుకొచ్చి తమ సమస్యల్ని స్వయంగా పరిష్కరించుకోవలసి వుంటుంది. నావిషయంలో అదే జరిగింది. క్షమించండి. నా పేరు శ్రీధర్. మీ అమ్మాయికన్న రెండేళ్లు కాలేజీలో సీనియర్ని." చెప్పాడు శ్రీధర్. ముఖానికి పట్టిన చెమటను చేతిరుమాలుతో అద్దుకుంటూ.

భూషణరావు కొద్దిసేపు ఏమీ మాట్లాడకుండా తదేక దీక్షతో శ్రీధర్ వంక చూస్తున్నాడు. కుర్రాడు చూడబోతే మంచి కుటుంబంనించి వచ్చినవాడులాగానే వున్నాడు. మర్యాద, మన్నన కలవాడేగాని పోకిరుబోతులా మోసగాడిలా కనిపించడంలేదు. ఆయన ముఖంలో రవంత సౌమ్యత చోటుచేసుకుంది.

"ఎనీవే, నీగురించిన వివరాలు చెప్పు. మీ నాన్నగారి పేరేమిటి? ఏంచేస్తుంటారు? ఇంతకీ నువ్వేం చేస్తున్నావు? వగైరా...."

"నాన్నగారి పేరు రాజవర్మ...."

పక్కలో బాంబుపడ్డట్టు అదిరిపడ్డాడు భూషణరావు. "ప్రముఖ పారిశ్రామికవేత్త, కాంట్రాక్టరు రాజవర్మ కొడుకువా?"

శ్రీధర్ ముఖంలో అస్పష్టంగా గర్వంతో కూడిన హాసరేఖ మెరిసింది. "అవునండీ"

"అయితే ఈ పెళ్ళి జరగదు."

"అదేమిటండీ ఒకేసారి అలా అనేశారు?"

"ఇక మీవాళ్ళతో మాట్లాడవలసిందేమీ లేదుగనక!"

"అంటే.... నాన్నగారితో మాట్లాడకుండానే మీరు నిర్ణయం తీసేసుకున్నారా?"

"అవును....మీ నాన్న సిటీలోకెల్లా గొప్ప ధనవం తుడు కావచ్చు. చాలా పలుకుబడి, మందీమార్బలం వున్న వారే కావచ్చు. డబ్బుతో మనుషుల్ని కొనెయ్యగల సమ ర్థులే కావచ్చు. కాని డబ్బుకన్న, వీటన్నిటికన్న విలు వైన దొకటుంది, నీతి! అది మీ నాన్నకు లేదు. అది లేక ఎన్నున్నా ఏమీ లేనట్టే లెక్క నా దృష్టిలో. నా యిష్టం కాదు, నా నిర్ణయం! వినీలగురించి శాశ్వతంగా మర్చిపో."

"అదేమిటండీ, మీరు అంగీకరిస్తారని ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. వినీలకూడా యీ పెళ్ళి జరక్కపోతే బతుకు లేదు. నేను గొప్పవాడినికావటమే తప్పయితే, నేను ఐశ్వర్యాన్ని అంతిస్తుని బతులుకుంటాను. వినీలనిమాత్రం బతులుకోలేను."

"అయామ్ ఎక్స్ట్రీమ్లీ సారీ! మీ కుటుంబంతో వియ్యమందుకోవటానికి నేను యేమాత్రం అంగీకరించ లేను. ఇక వినీల సంగతంటావా? అది నాకూతురు. నా రక్తం పంచుకుపుట్టిన బిడ్డ గెలుపు ఓటమి ఒకేలా రిసీవ్ చేసుకోగల గుండె నిబ్బరమున్న పిల్ల. కష్టాల్ని సుఖాల్ని తేడా లేకుండా అనుభవించగల ఆత్మస్థైర్యం గల ఆడపిల్ల. ఆమె నానిర్ణయానికెప్పుడూ కట్టుబడివుంటుంది. ఇక నువ్వెళ్ళొచ్చు."

"అలాగేనండి. ప్రస్తుతానికి వెళ్ళిపోతున్నాను. అయితే మరొక్కసారి మీరు తీర్గా ఆలోచించి మా వివాహాన్ని నిండుమనసులో జరిపిస్తారనే ఆశతో వెళ్ళిపోతున్నాను."

శ్రీధర్ గొంతులో యేదో అడ్డుపడ్డట్టయింది.

గిరుక్కున తిరిగి పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ బయ టకు వెళ్ళిపోయాడు.

భూషణరావు కొద్దిసేపటివరకు శ్రీధర్ వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయాడు.

## 4

“హతుని పేరు భూషణరావు. ఇర్రిగేషన్ డిపార్ట్మెంటులో సెక్షన్ ఆఫీసరుగా పనిచేసేవాడు. ఇతని కేడర్ని ఇప్పుడు అసిస్టెంటు ఇంజనీరుగా రీ డిజిగ్నేట్ చేశారనుకో! హంతకుడు కూడా స్పాట్లోనే రెడ్ హాండెడ్ గా దొరికిపోయాడు. అతని పేరు శ్రీధర్!” ఒక్క క్షణం ఊపిరితీసుకోటానికన్నట్టు ఆగి డిటెక్టివ్ కిరణ్ ముఖంలోకి చూశాడు ఇన్స్పెక్టర్ శ్రీనివాస్.

డిటెక్టివ్ కిరణ్ ఏకదీక్షతో హతుడి ఫోటోలను, శ్రీనివాస్ తయారుచేసిన ఇన్వెస్టిగేషన్ రిపోర్టుని పరిశీలనగా చూస్తున్నాడు. మధ్యమధ్య శ్రీనివాస్ మాటలకి తలపంకిస్తున్నాడు.

“శ్రీధర్ — భూషణరావు కూతురు నీలని ప్రేమించాడు. పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. కాని భూషణరావంగీకరించలేదు. హత్యచేయటానికదొక మోటివ్ అయితే రెండోది అతనిమీద కక్ష. శ్రీధర్ తండ్రి రాజవర్మ పేరుమోసిన పారిశ్రామికవేత్త — కంట్రాక్టరు. భూషణరావు అతని ఫైల్ను అప్రూవ్ చేయటానికి బ్లంట్గా నిరాకరించటమేగాక అవమానకరంగా మాట్లాడాడు, రాజవర్మని. తండ్రి నవమానించిన భూషణరావుమీద సహజంగానే శ్రీధర్ కక్షపూనాడు. అది హత్యకి దారితీసింది” చెప్పాడు శ్రీనివాస్.

కిరణ్ ఫైలు మూసి టేబిల్ మీద పరేశాడు.

“హంతకుడ్ని స్పాట్లోనే ఎలా పట్టుకోగలిగావు?” అడిగాడు కిరణ్.

"నిన్నరాత్రి సరిగ్గా పదిన్నరగంటలకి నాకు ఫోన్ కాల్ వచ్చింది. నాగార్జునసాగర్ పోయే రోడ్డులో హత్యజరగబోతోందని, వెంటనే వస్తే హత్య జరగకుండా నిరోధించగలగటమే గాక హంతకుడ్ని కూడా రెడ్ హేండెడ్ గా పట్టుకోవచ్చునని చెప్పాడు. ఫోన్ చేసిన వ్యక్తి. వెంటనే సిబ్బందితో బయల్దేరి వెళ్ళాను. అప్పటికే భూషణరావుని చంపేసి కత్తి దూరంగా విసిరేశాడు హంతకుడు శ్రీధర్. అయితే పారిపోవటానికి ప్రయత్నించేంతలో మేం పట్టేశాం. లేకుంటే పిట్ట ఎగిరి పోయుండేది."

"శ్రీధరే హంతకుడని నువ్వెలా నిర్ధారించావు?" అడిగాడు కిరణ్.

శ్రీనివాస్ విస్మయంగా చూశాడతనివంక.

"ఆన్సర్ మీ మైడియర్ ఇన్‌స్పెక్టర్!"

"స్పాట్ లో దొరికాడు. పైగా అక్కడెందుకున్నావని అడిగితే సరైన సమాధానం చెప్పలేకపోయాడు. హత్యాయుధం రోడ్డుపక్కనే పొదల్లో దొరికింది. దాని మీద శ్రీధర్ వేలిముద్రలున్నాయి. హత్య ఆ కత్తితోనే జరిగిందని సర్జన్, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్ట్సు యిరువురూ నిర్ధారించారు. అంతకన్న క్లియర్ ఎవిడెన్స్ ఇంకెక్కడుంటుంది బ్రదర్!" గర్వంగా చెప్పాడు శ్రీనివాస్.

"అయితే తను హత్యచేసినట్టు శ్రీధర్ అంగీకరించాడా?"

విచిత్రంగా చూశాడు శ్రీనివాస్ కిరణ్ వైపు.

"ఏ హంతకుడైనా తనుహత్య చేసినట్టు అంగీకరిస్తాడా? నేరస్తుడు తన నేరాన్ని ఎట్టి పరిస్థితుల్లోను ఒప్పుకోడు."

"అఫ్‌కోర్స్!.... యేసంగతి నేను శ్రీధర్‌తో మాట్లాడితే పేగాని చెప్పలేను. ఇంతకీ నువ్వు నన్నెందుకు పిలిపించినట్టు?" అడిగాడు కిరణ్.

దిగులుగా చూశాడు శ్రీనివాస్.

"ఏం చెప్పను బ్రదర్! శ్రీధర్ తండ్రి రాజవర్మ బాగా పలుకుబడి గల పెద్దతలకాయ. నిన్న రాత్రికి రాత్రే విషయాన్ని మా సూపరింటెండెంట్ గారికి తెలియజేశాడు. తెల్లారకుండానే ఎస్పీ నాకు ఫోన్ చేసి శ్రీధర్‌ని వదిలి పెట్టమని హుకుం జారీ చేశారు...."

కిరణ్ చిన్నగా నవ్వి "మరింకా వదిలి పెట్టలేదేం? వెంటనే ఆపని చెయ్యి" అన్నాడు.

"అదెలా వీలవుతుంది బ్రదర్! నేను రిజిష్టర్ చేసేశాను. పోస్టుమార్టమ్ కండక్టు చేయించాను. రిపోర్టు కూడా వచ్చేసింది. శ్రీధర్ హంతకుడని రుజువు చేయగల ఆధారాలన్నీ సిద్ధం చేసుకున్నాను. సాయంత్రంలోగా కేసుని కోర్టుకి రిఫర్ చేద్దామనుకుంటున్నాను. ఇంతలో.... హుకుం...."

"మీకిది మామూలేగా! ఎందరో నేరస్తులు నేరం చేసి దర్జాగా సంఘంలో తిరుగుతున్నారు. హంతకులు తప్పించుకుంటున్నారు. వాళ్ళ బదులు అమాయకులు నిర్దోషులు ఉరికంబాలెక్కుతున్నారు. జైళ్ళలో యావజ్జీవ శిక్షపడి మగ్గిపోతున్నారు. వందమంది దోషులు తప్పించుకున్నా ఫరవాలేదుగాని ఒక్క నిర్దోషి శిక్షింపబడకూడదనికదా లా పుస్తకాలు, కోర్టులు ఘోషిస్తున్నాయి!? అందులో మొదటి భాగాన్ని మీ డిపార్టుమెంట్ అక్షరాలా అమలుజరుపుతున్నందుకు గర్వపడు."

శ్రీనివాస్ గిల్టీగా చూశాడు.

"అయామ్ సారీ బ్రదర్! నేనుమాత్రం ఇలాంటి ఇన్ ఫ్లుయెన్సెస్‌కి తలొగ్గదలచుకోలేదు. కేసు పకడ్బందీగా రూపొందించి కోర్టుకి ప్రెజెంట్ చెయ్యడమే నా ధ్యేయం! నా విధి నిర్వహణలో నేనెన్నడూ విఫలం కాలేదు. ఇప్పుడూ అలాగే చేస్తాను."

"ఐ అప్రిషియేట్ యూ ఇన్‌స్పెక్టర్! దెన్ ప్రొసీడ్!...."

"థాంక్యూ బ్రదర్! నిన్ను ముఖ్యంగా పిలిచిందెందుకంటే కేసులో ఎలాంటి లొసుగులు లేకుండా కోర్టులో నిలబడటానికి వీలుగా వుందో లేదో నిర్ధారిస్తావని! ఎస్పీకి వ్యతిరేకంగా నేను నిలబడాలంటే కేసు కోటగోడలా బలంగా వుండాలి. యేమాత్రం వీగిపోయినా నన్ను డిపార్టుమెంటు సంజాయిషీ తీసుకుంటుంది. అంతకన్న ముందు నేను రిజైన్ చేసేస్తాను కూడా!...." శ్రీనివాస్ గొంతులో సిన్సియారిటీ, పట్టుదల ధ్వనించాయి.

కిరణ్ అభినందనపూర్వకంగా అతని భుజం తట్టి, "అయితే పద శ్రీధర్‌ని ఓసారి చూసి కొన్ని ప్రశ్నలు అడగాల్సి వుంది. ఆతర్వాత నీ కేసు నిలబడుతుందో, చీదేస్తుందో చెప్పేస్తాను" అంటూ లేచాడు.

శ్రీనివాస్ అతన్ని — శ్రీధర్‌ని రిమాండులో వుంచిన సెల్ దగ్గరకు తీసుకువెళ్ళాడు.

ఒకరాత్రికే ముఖమంతా పీక్కుపోయి పదిలంఖణాలు చేసినట్టున్న ఆగర్భశ్రీమంతుడైన శ్రీధర్‌ని చూసి, అతని వ్యక్తిత్వాన్ని క్షణాలమీద అంచనా కట్టాడు కిరణ్.

శ్రీధర్ కిరణ్‌వంక ఆశగా చూశాడు. తనకి తెలిసిన ముఖం కాకపోవడంతో అతని ముఖంలోకి మళ్ళీ ప్రేత

కళ వచ్చేసింది.

"చూడండి, మిస్టర్ ...." కిరణ్ పిలిచాడు.

"నా పేరు శ్రీధర్ ....మీరెవరో ...."

"నేను ప్రయివేట్ డిటెక్టివ్‌ని. పేరు కిరణ్. మీరు భూషణరావు గారి రెండువ హత్య చేశారో తెల్సుకోవా అని వచ్చాను" అన్నాడు కిరణ్ — అతని ముఖకవళికల్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ.

"మీరూ అదే మాటంటున్నారు. చూడండి సార్.. మీగురించి నేను చాలా విన్నాను, పత్రికల్లో చదివాను. నిర్దోషుల పాలిట దైవమని, నేరస్థుల పాలిట సింహ స్వప్నమని మీగురించి చెప్పుకుంటారు. నేనెవర్నీ హత్య చెయ్యలేదు. నన్ను నమ్మండి. భూషణరావుగారు నా కంతో కావలసిన వ్యక్తి. చేజేతులా ఆయన్ని చంపు కునేటంత దుర్మార్గుణ్ని, అవివేకినీ కాదు" దాదాపు కన్నీరు కారుస్తూ చెప్పాడు శ్రీధర్.

"అయితే హత్య జరిగిన సమయానికి మీ రక్కడెందు కున్నారు? హత్యకుపయోగించిన కత్తిమీద మీ వేలి ముద్ర లెందుకున్నాయి?"

"కత్తి నాదే కాబట్టి, తప్పక నా వేలిముద్రలుం టాయి. అది నేను పండ్లు కోసుకోవటాని కుపయోగించే కత్తి. నా గదిలోనుంచి యెవరో దాన్ని దొంగిలించి వుండాలి. ఇక నేనా స్థలంలో వుండటం కేవలం కాకతాళీయం. అంతకన్న ఎక్కువగా నేనేమీ చెప్పలేను. భూషణరావుగార్ని మాత్రం నేను చంపలేదు చంప లేదు. నన్ను నమ్మండి" రెండు చేతుల్లోనూ ముఖాన్ని దాచుకుని ఆక్రోశించాడు శ్రీధర్.

శ్రీనివాస్ అతనివంక తినేసేలా చూశాడు.

"నువ్వా సమయంలో ఎక్కడెందున్నావో చెప్పటానికెందుకు భయం? నువ్వు నిజంగా హత్యచేయక పోయివుంటే నీ ఎలిబీని నిరూపించుకో! హంతకుడి మమ్మాటికీ నువ్వే" అన్నాడు.

శ్రీధర్ పిచ్చిగా అరిచాడు. "కాదు, కాదు, కాదు నేను హంతకుడ్ని కాదు."

కిరణ్ శ్రీధర్ చేతిమీద సానుభూతి పూర్వకంగా తట్టి, "ఆవేశపడకు శ్రీధర్. ఆధారాలు, పరిస్థితులు నువ్వే హత్యచేశావని తిరుగులేని సాక్ష్యాన్నిస్తూన్నాయి. నువ్వా స్పాట్‌లో వుండటానికి మరో బలమైన కారణమేదైనా వుంటే తప్ప నిస్సందేహంగా ఉరిశిక్షనుంచి ఎవరూ తప్పించలేరు. నిజం చెప్పు! నువ్వు నిర్దోషివి అయితే నిన్ను వదిలిపెట్టడానికి అన్ని యేర్పాట్లు చేస్తాం" అన్నాడు.

శ్రీధర్ ఒక్కక్షణం కిరణ్ ముఖంలోకి చూసి, "నిజం చెపుతాను. నన్ను విడిపిస్తారా?" అన్నాడు.

"తప్పకుండా! మాక్కావలసింది నిజం" అన్నాడు కిరణ్.

"నిన్న రాత్రి పదిగంటలకి నాకెవరో ఫోన్ చేసి, నీ ప్రియురాలు వినీలనెవరో కిడ్నాప్ చేసి తీసుకుపోతున్నారు. నాగార్జునసాగర్ పోయే రోడ్డులో పదో కిలోమీటర్ రాయి దగ్గర ఆమెను రేప్.... రేప్ చెయ్యటానికి నలుగురు స్నేహితులు కాచుకుని వున్నారు. మాస్ రేప్....హర్రియప్! అంటూ ఫోన్ పెట్టేశాడు. ఎవరో, ఎక్కడినుంచి ఫోన్ చేశాడో వివరాలడిగే అవకాశం లేకపోయింది.

వెంటనే నా మోటర్ బైక్ మీద నాగార్జునసాగర్

రోడ్‌లోని పదో కిలోమీటర్ స్టోన్ దగ్గరకు వెళ్ళాను. అక్కడ రోడ్ మీద ఎవరో పడున్నట్టు హెడ్‌లైట్ కాంతిలో చూశాను. బ్రేక్ స్టాండ్ వేసి దగ్గరకు వెళ్ళి చూసేసరికి రక్తంమడుగులో వెల్లకిలా పడున్నాడు భూషణరావుగారు. నేను మతిపోయిన వాడిలా ఆయన్ను పట్టుకుని కదిపిచూశాను, ప్రాణముండేమోనని! కాని అప్పటికే ఆయన పోయారు. సరిగ్గా అప్పుడే పోలీస్ జీప్ రావటం, పోలీసులు నన్ను చుట్టుముట్టడం జరిగి పోయింది...." చెప్పాడు శ్రీధర్.

"రాత్రంతా సెల్లో కూచుని మంచి కథే అల్లావు చిట్టితండ్రీ! ఈ కథ రాత్రే చెప్పొచ్చుగా. ఈ కథ నిన్నురికంబం నించి రక్షించలేదు మిస్టర్! చాలా బలహీనంగా వుంది" నవ్వాడు శ్రీనివాస్.

కిరణ్ అతని వంక జాలిగా చూసి, "నిజంగా నువ్వు నిర్దోషివే అయితే నిజాన్ని దాచకుండా వున్నదున్నట్టు చెప్పు. నాకు చేతనైన సాయం చేస్తాను" అన్నాడు.

శ్రీధర్ కళ్ళు తుడుచుకుంటూ, "నేను నిజమే చెప్పాను సార్! ఇకపైన మీరేం చేసినా సరే!" అన్నాడు.

శ్రీనివాస్ కిరణ్ వంక తిరిగి, "మొండిఘటం. తండ్రి పలుకుబడి తనను విడిపిస్తుందనే పిచ్చినమ్మకంతో నిర్లక్ష్యంగా సమాధానాలిస్తున్నాడు. లెటజ్ గో!" అన్నాడు.

కిరణ్ శ్రీధర్ వంక సాలోచనగా చూసి శ్రీనివాస్‌తో అతని గదిలోకి తిరిగొచ్చాడు.

"శ్రీధర్ హంతకుడని ఖచ్చితంగా నిర్ధారణ అయినట్టే కదా....!?" అన్నాడు శ్రీనివాస్ కిరణ్ వంక చూస్తూ

హాలంగా చూస్తూ.

కిరణ్ ఏదో చెప్పేలోపల ఫోన్ గణగణ మోగింది. శ్రీనివాస్ రిసీవర్ ఎత్తి "హల్లో క్రైంబ్రాంచ్...." అన్నాడు హుందాగా. అయితే మరుక్షణమే లేచి నిల్చుని బూట్లు రెండూ టపీమని శబ్దంచేస్తూ అటెన్షన్ లోకి వచ్చేసి "గుడ్ మార్నింగ్ సార్....సర్....సర్" అంటూ ఫోన్ వినయంగా పట్టుకుని సగం వంగిపోయి వినసాగాడు.

చివరగా, "ఎక్స్క్యూజ్ మీ సర్....అతన్ని విడిచి పెట్టలేను. ఆల్ ది నెససరీ ఎవిడెన్స్ విత్ మీ సర్.... ఐ కెన్ ప్రూవ్ ద అఫెన్స్ సర్....ఒన్స్ ఎగయిన్ సారీ సర్....పార్డన్ మీ...." అని ఫోన్ పెట్టేసి, జేబు నించి రుమాలుతీసి దట్టంగా పట్టిన చెమట్లు తుడుచుకున్నాడు శ్రీనివాస్.

"ఎస్పీ చాలా స్ట్రాంగ్ డోస్ ఇచ్చినట్లుందే!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ జీవంలేని నవ్వు నవ్వాడు. "ఎట్టి పరిస్థితుల్లోను శ్రీధర్‌ని వదల్లేనని చెప్పేశాను. బాస్‌తో డైరెక్టు ఫైట్‌కి దిగక తప్పలేదు....బట్, అయామ్ ష్యూర్ ఐ కెన్ ప్రూవ్ ద కేస్ ఇన్ ద కోర్టు!" అన్నాడు.

"విష్ యూ ఆల్ ది బెస్టు!....నేనొస్తాను" అంటూ లేచాడు కిరణ్.

"ఇంతకీ నీ అభిప్రాయం చెప్పనేలేదు" అన్నాడు కంగారుగా శ్రీనివాస్.

"ఓ గంటతర్వాత నీకు ఫోన్ చేసి చెప్తాను" అన్నాడు కిరణ్.

# 5

టయోటా శ్రీనిలయం గేట్లోంచి వెళ్తూండగా గూర్ఖా రాంసింగ్ సలాంచేసి కిరణ్‌తో చెప్పాడు.

"ఆ పేప్కలియే ఏక్ లడ్కీ ఆగయీసాబ్, ఉన్‌కో విజిటర్స్ రూం మే బిఠాయా హై!" అని.

కిరణ్ తలపంకించి, టయోటాని పోర్టికోలో పార్క్ చేసి లోపలికి వెళ్ళాడు.

విజిటర్స్ రూంమీదుగా వెళ్తూ ఆ అమ్మాయిని చూశాడు. ఆమె చటుక్కున లేచి కిరణ్‌కి నమస్కరించింది.

సన్నగా, పచ్చగా, పొడవుగా సన్నజాజి తీగలా వుందా అమ్మాయి. అయితే సన్నజాజి యెండుకో వాడిపోయి చిన్నబోయి వుంది.

"నా పేరు వినీల. మీ సహాయం కోరివచ్చాను" అని చెప్పింది సన్నజాజితీగ.

"రామ్మా....అలా డ్రాయింగ్ రూంలో కూచుందాం" అని ఆమెను డ్రాయింగ్ రూంలోకి తీసుకువెళ్ళి కుర్చీ చూపించి, "చెప్పమ్మా!" అన్నాడు కిరణ్ ఆదరంగా.

ఆమె కళ్ళు బాగా ఏడ్చిందనటానికి సూచనగా ఉబ్బి వున్నాయి. కెంపుల్లా వున్నాయి కనుగుడ్లు.

"మీరు శ్రీధర్ నెలాగైనా విడిపించాలి. అతను హత్య చెయ్యలేదు. అంత దుర్మార్గుడు కాదతను...." హడావిడిగా కలాతోకా లేకుండా చెప్పుకుపోతున్న వినీలని ఆపి, "వివరంగా చెప్పమ్మా!" అన్నాడు కిరణ్.

వినీల శ్రీధర్‌తోడి తన పరిచయాన్ని క్లుప్తంగా చెప్పి, "అతను గతరాత్రి మానాన్నగార్ని హత్యచేశాడనే

నేరంమీద పోలీసులు అరెస్టు చేశారు. అతను హత్య చెయ్యడు, చెయ్యలేడు" అన్నది గాద్గదికంగా.

"చూడమ్మా! భూషణరావుగారు మీ నాన్నగారా?"

"అవునండి.........ఆయన్నెవరో దారుణంగా పొట్టన పెట్టుకున్నారు. చీమకూడా అపకారం చెయ్యని గొప్ప వ్యక్తి నాన్న...." దుఃఖాన్నాపుకోలేక అరచేతుల్లో ముఖం దాచుకుని రోదించింది వినీల.

కిరణ్ ఆమెను డిస్టర్బ్ చెయ్యలేదు.

ఓ అయిదు నిమిషాల తర్వాత ఆమె సారీ చెప్పి కళ్ళు తుడుచుకుని ఎదురుగా కూచుంది కుర్చీలో.

"నాన్నగార్ని చంపిన రాక్షసుడ్ని పట్టి బంధించండి. శ్రీధర్‌ని వదిలిపెట్టండి. మీకు జన్మంతా ఋణపడి వుంటాను. మీ ఫీజు ఎలాగైనా ఇచ్చుకుంటాను. శ్రీధర్‌ని మాత్రం రక్షించండి" అన్నది ఉద్వేగంగా వినీల.

"చూడమ్మా! శ్రీధర్ హంతకుడని రుజువు చెయ్యటానికి కావలసిన ఆధారాలన్నీ పోలీసులకి దొరికాయి. ఇన్‌స్పెక్టర్ చాలా పట్టుదలగా వున్నాడు—శ్రీధర్‌ని హంతకుడిగా కోర్టులో నిలబెట్టడానికి సిద్ధంగా వున్నాడు. బలమైన ఆధారమేదో శ్రీధర్‌కి అనుకూలంగా లభిస్తే తప్ప అతన్నెవరూ రక్షించలేరు...."

"ఆధారముంది సార్....హంతకుడు వేరే వున్నాడు, ఖచ్చితంగా చెప్పగలను."

ఆసక్తిగా ఆమె వంక చూసి, "ఎవరు?" అన్నాడు కిరణ్.

"శరత్" చెప్పింది వినీల.

"శరతా? ఎవరతను?"

"నా క్లాస్ మేట్. నేను థర్డ్ ఇయర్ బిఎస్సీ చదువుతున్నాను. శరత్ నా క్లాస్‌లోనే చదువుతున్నాడు. నన్ను ప్రేమించానని తనని వరించమని ఎన్నోసార్లు వెంటపడి వేధించాడు. నేను శ్రీధర్ని ప్రేమిస్తున్నానని, అతనితో కలిసి మెలిసి వుంటున్నానని శరత్‌కి తెలుసు. చాలా సార్లు చూశాడు. తనని కాదన్నాననే కక్షతో శ్రీధర్ని హత్యానేరంలో ఇరికించాడు" ఆవేశంగా అన్నది వినీల.

"పోనీ అదే నిజమనుకుందాం. అతని కక్ష శ్రీధర్ మీదయితే, మీ నాన్నగార్నెందుకు చంపుతాడు? శ్రీధర్‌నే చంపవుండేవాడు కదా....!"

"శరత్ చాలా దుర్మార్గుడండీ, రెండువిధాల కక్ష తీర్చుకున్నాడు. నేను తనని కాదన్నందుకు మా నాన్నగార్ని చంపి నామీద, ఆ నేరాన్ని నా ప్రాణానికి ప్రాణమైన శ్రీధర్ మీద మోపి ఆవిధంగా అతనిమీద తన కసి తీర్చుకున్నాడు. శరత్‌ని బంధించండి. అన్నీ నిజాలు బయటపడ్తాయి."

"ముందా శరత్ గురించి అన్ని వివరాలు చెప్పమ్మా! ఎంక్వయిరీ చేస్తాను....కాని, శరత్ గురించికాని, మరో వ్యక్తి గురించిగాని అనుమానించటానికి హత్య జరిగిన స్థలంలో యిలాంటి ఆధారాలు దొరకలేదు. దొరికిన ఆధారాలు శ్రీధర్‌నే హంతకుడిగా నిరూపించటానికి ఉపయోగపడుతున్నాయి....ఏనీవే, చెప్పు. శరత్ గురించి ప్రతీ సంగతీ, మా ఉపయోగపడ్తుందనుకున్న ప్రతి సంగతీ చెప్పు."

వినీల చెప్తుంటే అన్నిటినీ వివరంగా నోట్ చేసుకున్నాడు కిరణ్.

"శ్రీధర్‌కి నీకూ వున్న సాన్నిహిత్యం గురించి యీ కేసు విషయంలో సంబంధించిన వివరాలన్నీ ఏవీ దాచకుండా చెప్పాలమ్మా! అప్పుడుగాని నీకు నేను పూర్తి న్యాయం చెయ్యలేను" అన్నాడు కిరణ్.

"అన్నీ చెప్పాననే అనుకుంటున్నాను సార్. శ్రీధర్ అమాయకుడు, నిర్దోషి. అతన్నెలాగైనా రక్షించండి, నేను కోరేది యిదే!" అన్నది వినీల.

"నీకతనిమీద ఎంత అచంచలమైన విశ్వాసముందో నేను గ్రహించాను. ఓ పక్క కన్నతండ్రి హత్యచేయబడి వుంటే అందరు శ్రీధరే హంతకుడని ఎలుగెత్తి చెప్తున్నా అతను హత్యచేయలేదని యింత ఖచ్చితంగా చెప్తున్నప్పుడే గ్రహించాను. ఐ విల్ ట్రై మై బెస్టు. నువ్వెళ్ళిరా అమ్మా!" అన్నాడు కిరణ్.

"నా అడ్రసు రాసుకున్నారు కదా! ఏమైనా విషయాలు కావలిస్తే కబురు చెయ్యండి. మీ ఫోన్ నంబరు రాసుకున్నాను. ఎప్పటికప్పుడే నేనే యే పబ్లిక్ బూత్ బూత్ నుంచో మీకు ఫోన చేసి కనుక్కుంటాను. మీ మేలు యీ జన్మంతా గుర్తుంచుకుంటాను....ప్రస్తుతానికి అడ్వాన్స్ క్రింద ఇవి వుంచండి. నా దగ్గర క్యాష్ లేదు.." రెండు బంగారు గాజులు టేబిల్ మీద పెడ్తూ తల వంచుకుని చెప్పింది వినీల.

"ముందు గాజులు వేసుకోమ్మా!" గంభీరంగా ధ్వనించిన కిరణ్ గొంతు విని సంభ్రమంగా అతని వంక చూసింది వినీల. కిరణ్ చూపు చాలా పదునుగా వుంది.

వణికే చేతుల్తో గాజాలందుకుని వేసుకుంది.

"ఈ కేసు నేను టేకప్ చేస్తున్నాను. శ్రీధర్ ఏ నేరమూ చెయ్యకపోతే విడుదల చేయిస్తాను. ఫీజు

విషయమంటావా అది, అతని దగ్గర్నుంచి వసూలు చేసుకుంటాను!" అన్నాడు కిరణ్ మందహాసం చేస్తూ.

అంతవరకు అతని సీరియస్‌నెస్ చూసి బిగుసుకుపోయిన వినీల గాఢంగా, రిలీఫ్‌గా నిట్టూర్చింది.

పచ్చటి చేతులు రెండూ జోడించి మనస్ఫూర్తిగా దండం పెట్టింది.

ఆమె కళ్ళలో భాషకందని కృతజ్ఞతా భావం!

మెల్లగా అడుగులు వేస్తూ గది విడిచి వెళ్ళింది.

కిరణ్ కొద్దిక్షణాలవరకు ఆమె వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయాడు.

తర్వాత ఫోన్ ఎత్తి నంబర్ డయల్ చేశాడు.

"హల్లో ఇన్‌స్పెక్టర్! ఓసారి హత్యాస్థలానికి వెళ్దాం, వస్తావా....ఇంటి దగ్గరే వుంటాను," అని చెప్పి రిసీవర్ క్రెడిల్ చేశాడు కిరణ్.

## 6

"రాజా, నీవీ అడ్రసుకి వెళ్ళి గత ఇరవై నాలుగ్గంటల్లోనూ శరత్ ఎక్కడున్నాడో అతని ఎలిబీని క్లీన్‌గా ఆర్క్వ చేసిరా" అన్నాడు కిరణ్ సార్జంట్‌తో.

రాజా అడ్రసు తీసుకుని కిరణ్‌కి శ్రీనివాస్‌కి శాల్యూట్ చేసి తన మోటర్ బైక్ మీద క్షణాల్లో దూసుకుపోయాడు.

అతను వెళ్ళిన వంకే రెండు క్షణాలు చూసి "మీ రాజా ఎక్స్‌పర్ట్ ఇన్వెస్టిగేటర్!" అన్నాడు కిరణ్.

"థాంక్స్!" అన్నాడు శ్రీనివాస్.

పదో నంబరు కిలోమీటరు రాయిదగ్గర కిరణ్ శ్రీనివాస్ మరో యిద్దరు సార్జంట్స్ రోడ్డుపక్కగా వాహనాన్ని ఆపి నిల్చున్నారు రోడ్డుమీద.

భూషణరావు శవం పడున్న స్థలాన్ని శ్రీనివాస్ చెప్పనక్కర్లేకుండానే గ్రహించాడు కిరణ్. అక్కడ నల్లటి రక్తం మరకలు స్పష్టంగా కనిపిస్తూన్నాయి.

"శ్రీధర్, ఇక్కడున్నాడు....హత్యాయుధం కత్తి-ఇదుగో యీ పొదల్లో పడుంది..." వివరిస్తూన్నాడు శ్రీనివాస్.

కిరణ్ ప్రతీ సెంటీమీటరు క్షుణ్ణంగా పరిశీలిస్తూన్నాడు. ఆధారాలకోసం పరిశోధిస్తూన్నాడు.

రోడ్డుపక్కన కొంతమేర ఇసక, ఆ తర్వాత పిచ్చి మొక్కలు, రోడ్డుకిరువైపులా పచ్చటి పొలాలు కనిపిస్తూన్నాయి. ఇసకలో ఒంగి చూస్తున్న కిరణ్ కి రెండు జతల బూటు వేలిముద్రలు అస్పష్టంగా కనిపించాయి.

అవి పోలీసు బూట్లముద్రలు కాదు.

మార్కెట్ లోకి కొత్తగా వచ్చిన ఓ పేరుమోసిన కోళ్ళ సంస్థ ప్రత్యేకంగా డిజైన్ చేసిన 'ఫెదర్ లైట్' షూస్ అవి!

కోటుజేబునించి మెజరింగ్ టేప్ తీసి వాటిని కొలిచాడు కిరణ్. రెండూ వేరు వేరు నంబరు షూస్. ఒకటి పది, రెండోది పదకొండు అంటే ఇద్దరూ కూడా పెద్ద సైజు పాదాల వ్యక్తులు!

శ్రీనివాస్ ఆశ్చర్యంగా, ఆసక్తిగా కిరణ్ వంక అతని చర్యల్ని పరిశీలిస్తూ చూస్తూన్నాడు.

కిరణ్ ఇసకలోనే మరో కొలతని సేకరించాడు. అది మోటర్ బైక్ చక్రం ముద్ర 100 సి.సి. మోటర్ బైక్ చక్రం కొలత అది!

మనసులోనే ఆ మోటర్ సైకిళ్ళ పేర్లు మననం చేసుకున్నాడు కిరణ్. హీరో హోండా, ఇండ్ సుజుకి, కవా

సాకి—ఏదైనా కావచ్చు!

"శ్రీధర్‌ది కూడా మోటర్ సైకిలనుకుంటా, ఏ కంపెనీది?" అడిగాడు కిరణ్.

"అది ఎన్ ఫీల్డు బులెట్."

అంటే 350 సి.సి. అన్నమాట! అనుకున్నాడు కిరణ్.

"బుల్లెట్ మీదే కాకుండా, మారుతి కార్లో కూడా తిరుగుతుంటాడని తెలిసింది" చెప్పాడు శ్రీనివాస్—కిరణ్ తలపంకించాడు.

కిరణ్ ఆ ప్రదేశాన్ని ఎక్స్‌రే కళ్ళతో పరిశోధిస్తున్నాడు. చిన్న అంశాన్ని కూడా దృష్టిపథంనించి తప్పిపోకుండా పరిశీలిస్తున్నాడు.

మరో పదినిమిషాల తర్వాత కిరణ్ పరిశోధన ఫలించింది.

పొదల్లో నాలుగు సిగరెట్ పీకలు ఖాళీ సిగరెట్ పెట్టె దొరికాయి. పీకల్ని వేలిముద్రలు పడకుండా జాగ్రత్తగా ట్రేస్ పేపర్లో చుట్టాడు కిరణ్. సిగరెట్ పెట్టెమీద పేరు చూశాడు. రాయల్ హెవెన్ సిగరెట్ కేసది. ఇంపోర్టెడ్ సిగరెట్స్!

అక్కడ చాలాసేపు యెవరో వేచి వున్న సూచనగా పిచ్చిమొక్కలు, గడ్డి నలిగి వున్నాయి.

"శ్రీధర్‌కి పొగతాగే అలవాటుందా?" కిరణ్ అడిగాడు.

"తెలీదు, ఉండేవుంటుంది" అన్నాడు శ్రీనివాస్.

"తెలుసుకో!" అన్నాడు కిరణ్. "అతని సిగరెట్స్ బ్రాండ్ కూడా!"

శ్రీనివాస్ తలపంకించాడు.

కిరణ్ పాదల దగ్గరే నిల్చుని ఆలోచిస్తూన్నాడు.

'భూషణరావు రాత్రిపూట ఈ రోడ్డుకెందుకు వచ్చాడు? అతనికిక్కడేం పని? ఎవరైనా శ్రీధర్‌కి ఫోన్ చేసినట్టే అతనికీ ఫోన్ చేసి పిలిచివుండాలి. అది హంతకుడే అయుండాలి. హంతకులు ఒకరికన్న ఎక్కువే నని తెలిసిపోతూనే వుంది. ఎవరివుందా అవసరం? శరత్‌కా? లేక శ్రీధర్ తండ్రి రాజవర్మకా?' కిరణ్ ఆలోచనలు అనంతంగా సాగిపోతున్నాయి.

సూర్యుడు నడినెత్తికొచ్చాడు. ఎండ తీవ్రత తారస్థాయికి చేరుకుంటున్న సమయం.

కిరణ్ కళ్ళు మాత్రం ఇంకా ఆధారాలకోసం అన్వేషిస్తూనే వున్నాయి. దొరికిన ఆధారాలు హంతకుడ్ని ట్రేస్ చెయ్యటానికి చాలు! అయినా అంతకన్న ముఖ్యమైనదేదో దొరకవచ్చునని ఆశావాదం అతనిది!

ఎండవేడిమికి తళతళ మెరుస్తూన్న కాగితం కిరణ్ దృష్టిలో పడింది. తీసాడు.

అది కెమెరా ఫిల్మ్ హోల్‌ని చుట్టివుండే అల్యూమినియం రేపర్! సరికొత్తది.

కిరణ్ కళ్ళు మెరిశాయి. ఎవరో గత రాత్రి జరిగిన హత్యాకాండని ఫోటోతీసి వుండాలి! కెమెరాలో ఫిల్మ్ని అప్పటికప్పుడు లోడ్ చేసి మరీ తీశారెవరో! అంటే హంతకుడు—లేదా హంతకులతోబాటు మరో ప్రత్యక్ష సాక్షి వున్నాడన్నమాట!

కిరణ్ ఆ రేపర్‌ని పట్టుకునే చుట్టూ దేనికోసమో వెతికాడు. పొదల్లో చిక్కుకున్న చిన్న అట్టపెట్టె కనిపించింది.

నెగటివ్ ఫిల్మ్ను దాచివుంచే కార్టన్ అది!

ఆగ్ఫా కంపెనీ ఫిల్మ్ రీల్. బ్లాక్ అండ్ వైట్. దానిమీద బాచ్ నంబరు, డేట్ ఆఫ్ మాన్యుఫేక్చర్, ఎక్స్పైరీ డేట్ మొదలైన వివరాలు చూసి సంతృప్తిగా తలాడించాడు కిరణ్.

మరో అయిదు నిమిషాల తర్వాత చిరునవ్వుతో శ్రీనివాస్ వంక చూసి, "మన పని ముగిసింది మిస్టర్ ఇన్ స్పెక్టర్! వెళ్దామా?" అన్నాడు.

శ్రీనివాస్ కళ్ళప్పగించి కిరణ్ వంకే చూస్తున్నాడు. "బ్రదర్ మా పోలీసు కళ్ళకి కనపడకుండా దాక్కున్న చాలా విషయాల్ని నీ ఎక్స్రే కళ్ళు కనిపెట్టేశాయి. చాలా సేకరించావు. ఇవన్నీ హంతకుడికి సంబంధించినవే నంటావా?" అన్నాడు.

"హంతకుడ్ని కనిపెట్టడానికి ఆధారాలు ఉపకరిస్తాయి" అన్నాడు కిరణ్ క్లుప్తంగా.

"అంటే ... శ్రీధర్ హంతకుడు కాదంటావా?" నీరుగారిపోతూ అడిగాడు శ్రీనివాస్. అతని కళ్ళముందు ప్రళయకాల రుద్రుడిలా తనమీద విరుచుకుపడుతున్న ఎస్పీ భీకర రూపం నాట్యం చేస్తోంది. దాదాపు ఎస్పీతో సవాలు చేశాడు తను—కేసు ప్రూవ్ చేస్తానని! కాని కథ అడ్డంతిరిగేలా వుంది. తను రిజైన్ చేయటమే మంచిదాగా వుంటుంది ఎస్పీ పనిష్మెంట్ భరించేకన్నా.

శ్రీనివాస్ ముఖంలోని భావాల్ని అద్దంలోని ప్రతిబింబాన్ని చూసినంత స్పష్టంగా చూశాడు కిరణ్.

చిన్నగా మందహాసం చేసి, "రాజూ యింకా వివరాలు సేకరించుకుని రావాలి కదా! అన్ని విషయాలు తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు.

శ్రీనివాస్ అయిష్టంగానే ముందుకు కదిలాడు.

వాళ్ళ స్టేషన్ చేరేసరికి రాజు ఫోన్ చేశాడని చెప్పాడు సెంట్రీ.

కిరణ్ ఫోన్ ముందే కాచుక్కూచున్నాడు.

అయిదునిమిషాల తర్వాత ఫోన్ మోగింది. రిసీవర్ ఎత్తి "హల్లో కిరణ్ హియర్" అన్నాడు.

"సర్ ...శరత్ కి తిరుగులేని ఎలిబీ వుంది గతరాత్రి. తెల్లవార్లూ అతను స్నేహితులతో పేకాడుతున్నాడు. తెల్లవారుఝామున ఓ స్నేహితుడి పెళ్ళి ముహూర్తం వుంటే దానికి హాజరయ్యాడు. నిన్న సాయంత్రం అదే పెళ్ళిలో విందుకు హాజరయ్యాడు. అప్పట్నుంచీ స్నేహితులతో పేకాడుతూ అదే పెళ్ళిపందిట్లో అతనున్నాడు తెల్లారేవరకు" చెప్పాడు రాజు.

"ఇంకో ఇన్ఫర్మేషన్ కావాలి. అతనికి మోటర్ బైక్ వుండివుంటే, అదేకంపెనీదో తెల్సుకో, అలాగే, అతను కాల్చే సిగరెట్ బ్రాండు అతని పాదంసైజు తెల్సుకో. నిన్న రాత్రి అతని స్నేహితుడి పెళ్ళిఫోటోలు ఎవరుతీశారో ఆ వివరాలు కూడా సేకరించు" చెప్పాడు కిరణ్.

"ఓకే సర్! సరిగ్గా ఓ గంట తర్వాత వివరాలతో మీముందుంటాను" అన్నాడు రాజు ఫోన్ పెట్టేస్తూ.

కిరణ్ అయోమయంగా చూస్తూన్న శ్రీనివాస్ వైపు నవ్వుతూ చూసి, "నేనో గంటలో మళ్ళీ స్టేషన్ కొస్తాను. ఈలోపల రాజు వస్తే వేచివుండమను" అని పైకిలేచాడు.

సరిగ్గా అప్పుడే స్టేషన్ముందు మారుతీ కారాగింది. అందులోనించి ఖరీదైన నడివయస్కుడు దిగాడు. పెద్దాపురం సిల్కు లాల్చీ, గ్లాస్కో పంచె, కాళ్ళకు ఖరీదైన మొఖమల్ అడుచెప్పులు, చేతిలో రాయల్ సైజు సిగరెట్టు

అతని హోదాని, హుందాతనాన్ని, అంతస్తుని చాటి చెప్తున్నాయి.

# 7

అజానుబాహులైన ఆ వ్యక్తి సరాసరి ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ ముందుకొచ్చి నిల్చుని విష్ కూడా చెయ్యకుండా కిరణ్ పక్కనే వున్న మరో కుర్చీలో నిర్లక్ష్యంగా కూచుని శ్రీనివాస్ వైపు సూటిగా చూసి, "నా పేరు రాజవర్మ, మీ ఎస్పీ ఈపాటికి చెప్పే వుండాలి" అన్నాడు.

లేవబోయిన కిరణ్ అప్రయత్నంగా మళ్ళీ కూచుండి పోయాడు. వెదకబోయిన తీగే కాలికి తగిలింది, శ్రమ తప్పింది అనుకున్నాడు.

శ్రీనివాస్ రాజవర్మ ప్రవర్తనకు లోలోపల మండి పోతున్నాడు. అయినా ఎస్పీ రికమెండ్ చేసిన కాండిడేట్ కావటంతో ఆవేశాన్నదుపులో పెట్టుకుని సౌమ్యంగా అడిగాడు.

"మీకేం కావాలి?"

"నా కొడుకు శ్రీధర్ని వెంటనే విడుదల చెయ్యండి. వాడ్ని రాత్రంతా లాకప్‌లో వుంచినందుకు మీ డిపార్టుమెంట్ మీద కోర్టుకు వెళ్ళాల్సిందేగాని, మీ ఎస్పీగారి ముఖం చూసి విరమించుకున్నాను. వెంటనే మావాడ్ని నా వెంట పంపకపోతే అంతపనీ జరుగుతుంది" అన్నాడు రాజవర్మ గర్వంగా, నిర్లక్ష్యంగా శ్రీనివాస్ వంక చూస్తూ.

"మీ రెవరైనా నాకనవసరం. శ్రీధర్ హంతకుడి స్థానంలో ప్రధాన అనుమానితుడు. అతన్ని విడిచిపెట్టడం జరగని పని."

"ఇన్‌స్పెక్టర్! అమర్యాదగా మాట్లాడుతున్నారు. నేరం ఋజువు కానిదే పెద్ద పెద్ద మాటలతో మా వాడిన వమానిస్తున్నారు—నన్ను, నా హోదాను కించపరుస్తున్నారు. దీనికి ఫలితం అనుభవించాల్సి వుంటుంది" రాజవర్మ సగం కూడా కాలని సిగరెట్‌ని అక్కడే మూలకు విసిరికొట్టాడు కోపంలో.

అంతలోనే జేబులోంచి సిగరెట్ పెట్టె లైటరు తీసి సిగరెట్ నోట పెట్టి వెలిగించుకున్నాడు.

కిరణ్ చాలా పరిశీలనగా రాజవర్మను ఓరకంట ఆమూలాగ్రం పరికించి చూస్తున్నాడు. అతను కాల్చే సిగరెట్ రాయల్ పైకేగాని బ్రాండ్ ఇండియాదే, ఇంపోర్టెడ్ కాదు. కిరణ్ చూపు అతని కాళ్ళవైపు సాగాయి.

రాజవర్మ పాదాలు బాగా పెద్దవి. బహుశా పది సైజుకన్నా పెద్దవే వుండొచ్చనుకున్నాడు కిరణ్. అతని కాళ్ళకి నల్లటి ముఖమల్ అకు చెప్పులున్నాయి. చాలా ఖరీదైనవి.

రాజవర్మకి భూషణరావుతో వృత్తిరీత్యా ప్రత్యక్ష శత్రుత్వముంది. భూషణరావుని అంతం చెయ్యటాని కతనికున్న కారణాలు అతనికి వున్నాయి.

కిరణ్ సాలోచనగా అతనివైపే చూస్తున్నాడు.

శ్రీనివాస్ అప్పటికే రాజవర్మ మాటలతో బాగా వేడెక్కిపోయాడు. అయినా బలవంతాన నిగ్రహించుకుంటున్నాడు. శ్రీధర్ హంతకుడు కాదేమోనని అనుమానం అప్పటికే అతని మనసులో ప్రవేశించటం, ఓపక్క ఎస్పీతో అనుకోని విరోధం ఏర్పడటం, ఇంకో పక్క రాజవర్మ పేట్రేగిపోవటం—అతనికి మనశ్శాంతిని

దూరం చేశాయి.

"చూడండి రాజవర్మగారూ! మీరు నన్ను బెదిరించనక్కర్లేదు. మేజిస్ట్రేటు నించి పర్మిషన్ తెచ్చుకోండి. మీరు కాక మరో నగర ప్రముఖుడ్ని ష్యూరిటీ చూపించండి. మీ లాయర్ని కూడా వెంటబెట్టుకు రండి. అప్పటిదాకా బెయిలు గురించి మర్చిపోండి" అన్నాడు శ్రీనివాస్ చివరికి.

రాజవర్మ కోపంతో నేలని గట్టిగా తన్నాడు.

"ఇదంతా, కేసు పెట్టేటట్టయితే కదా, ప్రొసీజర్ ప్రకారం పోయేది! మావాడు అసలా సమయంలో ఆ స్పాట్‌లో లేడు. ఇంట్లో హాయిగా నిద్రపోతున్నాడు. దట్సాల్!" అన్నాడు.

"సారీ, నిన్న రాత్రే కేసు రిజిష్టరయిపోయింది. నేను చెయ్యగలిగిందేమీ లేదు" చెప్పాడు శ్రీనివాస్.

రాజవర్మ కప్పు ఎగిరిపోయేలా హుంకరించాడు.

"సరే, యీ అహంకారమెంతసేపో చూస్తాను. స్వయంగా నీ చేతుల్తోనే మావాడ్ని విడిపించితీర్తావు, ఓ గంట తర్వాత!" అనేసి వేగంగా బయటకు వెళ్ళిపోయాడు.

శ్రీనివాస్ ముఖం ఎర్రబడిపోయింది. ఉక్రోషం, కోపం, ఆవేశం, అవమానం-ఇంకా అనేకానేక భావాలు అతని ముఖంలో ప్రతిఫలించాయి.

"కూల్ డౌన్ ఇన్‌స్పెక్టర్, కూల్ డౌన్! ఇంకో గంటలోకదా, రాజవర్మ నీ చేత శ్రీధర్ని విడిపిస్తానన్నాడు!? ఈలోపల హంతకుడి విషయం తేలిపోతుంది. యూ నీడ్ నాట్ వర్రీ!" అన్నాడు కిరణ్.

"ఛ, ఛ! దొరక్క దొరక్క జిడ్డు కేసు దొరికింది,

టెన్షన్‌తో నా తల పగిలిపోతోంది. బ్రదర్, నువ్వే నన్ను ఒడ్డున పడెయ్యాలి" అన్నాడు శ్రీనివాస్ జాలిగా.

కిరణ్‌కి అతన్ని చూస్తూంటే జాలేస్తోంది. తీరికూచుని ఎస్పీతో టగ్ తెచ్చుకున్నాడు. కేసు ప్రూవ్ చేయలేని పరిస్థితిలో వున్నాడు. ఎస్పీ అంత తేలిగ్గా అతన్నొదలడు.

సరిగ్గా అప్పుడే సార్జంటు రాజా స్టేషన్‌లో అడుగు పెట్టాడు.

"మీరడిగిన అన్ని విషయాలు సేకరించాను సార్! శరత్‌కి హీరో హోండా వుంది. శరత్ కాలిపాదం చాలా చిన్నది సార్. కేవలం అయిదు సైజు పాదం శరత్ సిగరెటు తాగుతాడు. విల్స్‌ఫిల్టర్ సిగరెట్లు అతని బ్రాండ్. ఇకపోతే పెళ్ళిఫోటోలు తీసిన వ్యక్తి శరత్ స్నేహితుడు బాబూరావ్. అతనుకూడా విల్స్ సిగరెట్లే తాగుతాడు. అతని పాదంసైజు ఆరుగాని, ఏడుగాని వుండొచ్చు నా అంచనా ప్రకారం" చెప్పాడు రాజా.

కిరణ్ నుదురు కొట్టుకుంటూ ఆలోచిస్తూ వుండిపోయాడు.

శరత్ గాని, అతని స్నేహితుడుగాని రంగంలో లేరనే అనుకోవాలి! బాబూరావుకి ఫోటోలు తీయటం వచ్చు. అయితే....!?

ఆలోచన తెగిపోతోంది. ఎక్కడో ఏదో మెలిక వుంది. కాని లింక్ అందటంలేదు. ఇంతకీ ఏమిటది?

ఇంకా అక్కడే నిల్చున్న రాజాను చూడగానే కిరణ్‌కి సిగరెట్ పీకల విషయం గుర్తొచ్చింది. సిగరెట్ పీకలపాట్లంతో బాటు సిగరెట్ పెట్టెను కూడా సైకి తీశాడు.

"ఈ బ్రాండ్ శరత్ దగ్గరగాని, అతని స్నేహితు లెవరిదగ్గరగాని చూశావేమో గుర్తుచేసుకో రాజా!" అన్నాడు కిరణ్.

రాజా పరీక్షగా చూసి తల అడ్డంగా తిప్పి, "ఇలాంటి పెట్టె శరత్ దగ్గర కాదుకదా ఇంకెక్కడా ఎప్పుడూ చూడలేదు. ఇంపోర్టెడ్ అనుకుంటూ!" అన్నాడు.

కిరణ్ తలూపి. శ్రీనివాస్‌కి ట్రేస్ పేపర్ పొట్లాం అందించి, "ఈ పేకలమీద వేలిముద్రలు వెంటనే తీయించు. అర్జంటు" అన్నాడు.

శ్రీనివాస్ అందుకున్నాడు. వెంటనే ఫింగర్ ప్రింట్స్ ఎక్స్‌పర్టుకి దాన్ని పంపించాడు.

కిరణ్ కేదో గుర్తొచ్చి లేచాడు. శ్రీధర్‌ని రిమాండులో వుంచిన సెల్ దగ్గరకు నడిచాడు.

కిరణ్‌ని చూడగానే శ్రీధర్ ముఖం వికసించింది. "సార్.... నేను నిర్దోషిని....నన్ను విడిపించరూ!?" అన్నాడు.

కిరణ్ మందహాసంచేసి, "తప్పకుండా విడిపిస్తాను. నీ నుంచి కొన్ని వివరాలు కావాలి" అంటూ ఓరగా కాళ్ళవైపు చూశాడు. పాదాలసైజు చిన్నదే. బహుశా ఏడుగాని, ఎనిమిదిగాని వుండొచ్చు. తన అంచనా తప్పలేదు.

"చెప్పండి సార్, ఏం కావాలి?" అడిగాడు శ్రీధర్.

కిరణ్ సిగరెట్ పెట్టెను అతనికి చూపించి "ఇలాంటి బ్రాండ్ సిగరెట్లు నీకు తెలిసి యెవరైనా కాల్చటం చూశావా?" అనడిగాడు.

సిగరెట్ పెట్టెను చూస్తూనే త్రుళ్ళిపడ్డాడు శ్రీధర్. అంతలోనే తన తడబాటును కప్పి పుచ్చుకుంటూ, "అఁ

అవూ, నేనెప్పుడు ఇలాంటి బ్రాండ్ చూడలేదు సార్"
అన్నాడు గబగబా.

కిరణ్ భ్రుకుటి ముడిపడి అంతలోనే విడిపడింది.

చిన్నగా మందహాసం చేసి, "మిస్టర్ శ్రీధర్ నీకు తెలుసు. ఎందుకు దాస్తావు? చూడూ, దీనిమీదే నీ విడుదల ఆధారపడివుందని మరచిపోకు. నువ్వు ఏదైనా దాచిపెట్టాలని ప్రయిత్నిస్తే నీ మెడకు ఉరితాడు బిగిసి పోవటం ఖాయం!" అన్నాడు.

శ్రీధర్ వెంటనే మాట్లాడలేదు. ఆతర్వాత గొంతు పెకలించుకుని, "ఈ పెట్టె మీకెక్కడ దొరికింది?" అన్నాడు.

"ఎక్కడో చెపితేనేగాని నిజం చెప్పవా?" కిరణ్ గొంతులోని తీవ్రతకు కొంత జంకాడు శ్రీధర్. అయినా ఏమీ మాట్లాడలేదు.

కిరణ్ అనుమానం బలపడుతోంది.

"సరే, అయితే చెప్తున్నాను. హత్యాస్థలంలో పొదల్లో దొరికిందీ పెట్టె. ఇప్పుడు చెప్పు, ఎవరీ సిగరెట్లు తాగేది?"

శ్రీధర్ తల అడ్డంగా తిప్పి, "నాకు తెలీదు. నన్ను విడిపించనక్కర్లేదు మీరు. నాకే శిక్షపడినా అనుభవించటానికి సిద్ధంగా వున్నాను" అంటూ ముఖం తిప్పేసుకుని సెల్ లోపలకు వెళ్ళిపోయాడు.

కిరణ్ నిర్ఘాంతపోయి చూశాడతని వంక. అతనిన ఒక్కసారిగా హంతకుడు శ్రీధర్ కి బాగా తెలిసిం వ్యక్తి అని అర్ధమైపోయింది. హంతకుడ్ని కాపాడటకి కోసం నేరాన్ని తనమీద వేసుకోవటానికి శ్రీధర్ సిద్ధపడిపోతున్నాడంటే, హంతకుడు....!?

ఆ మరుక్షణం కిరణ్ స్టేషన్ బయట వున్నాడు. అతని టయోటా అతివేగంగా రాజవర్మ ఇంటివైపు దూసుకుపోయింది.

# 8

టయోటా రాజవర్మ భవనానికి దూరంగా పార్కు చేసి కాలినడకన ఇంటివైపు సాగిపోయాడు కిరణ్. అతనిప్పుడు డిటెక్టివ్ కిరణ్ కాదు. ఓ సామాన్యమైన, యూనిఫాం ధరించిన, కారు డ్రైవర్.

గేటుదగ్గర అతనికెవరూ ఎదురుపడలేదు. కాని గేటు బయట స్టాండు వేసి వున్న హీరోహోండా అతన్ని ఓ క్షణం పట్టి ఆపింది.

కిరణ్ మెల్లగా దాని దగ్గరకు నడిచి చక్రాలని పరీక్షగా చూశాడు. అతని కళ్ళు మెరిశాయి. చక్రాల స్పోక్స్‌కి ఎర్రటి మట్టి కొట్టుకుని వుంది. ఆ ఎర్రమట్టి నాగార్జున సాగర్ రోడ్ పక్కనున్న ఇసుకమట్టి. అనుమానంలేదు!

కిరణ్ మస్తిష్కం వేగంగా పనిచేస్తోంది. తను కేసుకి చాలా దగ్గరగా వచ్చేస్తూన్నాడు.

చప్పుడుకాకుండా గేటుతీసుకుని లోపలకు నడిచాడు. గేటునుంచి దాదాపు ఏభైమీటర్ల దూరంలో వుంది భవనం.

కిరణ్ భవనం ముందునించి కాకుండా వెనకవైపుకి నడిచాడు.

అప్పుడు సమయం సాయంత్రం మూడున్నర గంట అయింది.

పోర్టికోలో మారుతీకారు పార్క్ చేయబడి వుంది. అంటే రాజవర్మ ఇంట్లోనే వున్నాడన్నమాట!

వెనకవైపు వెళ్తూ ఓ గదిలోనుంచి మాటలు వినిపించటంతో సగం వంగిపోయి అటు మోకాళ్ళమీద నడుస్తూ కిటికీ పక్కకు చేరుకున్నాడు కిరణ్. భవనంచుట్టూ ఒత్తుగా ఎత్తుగా పెరిగివున్న పూలమొక్కలు ఓ పెద్ద వనంలా కనిపిస్తోంది. అదే తనకిప్పుడు బయట కనిపించకుండా రక్షణ!

"బాబూరావ్....నీకింత అత్యాశ పనికిరాదు. ఏభై వేలు చిన్న మొత్తం కాదు. ఇంతటితో తృప్తిపడి వెళ్ళిపో! ఆ నెగటివ్ లుకూడా ఇచ్చేయి" అది రాజవర్మ గొంతు.

బాబూరావ్ అని పిలవబడ్డ యువకుడు చిన్నగా నవ్వాడు. "అదేంటి సార్, మరీ అంత తక్కువ విలువ కడతారు. మీ అల్లుడి ప్రాణాలవి! లక్షకి పైసాతగ్గను. శ్రీధర్ ఫోటో ఉచితంగా ఇచ్చేస్తాను. లేదా ఇప్పుడే శ్రీధర్ ఫోటో పోలీసులకి హేండోవర్ చేసేస్తాను. అప్పుడు మీరు కాదు కదా, లేదా, ఆ హరిహరాదులొచ్చినా శ్రీధర్ కి ఉరిశిక్ష తప్పదు. తేల్చండి మరి! అల్లుడి ఫోటో, కొడుకు ఫోటో రెండూ ఇచ్చేసి వెళ్ళిపోతాను" అంటున్నాను.

"సమయానికి మా అల్లుడింట్లో లేడు. సరే, నువ్వు రేపుదయం రా. నేను అర్జంటు పనిమీద ఎస్పీగార్ని కలవాల్సి వుంది. ఆ ఫోటోలు యిచ్చేసిపో. రేపు డబ్బు తీసుకో."

బాబూరావ్ నవ్వాడు "సార్, తెలివి మీ ఒక్కరి సొత్తే కాదు. ఈ ఫోటోలు, నెగటివ్ లక్ష నాచేతికందకనే మీ స్వాధీనం చేస్తాను, వస్తాను...." అంటూ బయటకు వేగంగా వచ్చేస్తున్న యువకుడ్ని పరీక్షగా

చూశాడు కిరణ్.

వెనకనుంచి రాజవర్మ ఏదో పిలుస్తూన్నా వినిపించు కోకుండా వేగంగా గేటుతీసుకుని వెళ్ళి మోటర్ బైక్ స్టార్టుచేస్తూన్నాడు బాబూరావు.

దాటిపోతున్నాడు, తను వెంటనే వెళ్ళాలి. కాని ఇంటి ముందునుంచి వెళ్తే రాజవర్మ కంటపడక తప్పదు!

కిరణ్ చకచక పూలమొక్కల మధ్యనుంచి కాంపౌండ్ వాల్ వైపు నడిచాడు. దాదాపు అయిదడుగుల ఎత్తుంది గోడ. అటు యిటు చూశాడు. పూల మొక్కలకు వేసిన పందిరి కనిపించింది.

పందిరికున్న పొడవాటి వాసం కర్రను లాగి నేలమీద తాటించి గాల్లోకి ఎగిరాడు. సరిగ్గా కాంపౌండ్ వాల్ అవతలకు జంప్ చేశాడు. రోడ్‌మీద బాలెన్స్‌గా నిల బడ్డాడు. అప్పటికే హీరోహోండా రోడ్డు మలుపు తిరుగుతోంది. ఒక్క అంగలో తన టయోటాని సమీ పించి స్టార్టుచేసి గేర్లు మారుస్తూ వేగాన్ని పెంచాడు కిరణ్.

టయోటా హీరోహోండాని క్షణాల్లో అందుకొంది.

ఊరికి దూరంగా ప్రశాంతంగా వుండాలని కట్టు కున్నాడు రాజవర్మ ఆ ఇల్లు—నాగార్జునసాగర్ పోయే రోడ్డులో!

అకస్మాత్తుగా తనకడ్డంగా వచ్చిన టయోటాను చూసి సడన్ బ్రేక్‌తో ఆపాడు బాబూరావ్. మరుక్షణం కిరణ్ కార్లోంచి బయటికురికి బాబూరావ్ మీద దాడి చేశాడు.

బాబూరావ్ పరిస్థితిని గ్రహించేలోపల అతని మెడ

మీద కడుపులోను బలంగా తన్ని నేలమీద పడేశాడు కిరణ్. కోటుజేబునించి రివాల్వర్ తీసి గురిపెట్టి, మరో చేత్తో బాబూరావు రెక్కపట్టుకుని కార్లో కూలదోసి అతని కణతకి రివాల్వర్ ఆనించి, "ఏవీ ఆ ఫోటోలు?" అన్నాడు కూల్ గా.

ఈ హఠాత్పరిణామానికి, అకస్మాత్తుగా తగిలిన దెబ్బ లకి అదిరిపోయిన బాబూరావ్ కిరణ్ని ప్రతిఘటించే ధైర్యంలేక పిచ్చివాడిలా ఫోటోలు తన భుజానికున్న బ్యాగ్ లోనించి తీసిచ్చాడు.

రివాల్వర్ని బాబూరావ్ కణతకు అలాగే ఆనించి ఫోటోల్ని చూశాడు కిరణ్.

ఓ ఫోటోలో అజానుబాహుడైన ఓ యువకుడు కత్తితో భూషణరావుని పొడుస్తున్నాడు. అతను శ్రీధర్ కాదు. రాజవర్మ అసలేకాదు.

రెండో ఫోటోలో శ్రీధర్ భూషణరావు మీదికి ఒంగి చూస్తూన్నాడు, భూషణరావు రోడ్డుమీద వెల్లకిలా పడున్నాడు.

మొదటి ఫోటోలోని వ్యక్తి వంక చూపించి, "ఎవ రితను?" అన్నాడు కిరణ్.

బాబూరావ్ భయంగా చూస్తూ "రాజవర్మ అల్లుడు ఫణీంద్ర" అన్నాడు.

కిరణ్ విస్తుపోయాడు. శ్రీధర్ తన నేరాన్ని అంగీక రించటానికెందుకు సిద్ధపడ్డాడో అర్థమైపోయింది.

"ఈ ఫోటోలు నీకెలా వచ్చాయి, చెప్పు!" అన్నాడు కిరణ్ రివాల్వర్ మొనని అతని కణతకు గట్టిగా గుచ్చుతూ.

బాబూరావ్ కి ప్రాణభయం పట్టుకుంది.

"చెప్తే నష్టం చెయ్యకుండా వదిలేస్తారా?" అనడి గాడు.

"ఈ హత్యతో నీకేం సంబంధం లేదని నాకు నమ్మకం కలిగితే!...."

"నాకీ హత్యలో యెలాంటి సంబంధం లేదు. నేనంతా నిజం చెపుతాను. నన్ను వదిలెయ్యండి...." అంటూ ప్రాధేయపడ్డాడు బాబూరావ్.

కిరణ్ తలపంకించి "చెప్పు!" అన్నాడు.

బాబూరావు చెప్పటం మొదలెట్టాడు:

"నా స్నేహితుడు శరత్ భూషణరావుగారి అమ్మాయి వినీలని ప్రేమించాడు. కాని వినీల అతన్ని తిరస్కరించి శ్రీధర్ తో తిరుగుతోండటంతో శ్రీధర్ని అడ్డుతొలగించాలని శరత్ నన్ను ప్రయోగించాడు. నిన్నరాత్రి మా స్నేహితుడి పెళ్ళి. ఆ పెళ్ళిలో శరత్ సాయంత్రంనించి తెల్లవార్లూ హాజరవుతాడు. అతనిమీద ఎవరికీ అనుమానంరాదు. అందుకే నిన్నరాత్రికే శ్రీధర్ని హత్య చెయ్యటానికి శరత్ ప్లాన్ చేశాడు. అతని ప్లాన్ ప్రకారం నేను శ్రీధర్ని నాగార్జునసాగరురోడ్డులోని పదోనెంబరు కిలోమీటరు రాయిదగ్గరకు రప్పించి హతమార్చాలి. శ్రీధర్ని రాత్రి పదిన్నరకు ఆ కిలోమీటర్ రాయిదగ్గరకు ఫోన్ చేసి రప్పించే బాధ్యత శరత్ తీసుకున్నాడు.

"నేను ముందుగానే అంటే రాత్రి పదిగంటలకే హీరోహోండామీద నాగార్జునసాగరురోడ్ దగ్గరకు చేరుకున్నాను. నా హోండాని ఎవరికీ కనిపించకుండా పొదల్లో దాచి నేను అక్కడే నక్కి కూచున్నాను.

"రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. నేను మళ్ళీ పదకొండుగంటలకల్లా తిరిగి మా స్నేహితుడి పెళ్ళికి హాజ

రవ్వాలి పెళ్ళిఫోటోలు తియ్యటానికి. అంతకి వారం క్రితమే నా స్నేహితుడు నన్ను నియమించాడు. నే నంగీకరించాను. అనుకోకుండా శరత్ పెళ్ళిరాత్రే యీ పని పెట్టాడు. అంతక్రితమే ఫోటోరీల్సు కొని కెమెరాను కూడా వెంట తెచ్చుకున్నాను. సరాసరి పెళ్ళికి వెళ్లొచ్చునని!

“అయితే కెమేరా అంత గొప్పగా ఉపయోగపడుందని అప్పుడే తెలిసింది. నేను సిగరెట్లు కాలుస్తూ టైం గడుపుతున్నాను. సరిగా అప్పుడే ఓ మారుతీ కారొచ్చి ఆగింది. నంబరు చూశాను. అది రాజవర్మదని నాకు తెలుసు. ఎక్కువగా శ్రీధర్ తిరుగుతూంటాడు దానిలో. పిట్ట వల్లో చిక్కబోతుందని సంబరపడుతుండగా కార్లోంచి ఎవర్నో ఎత్తుకొని ఓ వ్యక్తి కిందికి దిగాడు.

“చూడగానే ఆవ్యక్తి శ్రీధర్ బావ ఫణీంద్ర అని గుర్తుపట్టాను. అతను శ్రీధర్ ఇంట్లోనే ఇల్లరికముంటున్నాడు. అయితే అతను దించిన శవం భూషణరావుదని గుర్తుపట్టడానికి రెండునిమిషాలు పట్టింది. నేను ఊపిరి బిగబట్టి చూస్తున్నాను.

“సరిగ్గా అప్పుడే నాకు ప్లాష్‌లాంటి ఆలోచన వచ్చింది. వెంటనే కొత్తరీలు తీసి ఫిల్ము లోడ్ చేశాను కెమెరాలో. సరిగ్గా అప్పుడే ఫణీంద్ర భూషణరావు శరీరంనించి కత్తిని పైకిలాగి పొదల్లోకి విసిరేసున్నాడు. సరిగ్గా అదే పాట్‌ని నేను ఫిల్ముమీద ముద్రించాను. ఆ హడావిడిలో నా కెమెరా ప్లాష్ వెలుగును ఫణీంద్ర గుర్తించలేదు_వెంటనే కారు వెనక్కి తిప్పుకొని పారిపోయాడు.

“నాకప్పుడు మరో గొప్ప ఆలోచన వచ్చింది. మరో

క్షణంలోనో నిమిషంలోనో శ్రీధర్ అక్కడికి వస్తాడు, అతన్ని ట్రాప్ చేసే నే? ఆలోచనని వెంటనే ఆచరణలో పెట్టాను. జంక్షన్ లో టెలిఫోన్ బూత్ వచ్చింది. అక్కడ్నుంచి పోలీసులకి ఫోన్ చేశాను. పదో నంబరు కిలో మీటర్ రాయిదగ్గర హత్య జరగబోతోందని వెంటనే వస్తే హంతకుడు స్పాట్ లో నే దొరుకుతాడనీ. నా ప్లాన్ కి నేనే నవ్వుకుని మళ్ళీ స్పాట్ కొచ్చాను. సరిగ్గా అప్పుడే తన మోటర్ బైక్ మీద శ్రీధర్ అక్కడికి రావటం చూశాను. శవాన్ని చూసి శ్రీధర్ బైక్ ఆపి దిగి దగ్గరగా వెళ్ళాడు. ఒంగిచూస్తున్న సమయంలో కెమెరాతో మరో షాట్ తీశాను. వెంటనే అక్కడ్నుంచి నేను మళ్ళిపోవటం దూరంగా పోలీస్ జీప్ రావటం ఒకేసారి జరిగాయి.

"నేను పోలీస్ జీప్ నన్ను దాటిపోయేవరకు నా హోండాని పొదల్లోకి తప్పించి వాళ్ళు దాటిపోయాక సిటీవైపు వచ్చేశాను. వెనక్కి తిరిగి చూసిన నాకు శ్రీధర్ ని పోలీసులు చుట్టుముట్టడం కనిపించింది. తర్వాత అతన్ని పోలీసులు అరెస్టు చేసినట్టు ఉదయమే తెలిసింది. నేను తీసిన ఫోటోల్ని మరోవిధంగా ఉపయోగించుకోవచ్చని కూడా అప్పుడే తట్టింది.

"రాజవర్మకి ఫోటోలు చూపించి బ్లాక్ మెయిల్ చేశాను. అతను రేపు రమ్మన్నాడు. తిరిగొచ్చేస్తుంటే మీరు పట్టుకున్నారు" అంటూ ముగించాడు బాబూరావు.

"అయితే నువ్వు వాడే సిగరెట్లు రాయిల్ హెవెన్ బ్రాండ్ వా?" అడిగాడు కిరణ్.

"సాధారణంగా విల్స్ ఫిల్టర్ తాగుతాను. గతరాత్రి మాత్రం ఓ ఫ్రెండ్ బహూకరించిన రాయిల్ హెవెన్ సిగరెట్లు తాగాను" చెప్పాడు బాబూరావు.

'అయితే ఫణీంద్ర వారేడికూడా రాయల్ హౌస్ సిగరెట్లే నన్నమాట!' అనుకున్నాడు కిరణ్.

కిరణ్ రాయను సరాసరి పోలీసుస్టేషన్‌కి తీసుకుపోయి ఆపాడు.

"మీరు నన్నొదలి పెడ్తానన్నారు?" అంటూ గోల పెట్టాడు బాబూరావు.

*　　　*　　　*

ఫణీంద్ర తన నేరాన్ని అంగీకరించాడు.

అతను తన స్టేట్‌మెంట్లో ఇలా చెప్పాడు.

"ఆరాత్రి భూషణరావు మా మామగారి దగ్గరకొచ్చి తన కూతుర్ని శ్రీధర్‌కి చేసుకోమని అడిగాడు. మా మామగారు అంగీకరించలేదు. మాటమాట పెరిగింది. మా మామగార్ని భూషణరావు నిందించాడు. నేను భరించలేక ఆవేశంతో శ్రీధర్ గదిలోని పండ్లుకోసుకునే కత్తి తీసుకొచ్చి భూషణరావుని పొడిచాను. వెంటనే చనిపోయాడతను. అతన్ని వెంటనే దూరంగా పారేసి రమ్మని చెప్పారు మామగారు. నేను అలాగే చేశాను. అయితే శ్రీధర్ యీ కేసులో యిరుక్కుంటాడనిగాని, నేను పట్టుబడతానని గాని ఊహించలేకపోయాను"

విశేషమేమిటంటే, ఫణీంద్ర పాదాలు ఒకటి పొడవు మరొకటి దానికన్న ఓ అంగుళం పొట్టి. అతను అందుకే ఓ కాలికి పదోనంబరు షూ, రెండో దానికి పదకొండో నంబరు షూ వాడతాడు.

—: అయిపోయింది :—

# మృత్యు భస్మం

ఎ.యస్. రావ్

రైల్వేస్టేషన్ ముందు కారాపి, అతను కింది దిగాడు.

కోటు జేబులోంచి పాకెట్ ఇవతలికి తీసి, సిగరెట్‌ని వెలికి లాగాడు. అతని కళ్ళు పరిసరాల్ని పరిశీలిస్తున్నాయి. అప్రయత్నంగా పాకెట్‌ని జేబులోకి దోపాడు. ఎడమచేతి బొటనవేలిమీద సిగరెట్ ఫిల్టర్ని సున్నితంగా కొట్టసాగేడతను. టిప్డు సిగరెట్‌ని అలా కొట్టాల్సిన అవసరంలేదని అతనికి తెలుసు.

స్టేషన్ ముందు ఖాళీగా వుంది. ఎంట్రన్స్‌కి ఇరువైపులా టాంగాలూ, రిక్షాలూ వరసగా వున్నాయి. రాబోయే ట్రెయిన్‌లోంచి దిగి, ఎక్కబోయే గిరాకీల కోసం రిక్షావాలాలూ, టాంగావాలాలూ కాచుక్కూచున్నారు. తనవేపు అంతగా ఎవరూ చూడ్డంలేదు. తన వల్ల వాళ్ళకి గిరాకీ లేదని వాళ్ళకి తెలుసు!

పరిసరాల్ని గమనించే గద్ద చూపుల్లా అతని చూపులు తీక్షణంగా అటూ ఇటూ కదుల్తున్నాయి. అతని కళ్ళు

మెరిశాయి. సిగరెట్ని పళ్ళతో పట్టుకుని అతను అగ్గి పుల్ల గీశాడు. ఊపిరితిత్తుల నిండుగా పొగలాగి, సిగరెట్ని ఇవతలికి తీశాడు. నుదురుమీంచీ కిందికి జారిన ఫెల్టు హేట్ని చూపుడు వేలితో కొద్దిగా పైకి తోశాడు. ఖరీదైన పాంటులో దాక్కున్న అతని పొడుగాటి కాళ్ళు కదిలాయి.

స్టేషన్ బిల్డింగ్ గోడవారగా వున్న సన్నటి అరుగు మీద ఇరుక్కుని కూచుని పచ్చీస్ ఆడుతున్న నలుగురు యువకులమీదే అతని చూపులు నాటుకుపోయివున్నాయి. తనని చూస్తే వాళ్ళు దడుచుకుని, ఆట మానేసి పరుగు అంకించుకోవచ్చు. అయినా మనిషిని చూడగానే హడలిపోయి పిక్కబలంచూపే కుర్రాళ్ళు తనకి పనికిరారు! నవ్వుకుంటూ అతను వాళ్ళని సమీపించాడు. నలుగురూ పూర్తిగా ఆటలో లీనమై వున్నారు.

"చార్! మారో!" కాస్సేపు వీపు కులికించి, చేతని లాఘవంగా విసిరిన యువకుడు అరిచాడు.

"జరూర్, మారేంగే, యార్!" అప్పుడే అక్కడ ఆగిన అతను బిగ్గరగా అన్నాడు.

నలుగురూ ఒకేసారి వులిక్కిపడి, ఒకేసారి తలలు తిప్పి చూశారు. ఖరీదైన డార్క్ కలర్ ఫుల్సూటు. పెదాల చివర మెలితిరిగిన మీసాలు. ఫెల్టుహాట్. ఎత్తుగా, ఠీవిగా నించున్న అతన్ని నాలుగుజతల కళ్ళు కంగారుగా చూశాయి.

అతని చూపులు వాళ్ళమధ్య బొగ్గుతో గీయబడిన గీతలమీద వాలాయి. చింతపిక్కలూ గుండ్రటి రాళ్ళూ. ఒక చెయ్యి మెల్లగా పాకి, ఇత్తడి పాచికల్ని కప్పేసింది.

"బేవకూఫ్, ఈ జూదం అడ్డం నేరమని మీకు ఎన్ని సార్లు చెప్పాలి?" అతను హిందీలో దబాయించాడు.

పాచికల్ని అరచేతిలో ఆనించిన యువకుడు కళ్ళు చిట్లిస్తూ చూశాడు.

"మీరు ...ఎవరు? పులీస్?" ధైర్యంగా అడిగా డతను హిందీలో.

"కాకపోతే, నీ మేనమామ అనుకున్నావా?"

"పులీస్ భాయిల్తో మిమ్మల్నెప్పుడూ చూడలేదు .. ఈ వారం మామూలు పు లీ స్ భా య్ రాధేశ్యాంకి నిన్ననే యిచ్చాం!" యువకుడు అనుమానిస్తూ అన్నాడు.

"రాధేగాడికిచ్చావ్. మిగతా వాళ్ళకి?" అతను కోపంగా అడిగాడు.

"అది మాకు తెలీదు. అందర్నీ రాధేశ్యాంభాయ్ చూసుకుంటానన్నాడు" రెండో యువకుడు కల్పించు కున్నాడు.

"వాడు చూసుకోలేదేమో! అందుకే శివ్‌చరణ్ మీ గురించి మాకు రిపోర్టు చేశాడు."

"మీరు.... మీరు...."

"సి.ఐ.డి. ఆఫీసర్, కటక్!"

"ఓహ్! కటక్ ,అందుకే కొత్తగా వున్నారు."

"అచ్ఛా..వాట్ని ఇలా ఇవ్వు. నలుగురూ పదండి."

"ఎక్కడికి సాబ్?"

"అత్తారింటికి! పేర్లు చెప్పండి!" అంటూ అతను జేబులోంచి చిన్న డైరీ, పెనా తీశాడు.

అరుగు అంచుమీద కూచున్న ఇద్దరు మెల్లిగా కాళ్ళని కిందికి దించారు. అతను వాళ్ళని ఉరుముతూ చూశాడు.

"షైర్!"

నలుగురూ ఉలిక్కిపడ్డారు. ఇద్దరు అదరాబాదరా సర్దుకున్నారు.

"కమాన్! పేర్లు."

"సాబ్..మాఫ్ కర్నా..ఇదే మొదటిసారి.." మొదటి యువకుడు మెల్లగా అన్నాడు.

అతను చిరునవ్వుతో ఆ యువకుడి నక్కకళ్ళల్లోకి చూశాడు. వారం వారం కానిస్టేబుల్ రాధేశ్యాంకి మామూలిచ్చే గడుగ్గాయి, ఇదే మొదటిసారి అంటున్నాడు! అతని మొహంమీద చిరునవ్వు తటాలున మాయమైంది.

"పచ్చీస్ అదే వాళ్ళని పదహారు నెలలు లోపల తోయమని ఈ మధ్యే హైకోర్టు ఉత్తరువిచ్చింది. పదండి..అక్కడ ఆడుకుందురుగానీ! ఊ!"

నలుగురూ అతన్ని కంగారుగా చూశారు. "నై సాబ్ మాకు రాధేశ్యాం చెప్పలేదు సాబ్..ఈసారికి వొది లేయండి సాబ్."

నలుగుర తరఫునా ప్రాధేయపడుతున్న యువకుణ్ణి అతను సూటిగా చూశాడు. అతని చెయ్యి ముందుకు సాగింది.

"ఆ పాచికలూ, మీ జేబుల్లోని డబ్బూ ఇలా ఇవ్వండి. పేర్లు అడక్కుండా వెళ్ళిపోతాను...." అన్నాడతను తగ్గుస్వరంలో.

యువకుడు క్షణకాలం తటపటాయించి, పాచికల్ని అతని చేతిలో పెట్టేశాడు. మెల్లగా రెప్పలెత్తి అతని కళ్ళల్లోకి చూశాడు.

"పైసలు లేవు సాబ్."

"షటప్! పైసల్లేకుండా మీరు పచ్చీసాడరని మాకు

రిపోర్టొచ్చింది! ఊ! కమాన్!" అతను హుంకరించాడు. తలమీంచీ హ్యాట్ తీసి పాచికల్ని అందులో పడేసి పట్టుకున్నాడు.

మొదటి యువకుడు అనుమానిస్తూ పాంటు వెనక జేబులోకి చేతిని పోనిచ్చాడు. తతిమ్మా ముగ్గురూ రాతి బొమ్మల్లా కూచున్నారు. అందరి మొహాల్లోంచీ ఏడుపు తొంగిచూస్తోంది. అతను రెండో యువకుణ్ని బెదిరింపుగా చూశాడు.

"ఏయ్, వాడిజేబులోంచీ డబ్బులు తీయ్!" అన్నాడతను మొదటి యువకుణ్ని చూపిస్తూ.

రెండో యువకుడు అదరాబాదరా మొదటివాడి పాంటుజేబులోకి చేతిని దూర్చాడు. ఇద్దరూ కళ్ళతో మాట్లాడుకోడం అతను గమనించాడు.

"వాడి జేబులు మళ్ళీ నేను వెతుకుతాను. ఒక్క పైసా వుంటే, నిన్ను చెవులుపట్టి లాక్కెళ్ళి కార్లో స్టేషన్‌కి తీసుకెళ్తాను!" అన్నాడు కటువుగా.

రెండో యువకుడు ఆముదం తాగినవాడిలా చూస్తూ చకచకా మొదటి యువకుడి జేబులన్నీ ఖాళీచేసి, మిగిలి పోయిన నోట్లనీ, చిల్లరనీ అతని చేతిలో గిన్నెలా వున్న హ్యాట్‌లో వేశాడు.

"ఇంకేమీ లేదు సాబ్......సంజూ జేబుల్లో...." అన్నాడు వినయంగా.

అతను చిన్నగా నవ్వాడు. "అచ్ఛా, సంజూ, నువ్వు వాడి జేబుల్లోది తీయ్!" అన్నాడు అధికారపూర్వకంగా.

అనవసరంగా, తెలివితక్కువగా తన పేరు చెప్పిన తన మిత్రుణ్ని కొరకొరా చూస్తూ సంజూ అతని జేబు లన్నింటినీ క్షణంలో ఖాళీ చేసి, సివిడీ ఆఫీసరు

హ్యాట్‌లో పోశాడు.

"కేవల్‌చంద్ జేబులు ఖాళీ సాబ్!" అన్నాడు కసిగా.

రెండు నిమిషాల్లో నలుగురు జేబుల్నీ నలుగురిచేతా ఖాళీచేయించాడతను. హ్యాట్‌లో కుప్పగా పడున్న, మాసి నలిగిపోయిన నోట్లనీ చిల్లర డబ్బుల్నీ అతను రెప్పలు వాల్చి క్షణకాలం చూశాడు. మెల్లిగా అతని కళ్ళు వాళ్ళవేపు తిరిగాయి. ముక్కు మొహం తెలీని వ్యక్తితో ఉన్న డబ్బంతా పందెంకాసి, ఒకేసారి ఓడిపోయిన వాళ్ళలా విచారం, నిరాశా రెండూ కలగాపులగంగా వున్న చూపులు చూస్తున్నారు నలుగురూ. మొదటి యువకుడు సంజా నాలుకతో పెదాల్ని తడుపుకున్నాడు. సంజా ఏదో చెప్పబోయేలోగా, గిరుక్కున వెనక్కి తిరిగాడతను.

ఠీవిగా రెండడుగులు వేసి, మెల్లిగా వాళ్ళవేపు తిరిగాడు. తమ అన్న ధర్మరాజుని పాచికల్లో ఓడించి, మొత్తం కాజేసిన శకునిని చూస్తున్న పాండవుల్లోని తతిమ్మా నలుగురు సోదరుల్లా నిస్సహాయంగా తనని చూస్తున్న నలుగుర్నీ అతను తేరిపార చూశాడు. అతని చూపులు మెల్లిగా సంజా మీద కేంద్రీకృతమయ్యాయి.

"అరే భాయ్ సంజా...." అంటూ ఆగాడతను.

సంజా ఆదరాబాదరా అరుగుమీంచీ దిగి, అతనివేపు నడిచి, వినయంగా చూశాడు. "సాబ్...."

అతను మాట్లాడకుండా కోటుజేబులోంచీ వంద రూపాయల నోట్లుతీసి, తనముందు భిక్షాపాత్రలా పట్టుకున్న ఫెల్టుహాట్‌లోకి విడివిడిగా వదిలాడు. తమ అయిదు, రెండు, రూపాయినోట్లనీ, చిల్లర నాణేల్నీ కప్పేసిన

వందరూపాయల నోట్లని సంజా ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతని మిత్రులు ముగ్గురూ నిశ్శబ్దంగా అతని పక్కనే చేరారు. వందరూపాయలనోట్లనీ, టోపీలో వాట్ని పట్టుకున్న ఆఫీసర్నీ నలుగురూ మార్చి మార్చి చూశారు; మ్యాజిక్ చేస్తున్న పి.సి. సర్కార్ జూనియర్ లా అతను ఫెల్టుహ్యాట్ ని వాళ్ళముందుకి జరిపాడు.

"సంజా, మీరు నలుగురూ అమాయకులు. ఒకరి పేరు ఒకరు నేను అడక్కుండానే చెప్పేశారు!"

"అవును సాబ్...." సంజా సన్నటి కంఠంలో అన్నాడు.

"మాసిపోయిన మీ చిల్లర నోట్లనీ, పైనున్న కొత్త పెద్దనోట్లనీ మీకే ఇచ్చేస్తాను....ఒక పనిచేస్తే...." అంటూ ఆగాడతను.

ఎనిమిది కళ్ళు అతని మొహంలోకి నమ్మలేనట్టు చూశాయి. సంజా నాలుకతో పెదవుల్ని తడుపుకున్నాడు. అతని చిన్న కళ్ళు మెల్లిగా పైకిచూశాయి.

"పని..ఏమిటి సాబ్?"

అతను మౌనంగా నలుగుర్నీ కలయజూశాడు. వాళ్ళకి కొంచెం దగ్గరగా జరిగాడు. నలుగురూ అప్రయత్నంగా చెవులు రిక్కించారు.

"ఈ వూళ్ళో పోలీసువాళ్ళని నమ్మడానికి వీల్లేదు.." తగ్గుస్వరంలో అతను ప్రారంభించాడు.

"హాఁ, సాబ్! రాథేశ్యాం మాకు ధోకా.." సంజా ఆవేశంతో అడ్డుతగిలాడు.

"ఉష్! మాట్లాడొద్దు! నేను హోటల్ రామ్ గోపాల్‌లో రెండో నంబరు గదిలో వుంటాను. పది హేను నిమిషాల్లో మీరు నలుగురూ నన్ను అక్కడ

కల్పుకోండి. ఏం చేయాలో చెప్తాను. మీరు ఆ పని చేస్తానంటే, ఈ టోపీలోనిదంతా మీకు అడ్వాన్సుగా ఇచ్చేస్తాను. పనయ్యాక తలా మరో అయిదేసివందలు ఇస్తాను."

"సాబ్.." సంజూ అడ్డుతగిలాడు.

"ఏమిటి?"

"ఎవర్నైనా ఊతకాలా?" సంజూ ప్రశ్నించాడు.

అతను సంజూని చిరునవ్వుతో చూశాడు. "సంజూ, సిఐడీ డిపార్టుమెంట్ ఎవర్నీ ఫుతకదు!"

"మరి...పులీస్‌లోగ్ అందర్నీ తాటవలిచేస్తారే.." సంజూ అనుమానంగా అన్నాడు.

అతను చిన్నగా నవ్వాడు. "మీరు ఎవర్నీ కొట్టనవసరం లేదు. చంపనవసరం లేదు. ఏదీ దోచాల్సిన అవసరంలేదు. మా డిపార్టుమెంట్‌కి సహాయంచేస్తూ, చిన్న అడ్వెంచర్ చేస్తారు. తరవాత మీ సహాయానికి ప్రతిఫలంగా డబ్బుతోపాటు, ఇక్కడ పచ్చీస్ ఆడుకోడానికి పర్మనెంట్ పర్మిట్ రాసిస్తాను!"

సంజూ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతని మిత్రుల చేతులు మూడూ ఒకేసారి అతని రెండు భుజాల మీదా పడ్డాయి. వాళ్ళ నొక్కుల్లో మిత్రులు తనకి అండ దే స్తున్న వా రని సంజూ చిటికెలో గ్రహించాడు.

"అడ్వెంచర్ అయితే చేస్తాం సాబ్!" సంజూ ఉత్సాహంగా అన్నాడు.

"అచ్ఛా...హోటల్ రామ్‌గోపాల్...." అంటూ అతను కదలబోయాడు.

"సాబ్.."

సంజూ కంఠం అతన్ని ఆపింది. అతను ప్రశ్నార్థకంగా

చూశాడు.

"సాబ్..తమ పేరు?" సంజూ నసుగుతూ అడిగాడు.

"సి.ఐ.డి. ఆఫీసర్ గా అక్కడ గది తీసుకోలేదు నేను. 'శివలాల్' పేరుతో తీసుకున్నా!" అన్నాడతను నవ్వుతూ. "మీరక్కడికి రహస్యంగా రావాలి!"

సంజూ అరనిమిషంపాటు బుర్ర ఆడించాడు. "సాబ్, మీరు కార్లో వెళ్ళండి. అడ్డదారిలో పరుగెట్టి, మీకంటే ముందే అక్కడుంటాం!" అన్నాడతను ఉషారుగా నవ్వుతూ.

శివలాల్ నవ్వుతూ వెనక్కి తిరిగాడు.

## 2

గదిలో తన ఎదురుగా నించున్న నలుగుర్నీ అతను చిరునవ్వుతో చూశాడు. ఎప్పుడు, ఎక్కడ దువ్వుకున్నారో తెలీదుగానీ నలుగురి క్రాపులూ పచ్చీస్ ఆడుతున్నప్పట్లా చెల్లాచెదురుగా లేవు. సిగరెట్ వెలిగించి శివలాల్ పచార్లు ప్రారంభించాడు. ఆశ్చర్యంతో, ఒక్కరకభక్తితో అతన్నే చూస్తూ నలుగురూ మౌనంగా నిలబడ్డారు.

ఏదో ఆలోచనలో మునిగిపోయి, గదిలో ఆ నలుగురూ లేనట్టే పచార్లు చేస్తూ వుండిపోయిన శివలాల్ తటాలున ఆగాడు. అతి రహస్యమైన, అతి ప్రమాదమైన కార్యం మీద వెళ్ళడానికి తయారుగా నించున్న సైనికుల్లా తన ముందు కదలకుండా నించున్న నలుగుర్నీ, సూచనలివ్వబోయే మేజర్ లా చూశాడతను.

సంజూ, కేవల్ చంద్, ధనీరాం, బాల్ గోపాల్ లోపల్లోపలే వాళ్ళ పేర్లు తలుచుకుంటూ అతను సిగరెట్ పీకని గదిమూలకి విసిరాడు.

"సంజూ..రాత్రి పదిగంటలకి మీలో ఇద్దరు కటక్ రోడ్డులో ఊరవతల వుండాలి...." అతను ఆగాడు.

"జీ.." సంజూ వినయంగా అన్నాడు.

"నువ్వూ, బాల్‌గోపాల్ మీరిద్దరూ.." అన్నాడతను లావుగా పొడుగ్గా వున్న బాల్‌గోపాల్‌ని చూస్తూ.

"పదిన్నరకి ఒక నల్లకారు మీ దగ్గరగా ఆగుతుంది. వెనకసీట్లో కూచోండి. డ్రైవర్‌తో మీరు మాట్లాడే అవసరం వుండదు. కారు రెండు కిలోమీటర్లు వెళ్ళి ఆగుతుంది. వెనకసీట్లో వున్న టార్చిలైట్లూ, బెత్తాలూ తీసుకోండి. కాసేపట్లో ద్రాక్షబుట్టల లోడ్‌తో ఒక లారీ వస్తుంది. దాన్ని వెళ్ళనివ్వండి. దాని వెనకాలే, రెండు-మూడు వందల గజాల దూరంలో ఒక అంబాసిడర్ — నంబర్ ఎ.ఎమ్.ఎన్. 453 — వస్తుంది. టార్చిలైట్లు వెలిగించి సిగ్నల్ ఇస్తూ రోడ్డుమధ్య నిలబడి, ఆ కార్ని ఆపండి. డ్రైవరు కాకుండా వెనకసీట్లో ఒక ఆసామీ వుంటాడు."

"అతనెవరు?" సంజూ అడ్డుతగిలాడు.

"ఎవరైనా మనకి అనవసరం!" శివలాల్ సంజూని తీక్షణంగా చూస్తూ అన్నాడు. "కార్ని చెక్ చేయాలను. డిక్కీ తెరవాలని చెప్పి, డ్రైవర్ దగ్గర తాళాలు తీసుకో."

"దేనికని అడిగితే?" బాల్‌గోపాల్ అడ్డుతగిలాడు.

"డిక్కీలో బ్లూ ఫిలిమ్ వీడియో క్యాసెట్స్ వున్నట్టు మీకు రిపోర్టు వచ్చిందని చెప్పండి. నెమ్మదిగా మాట్లాడకండి. దబాయించండి. తెలుసుగా?" శివలాల్ ప్రశ్నించాడు.

"పోలీసుల్లాగా కనుక్కుంటాం...అన్నట్టు..సాబ్... ఈ డ్రెస్సులో వెళ్తే ఫర్వాలేదా?" సంజా సందేహం వెలిబుచ్చాడు.

శివలాల్ చిన్నగా నవ్వాడు. "కాన్సెప్ట్లో, ఇందాకా టోపీలో వేసిన పైకం మీద అడ్వాన్స్ ఇస్తాను. ఫుట్ పాత్ మీద పాతిక రూపాయలకి దొరికే స్ట్రెచ్ పాంట్లు గుట్టలు గుట్టలుగా వున్నాయి. కాకీరంగువి కొనుక్కోండి. స్వెట్టర్లు వేసుకోండి; కాకీ చొక్కాలు లేకపోతే!"

"చొక్కాలూ దొరుకుతాయి.." బాల్‌గోపాల్ నవ్వుతూ అన్నాడు.

"తరవాత డిక్కీలోంచీ క్యాసెట్స్ తీసుకోవాలా సాబ్?" సంజా ప్రశ్నించాడు.

శివలాల్ చిన్నగా నవ్వాడు. "డిక్కీలో క్యాసెట్స్ వుండవు. మన కారు డ్రైవరు చప్పుడుకాకుండా అర డజను క్యాసెట్లు డిక్కీ తెరుస్తున్న మీకు అందిస్తాడు. డిక్కీ తెరిచేటప్పుడు కార్లోంచి దిగొద్దని ఇద్దరికీ హుకుమ్ ఇవ్వండి. తరవాత ఆ అరడజన్ క్యాసెట్స్‌నీ కార్లో ఆసామికి చూపించండి. బ్లూ క్యాసెట్స్ యెక్కడ తయారుచేశాడో చెప్పమని దబాయించండి. అతను అదిరి పోతాడు. ఆశ్చర్యపోతాడు. ఇంకా అదరగొట్టండి. పేరూ, ఊరూ, వృత్తి. డ్రైవర్ పేరూ, లైసెన్సూ. 'సి' సర్టిఫికెట్ దగ్గిరా అడగండి!"

"తరవాత?" సంజా ఆశ్చర్యాన్ని దాచుకోలేకుండా వున్నాడు.

"అలాగే ఇరవై నిమిషాలపైగా ఆ కార్ని అక్కడే ఆపి, అతన్ని సతాయిస్తూ వుండిపొండి. క్యాసెట్ల గురించి

తనకేమీ తెలీదని అతను లబోదిబో అంటాడు. బెదిరించే ప్రయత్నం కూడా చేస్తాడు. ఇరవై నిమిషాలు దాటాక, మన డ్రైవర్ హారన్ మోగిస్తాడు. అప్పుడు బేరం చేయండి. మూడొంతులు కారత నే బేరంచేస్తాడు. చేయనివ్వండి. చెరో వెయ్యో, రెండు వేలో లాక్కోండి. క్యాసెట్లు తీసేసుకుంటామనండి. డ్రైవర్ లైసెన్సూ అదీ ఇచ్చేయండి. స్లోగా వెళ్ళిపొమ్మనండి. ఊరు దాటేదాకా అతని కార్ని ఫాలో అవతామనండి. ఈ ఊరు దాటేక భువనేశ్వర్ రోడ్డమ్మట పదికిలోమీటర్లదాకా ఆ కార్ని ఎస్కార్టుచేస్తున్నట్టు ఫాలో అవండి. అర్థమైందా?” శివలాల్ ఆగి ప్రశ్నించాడు.

సంజా బుర్ర ఆడించాడు. “పూర్తిగా అయింది సాబ్..అయితే!! ఒక సందేహం సాబ్...”

“ఏమిటి?” శివలాల్ ప్రశ్నించాడు.

“రెండేసి వేలు తీసుకొమ్మన్నారు. డ్రైవర్నికూడా కలిపి, ఆరు..లేకపోతే పది .తీసుకోవచ్చా? కార్లో వెళ్ళే కామందులు ఎప్పుడు పడితే అప్పుడు చిక్కరు సార్!”

శివలాల్ పకపక నవ్వాడు. “మీరు వసూలుచేసే మొత్తం మీరు నాటకం ఆడే చాకచక్యంమీద ఆధారపడివుంటుంది!”

“బిల్‌కుల్ ఠీక్‌గా నాటకం ఆడతాం సాబ్. ఇద్దరూ కార్లోంచి కిందికి దూకి, కాళ్ళకి బుద్ధి చెప్పే లెవల్ దాకా నాటకం జరిపిస్తాం!” సంజా వుద్రేకంతో అన్నాడు.

“రైట్! అయితే మీ ఇష్టం. అక్కడ నాటకం ఖరాబైతే, ఇరవై నిమిషాలలోగా ఆ కారు వచ్చేస్తే మీకు పైసా ఇవ్వను. పచ్చీసు కేసు బనాయిస్తాను!” శివలాల్ తీక్షణంగా చూస్తూ అన్నాడు.

"అచ్ఛా సాబ్!....సాబ్....." ఈసారి బాల్ గోపాల్ అన్నాడు.

శివలాల్ అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"సాబ్....ఆ బ్లూ క్యాసెట్స్....మాకేనా?" ఆశగా అడిగాడతను.

శివలాల్ మళ్ళీ నవ్వాడు. "మీ కే! అయితే అవి బ్లూ క్యాసెట్లు కావు! మీరు ఎన్నోసార్లు చూసిన నాలుగో క్లాసు హిందీ సినిమాలు!"

బాల్ గోపాల్, సంజా నిరుత్సాహంగా చూశారు. "నాటకం తర్వాత, పదికిలోమీటర్లు వచ్చాక ఏం చేయాలి సాబ్?" సంజా అడిగాడు.

"నేషనల్ హైవేనుండీ కుడివేపుకి చీలిన మరో రోడ్డుమ్మట మా డ్రైవరు మిమ్మల్ని తీసుకొస్తాడు. రండి. అక్కడ మరో చిన్న పని వుంటుంది. అది పూర్తిచేసి, నేనిచ్చే ఫీజు తీసుకుని ఎంచక్కా ఇళ్ళకెళ్ళండి!" శివలాల్ సిగరెట్ ముట్టిస్తూ ముగించాడు.

"సాబ్ ..." సంజా నసిగాడు.

"వాట్?"

"ఫీజుతో బాటు....పర్మనెంట్ పచ్చీస్ పర్మిట్ ఇస్తామన్నారు."

శివలాల్ నవ్వు అతన్ని అడ్డుకుంది. "సంజా, కారతన్నుండీ మీరు వీలైనంత యెక్కువగానే గుంజుకుంటారు. నేనూ ఇస్తాను. అంతా కలిపితే మీకు నలుగురికీ కనీసం అయిదేసి వేలు వస్తాయి. ఆ పైకాన్ని పచ్చీసులో పాడుచేసుకోకుండా ఏదో వ్యాపారం చేసుకోండి!"

నలుగురూ తలలు ఆడించారు. "సాబ్ ఠీక్ గా చెప్పారు!" అంతవరకూ విగ్రహాంలా నిలబడ్డ ధనీరాం

అన్నాడు.

"సాబ్.... నేనూ ధనీరాం కూడా కారు దగ్గరకు వెళ్తాం...." కేవల్ చంద్ ఆశగా అన్నాడు.

"కేవల్ చంద్, మీకు మరో అడ్వెంచర్ ఇస్తాను. వాళ్ళ అడ్వెంచర్ పూర్తయ్యేసరికి, సరిగ్గా మీ అడ్వెంచరూ పూర్తవుతుంది. అందరం పదికిలోమీటర్ల అవతల కల్సుకుందాం...."

"సాబ్....మా అడ్వెంచర్ ఏమిటో చెప్పలేదు...." ధనీరాం అందుకున్నాడు.

శివలాల్ జవాబిచ్చేలోగా సంజా అడ్డుతగిలాడు. "సాబ్, పదికిలోమీటర్లు దాటివచ్చాక మాకు...మాకేం అపాయం జరగదుగా?"

శివలాల్ అతన్ని తదేకంగా చూశాడు. "సంజా, అదృష్టవశాత్తూ మనను మార్చ్పుకుని, పచ్చీసుకేసు బనాయించకుండా మిమ్మల్ని తాత్కాలికంగా సిఐడీ వుద్యోగులుగా చేస్తున్నా. మీకు జరగాల్సిన ప్రమాదం పొద్దుటే తప్పిపోయింది! ధైర్యంగా పనిచేయండి!"

నలుగురూ మొహాలు చూసుకున్నారు. మెల్లిగా వాళ్ళ మొహాలమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. శివలాల్ గోడవారగా వున్న టేబుల్ మీద పెట్టిన తన ఫైలు పాకెట్ని అందుకున్నాడు. అందులోని వందరూపాయల నోట్లలో అయిదింటినితీసి సంజాకి అందించాడు.

సంజా అదరాబాదరా అందుకున్నాడు. ఏం చేయమన్నారన్నట్టు శివలాల్ వైపు చూశాడు.

"మీరిద్దరూ వెళ్ళండి. కాకీగుడ్డలు కొనుక్కోండి. కలిసి వెళ్ళకండి. విడివిడిగా వెళ్ళి, కొనుక్కోండి. గడ్డాలు నున్నగా గీసుకోండి. రాత్రి సరిగ్గా పదిన్నరకి ఊరవతల

టర్నింగ్ దగ్గర వుండండి!"

సలాంచేస్తూ సంజా, బాల్‌గోపాల్ గుమ్మంవైపు తిరిగారు. తలుపు తెరవబోతున్న సంజాని శివలాల్ పిలుపు ఆపింది.

"సంజా!"

సంజా, బాల్‌గోపాల్ — ఇద్దరూ తిరిగిచూశారు. శివలాల్ కళ్ళు సానపెట్టిన వజ్రాల్లా తళుక్కుమన్నాయి. అతను వాళ్ళ దగ్గరగా కదిలాడు. తీక్షణంగా వాళ్ళ కళ్ళల్లోకి చూశాడు.

"సంజా.... ఈ అయిదువందలతో తోక ఝూడించి, ఎక్కడో దాక్కుని పచ్చీసు ఆడుతూ వుండొచ్చని ఆలోచించకండి! చెప్పిన టైమ్‌కి అక్కడ ప్రత్యక్షం కాకుండా వుంటే, రేపట్లోగా మీరు యెక్కడున్నా గాలించి, పధ్నాలుగేళ్ళు లోపల తోయిస్తాను!"

సంజా చిన్నబుచ్చుకుంటూ చూశాడు. "మేం పచ్చీసు ఆటగాళ్ళం సాబ్; పైలా పచ్చీసు జూలాయిలం కాదు!"

శివలాల్ చిన్నగా నవ్వాడు. "అచ్ఛా. మరో సంగతి. ఇప్పటిదాకా జరిగిందీ, రాత్రికి జరగబోయేదీ ఎవరికి తెలిసినా మీకు ప్రమాదమే! నలుగుర్లో యే ఒక్కరు నోరుజారినా నలుగుర్నీ కలిపి సబ్జీ చేయించేస్తాను!"

సంజా మాట్లాడకుండా నవ్వుతూ వెనక్కి తిరిగి, తలుపు తెరిచాడు. వాళ్ళిద్దర్నీ మాయంచేస్తూ తలుపు మూసుకుంది. శివలాల్ తతిమ్మా ఇద్దరివైపూ తిరిగాడు.

"ధనీరాం, కేవల్‌చంద్...... మీరు చేయాల్సిన అద్వెంచరేమిటో చెప్తాను. జాగర్తగా వినండి!" అంటూ శివలాల్ చెప్పడం ప్రారంభించాడు.

# 3

రాత్రి పదిన్నరైంది. ఊరి చివర, లారీ డ్రైవర్ల కోసం ప్రత్యేకంగా వెలసిన సర్దార్జీ హోటల్లోని లైట్లు ఆకలిగొన్న డ్రైవర్లని పిలుస్తున్నట్టున్నాయి. అయిదారు లారీలు రోడ్డు అంచుమీదా, మరికొన్ని హోటల్ ముందున్న ఖాళీ జాగాలో ఆగివున్నాయి.

స్టీరింగ్ వీల్ మీద రెండు మోచేతుల్నీ ఆన్చుకుని అతను తన లారీలో కూచున్నాడు. అతని చూపులు వెదురు బొంగుల్తో, గడ్డితో తయారైన రహదారి భోజనశాల మీదే వున్నాయి. తను ఆ లారీని దాటి వచ్చేశాడు. మరో రెండు మూడు నిమిషాల్లో ఆ లారీ రావాలి. అందులోని వ్యక్తులు — ఇద్దరు డ్రైవర్లు — ఈ పూట ఇక్కడే భోంచేస్తారని అతనికి తెలుసు. మరో వంద కిలోమీటర్లు దాటి వెళ్తేగానీ ఇలాంటి హోటల్ దొరకదు. సాధారణంగా లారీ డ్రైవర్లందరూ ఇలాంటి హోటల్స్‌నే ఇష్టపడతారు. నులకమంచాలు. అప్పటికప్పుడు చికెన్, పావురాయి, కౌజుపిట్ట వగైరాల్ని చంపి, రెడీ చేసి వేడివేడిగా వండి సర్వ్ చేస్తారు. మంచం మీద అలాగే నిద్రపోవచ్చు, కావాలంటే. ఎక్స్‌ట్రా ఛార్జీ లేదు. టౌన్స్‌లో, సిటీస్‌లో ట్రాఫిక్ రోడ్లమీద లారీల్ని ఆపి హోటళ్ళలో తింటూ కూచోడం కుదరదు.

అంచేత ఆ లారీ ఇక్కడికే వస్తుంది. ఇక్కణ్నుంచీ మరో హోటల్ వున్న దూరాన్నీ, ప్రస్తుతం టైమ్నీ, మధ్యాహ్నం వాళ్ళిద్దరూ భోంచేసిన టైమ్నీ ఆధారంగా తీసుకుని వాళ్ళు ఇక్కడ తిండితింటానికి ఆగుతారని నిర్ణయించాడు. తన అంచనా తప్పుకాదు. మధ్యాహ్నం భోంచేస్తూ, రాత్రి భోజనం చేయబోయే ఈ హోటల్

గురించి వాళ్ళిద్దరూ మాట్లాడుకోడం తను స్వయంగా విన్నాడు!

రియర్ వ్యూ మిరర్ తళుక్కుమంది. అది ఆ లారీదే అయ్యుండాలి. అతను ఇంజన్ స్టార్టు చేశాడు. లారీ కొద్దిగా ముందుకి కదిలి, ఆగింది. వెనకనుంచీ లైట్ సిగ్నల్స్. లారీ అతన్ని దాటి మెల్లిగా వెళ్తోంది. అతను లారీని పోనిచ్చాడు. ఆ లారీకీ, తనకీ మధ్య మరో బండి రాకూడదు.

ముందు లారీ ఆగకుండా, హోటల్ ముందున్న లారీల్ని దాటి వెళ్ళిపోతోంది. సాలోచనగా అతను కళ్ళు చిట్లించాడు. హెడ్ లైట్లు కాంతిలో ముందు లారీ నంబరు స్పష్టంగా అవుపిస్తోంది. తనకి కావాల్సిన లారీ అదే. అయితే, ఇక్కడ ఆగకుండా ఎందుకు వెళ్తోంది? తన అంచనా తప్పిందా? ఇక్కడ భోజనం చేసే ఆలోచనని మార్చుకున్నారా, వాళ్ళిద్దరూ? ఆగకుండా వెళ్ళిపోతే, తనేం చెయ్యాలి? ఆ లారీ ఇక్కడ ఖచ్చితంగా ఆగుతుందన్న నమ్మకం మీద ఆధారపడి తను యింతో, ఎన్నో ప్లాన్ చేశాడు. తన అంచనా అడ్డంతిరిగితే ఏం చేయాలి? శరవేగంగా ఆలోచిస్తూ అతను అసంకల్పితంగా బ్రేక్ నొక్కాడు.

ముందు లారీ స్లో అయ్యింది! సగర్వంగా నవ్వుకుంటూ అతను దాని వెనకాలే తన లారీని పోనిచ్చాడు. హోటల్ సరిహద్దుని కొద్దిగా దాటి ఆ లారీ యెందుకు ఆగుతోందో అతనికి చిటికలో అర్థమైంది. తరవాత వచ్చి ఆగే లారీలు దారిని బ్లాక్ చేయకుండా ఆ డ్రైవరు ముందు చూపుతో ముందు ఆగుతున్నాడు!

కొద్దివారకి తిప్పి, ఆగిన లారీకి పది అడుగుల

దూరంలో తన లారీని ఆపాడతను. లోపలి లైటు వేయకుండా, చీకట్లో అలాగే కూచుని స్టీరింగ్ మీదికి వొంగాడు. అతని కళ్ళు రెప్ప వేయకుండా చూస్తున్నాయి.

ముందు ఆగిన లారీ రెండువైపులా డోర్లు తెరుచుకున్నాయి. ఇద్దరు వ్యక్తులు కిందికి దిగారు. డోర్లు చప్పుడు చేస్తూ మూసుకున్నాయి. ఇద్దరూ దగ్గర్లో వున్న హోటల్ వేపు నడుస్తున్నారు. అతను చెవులు రిక్కించాడు. తగ్గుస్వరంలో వాళ్ళు మాట్లాడుతున్న మాటలు అతనికి వినిపించలేదు.

ఇద్దరూ హోటల్ లోపలి భాగంలోకి వెళ్తే, తనకి చాలా సమయం కలిసొస్తుంది. గొడవా తప్పుతుంది! ఆలోచిస్తూ అతను కిందికి దిగాడు. డోర్ని తోసి, ఎడం వైపున్న డోరు దగ్గరగా నడిచాడు. సిగరెట్ ముట్టిస్తూ, లారీకి ఆనుకున్నాడు. రెండు జతల కళ్ళు తనవేపు చీకట్లోంచీ చూస్తూంటాయా? ఆలోచిస్తూ అతను హోటల్ వైపు చూశాడు.

ఇందాకా లారీ దిగిన వ్యక్తులిద్దరూ లోపలికి వెళ్ళలేదు. నులక మంచాన్ని కొంచెం ముందుకి లాగి, తమ లారీ వేపు తిరిగి కూచున్నారు! అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. గొడవ తప్పేలా లేదు! నవ్వుకుంటూ అతను లారీ డోర తెరిచాడు. చీకట్లో అతని చెయ్యి లోపలికి సాగింది. సీటు మూల పెట్టిన చిన్న టేప్ రికార్డర్ని అతను ఇవతలికి తీశాడు. అతని వేలు కదిలింది.

'గుమ్‌నామ్ హైకోయీ...బద్‌నామ్ హైకోయీ...' లతామంగేష్కర్ పాడటం ప్రారంభించింది. టేప్ రికార్డర్ వాల్యూంని కొద్దిగా పెంచి అతను రెప్పవేయ

కుండా హోటల్ వైపే చూడసాగేడు.

చిరునవ్వుతో, చీకట్లో అతని పెదవులు కదిలాయి. హోటల్ పడివేపున చీకట్లో కదులుతున్న నీడలు.... రెండు.. మూడు...లీలగా అతనికి కనిపించాయి. శంకర్ జైకిషన్ సంగీతానికి ప్రాణంపోస్తున్న లతామంగేష్కర్ కంఠాన్ని పూర్తిగా వినలేకపోతున్నందుకు విచారిస్తూ అతను టేప్ రికార్డర్ని ఆఫ్ చేశాడు. మెల్లిగా దాన్ని పాంటుజేబులోకి దోపాడు.

•   •   •

చీకట్లోంచి వాళ్ళు ముగ్గురూ వెలుతుర్లోకి జరిగారు. ఇద్దరు మగాళ్ళు. ఒక యువతి. నులక మంచంమీద యెదురుచూస్తున్న యిద్దరు డ్రైవర్ల దగ్గరగా ముగ్గురూ ఆగారు.

ఒక యువకుడు ధనీరాం, చొరవగా ధైర్యం చెప్తున్నట్టు యువతి చెయ్యి పట్టుకున్నాడు.

“చెల్లాయ్, ఎవడు?” ఇద్దరు డ్రైవర్లనీ చూస్తూ ప్రశ్నించాడతను.

“ఇతనే!” లావుగా, బుర్రమీసాల్తో భీకరంగా డ్రైవర్ని చూపిస్తూ అరిచింది యువతి.

డ్రైవర్లిద్దరూ తలలు తిప్పి ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

ధనీరాం తటాలున ముందుకి వంగాడు. బుర్రమీసా లతని చొక్కా కాలర్ని ఎడంచేత్తో పట్టుకున్నాడు. “బద్మాష్! లసంగే!...”

బిత్తరపోయిన బుర్రమీసా లతను ధనీరాం చేతిపట్టు నుంచీ కాలర్ని విడిపించుకునే ప్రయత్నం చేశాడు.

"ఎవరు మీరు? ఏమిటిది?" అయోమయంగా అడిగాడతను.

"డొక్కు లారీ తోలే పుండాకోర్, ఇంటిముందు నించున్న నా చెల్లెమ్మకి కన్నుగీటి, చేత్తో సైగ చేస్తావ్?" ధనీరాం గర్జించాడు.

బుర్రమీసాలతను ఏదో చెప్పబోయాడు. ధనీరాం పాదం కుండలావున్న అతని బొజ్జమీద విసురుగా తాకింది. మాట్లాడబోయిన డ్రైవర్ 'ఉఫ్' అంటూ చప్పుడు చేశాడు. అప్రయత్నంగా అతను రెండు చేతుల్తో బొజ్జని తడుముకున్నాడు.

హఠాత్తుగా జరిగిన సంఘటనకి అదిరిపోతూ రెండో డ్రైవర్ తన మిత్రుణ్ని ఆదుకోడానికి ప్రయత్నిస్తూ, ముందుకి వంగి ధనీరాం చేతిని పట్టుకోబోయాడు. అయితే కేవల్ చంద్ అతన్ని ఆపేశాడు. రెండు చేతుల్తో అతని జుట్టు పట్టుకుని బలంగా వెనక్కి లాగేడు. డ్రైవర్ విసురుగా వెనక్కి పడ్డాడు. కూడబలుక్కున్నట్టు ధనీరాం, కేవల్ చంద్ బిగ్గరగా అ ర వ డం ప్రారంభించారు. వాళ్ళతో వచ్చిన యువతి ఆపకుండా తిట్టడం ప్రారంభించింది.

హోటల్లో కలకలం బయల్దేరింది. అక్కడా ఇక్కడా మంచాలమీద కూచున్న డ్రైవర్లు ఆదరాబాదరా అక్కడికి చేరుకున్నారు. అప్పటికే ధనీరాం తన డ్రైవర్ని కూడా వెల్లకిలా తోసేశాడు. డ్రైవర్లిద్దరి తలలూ మంచంపట్టీని దాటి కిందికి వేళ్ళాడుతున్నాయి. ధనీరాం, కేవల్ చంద్ ఇద్దరి జుట్లనీ పట్టుకుని కిందికి అదిమిపెట్టారు. అందరూ ఒకేసారి అరుస్తున్నారు. గందరగోళం చూడ్డానికి,

గొడవ ఆపడానికి వచ్చినవాళ్ళు మంచం చుట్టూ గోడలా నిలబడ్డారు.

• • •

అతను చకచకా కదిలాడు. గొడవ ఇంక ఏ రూపం ధరిస్తోందో, ఏమవుతుందో అతనికి అవసరం లేదు! నవ్వుకుంటూ ముందు ఆగిన లారీవేపు దొంగగా నడుచుకెళ్ళాడు. ఒక్క ఉదుటతో డ్రైవర్ సీట్లోకి ఎక్కాడు. సగం కాలిన సిగరెట్ ని మెల్లిగా కిటికీలోంచీ జారవిడిచాడు. క్రితంరోజు తను తెలివిగా ఇగ్నిషన్ కీని కాజేశాక డ్రైవర్ మరో కీ ఏర్పాటు చేసుకున్నాడా? చకచకా ఆలోచిస్తూ అతను చేతుల్తో తడిమాడు. కట్ చేయబడిన వైర్లు అతని చేతికి తగుల్తూ, మరో ఇగ్నిషన్ కీ లేదని అతనికి తెలియజేశాయి. నవ్వుకుంటూ, నిర్భయంగా అతను వైర్ల చివర్లని కనెక్టు చేస్తూ లారీని స్టార్టు చేశాడు. వెనక్కి తిరిగి చూడకుండా నిర్భయంగా లారీని ముందుకి పోనిచ్చాడు. ముప్పై గజాల దూరంలో ఆపాడు. చీకట్లో అతని చేతులు కదిలాయి, క్యాబిన్ లైటు వెలిగింది. అతని కళ్ళు చురుగ్గా అంతా కలయజూశాయి. డాష్‌బోర్డు మీద డ్రైవర్ పడేసిన....టవలూ....సంచీ....సిగరెట్ పాకెట్....వేస్టు, ఊదొత్తుల పాకెట్....అగ్గిపెట్టె.... అన్నీ పడున్న ప్రదేశాల్ని గుర్తుంచుకుంటూ అతను అన్నింటినీ చకచకా తీసుకున్నాడు. డ్రైవర్ సీటు వెనకున్న కంపార్టుమెంట్లోంచీ ట్రిప్‌షీట్, లాగ్, లైసెన్సు వగైరాలున్న రెక్జిన్ కవర్ని తీసుకున్నాడు. బెర్తు కిందికి తొంగి చూశాడు. రెక్జిన్‌తో తయారైన రెండు చేతి సంచీలు....వాట్ని కూడా తీసుకుని అతను లైటు తీసేశాడు. కిందికి ఉరికాడు.

హోటల్ ముందు యుద్ధం తీవ్రస్థాయికి చేరుకున్నట్టుంది. ధనీరాం, కేవల్‌చంద్ యువతి — ముగ్గురి కంఠాలూ తతిమ్మా కంఠాల్ని పూర్తిగా మింగేస్తూ పెడబొబ్బలు పెడ్తున్నాయి! నవ్వుకుంటూ అతను తన లారీలోకి ఎక్కాడు. లైటు వేశాడు. ఖాళీగా వున్న క్యాబిన్ని తృప్తికరంగా చూస్తూ ముందు లారీలోంచీ తెచ్చిన వస్తువుల్ని, దాదాపుగా ఆ లారీలో అవిపడున్న ప్రాంతాల్లా అవుపించే చోట్లలో పడేశాడు. సంచుల్ని వెనకున్న పొడుగాటి సీటుకింద పడేశాడు. ఏర్పాటు చేసిన సెట్టింగుని ఓసారి పరిశీలనగా చూశాడు. వైర్ల కొసల్ని తగిలిస్తూ స్టార్టు చేశాడు. లారీ మెల్లిగా ముందుకి కదిలింది. కిటికీలోంచీ తల ఇవతలకి దూర్చి, రోడ్డుమీద కిందికి చూస్తూ నెమ్మదిగా లారీని పోనిచ్చాడతను. తను పడేసిన సిగరెట్ పీక ఇంకా కాలుతూ ఎర్రగా తనకి సిగ్నల్ ఇస్తోంది! అతను సగర్వంగా నవ్వుకున్నాడు. సిగరెట్ పీక ఆరిపోయేలోగా తను లారీల్ని స్థానాలు మార్చాలనుకున్నాడు; మార్చేశాడు!

సిగరెట్ పీక కిటికీ సరిహద్దుకి వచ్చేదాకా పోనిచ్చి, అతను లారీని ఆపేశాడు. ఇంజన్ని ఆఫ్ చేసి, క్షణంలో కిందికి దిగాడు. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. ధనీరాం, కేవల్‌చంద్ నాటకాన్ని రసపట్టులోకి దించేట్టున్నారు. ఇద్దరి మాటలూ ఇప్పుడు బూతులుగా మారుతున్నాయి.

జేబులోంచీ టేప్‌రికార్డర్ తీశాడతను. క్షణంలో లతామంగేష్కర్ ఇందాకా ఆపేసిన గుమ్‌నామ్ పాట ప్రారంభించింది. వాల్యూంని పూర్తిగా పెంచుతూ, అతను సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ గొడవ

జరుగుతున్నవేపు ఒకసారి చూసి దూరంలో, చీకట్లో ఆపిన లారీవైపు అడుగులు వేయసాగేడు.

తన లారీ, వాళ్ళ లారీలా అవుపించడానికి అవసరమైన జాగ్రత్తలన్నీ తను తీసుకున్నాడు. నంబరు ప్లేటు మార్చాడు. అసలు లారీ స్టీరింగ్ వీల్ కి చుట్టింటే, అదే డిజైన్ లో, కలర్ ప్లాస్టిక్ వైర్ చుట్టించాడు. క్యాబిన్ ముందు భాగంలో, వెనకా డ్రైవరు భక్తితో, రక్తితో అతికించుకున్న గోల్డెన్ టెంపుల్, పూరీ జగన్నాథ్ టెంపుల్ గోపురం, అజ్మీర్ దర్గా స్టిక్కర్లనీ, మందాకిని ఫోటోనీ అతికించాడు; కష్టపడి సంపాయించి డ్రైవర్ సీటు—వీపు ఆనుకునే భాగంలో అరచేతి వెడల్పులో, స్పాంజి లాగేశాడు; రెక్జిన్ని చీల్చి. గేర్ రాడ్ కి ట్రాన్స్పరెంట్ రెడ్ కలర్ నాబ్ ఫిక్స్ చేశాడు. మనిషి పెద్దపెద్ద మార్పుల్ని వెంటనే గుర్తించడు. చాలా చిన్నచిన్న మార్పుల్ని స్పర్శతో, ఒక్క చూపుతో చిటికలో పసిగట్టేసాడు — చూడకుండా తన గొడుగు బదులుగా పొరపాటున మరో గొడుగు తీసుకుని వెళ్ళిపోతున్న వ్యక్తి అరచేతి ఫీలింగ్ తో అది తన గొడుగు కాదని పోల్చుకున్నట్టు!

రెండూ సరికొత్త అశోక్ లేలండ్ లారీలే. రెండింటి రంగూ ఒకటే. పికప్ కూడా సహజంగా ఒక్కటిగానే వుండాలి! ఎంతో ఆలోచించి, తను ప్లాన్ చేశాడు. ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నాడు. అయినా డ్రైవరు తను తోలుతోంది తన లారీ కాదని, కాసేపు తర్వాత పోల్చుకోవచ్చు. లోపల్లోపల అతను అలా ఫీలయ్యే అవకాశం వుంటుంది. అయితే, ఆ 'రిఫ్లెక్స్'కి కొంత టైం పడుతుంది. ఆ వ్యవధిని పొడిగించడానికి తను ఏర్పాటు చేసిన ఫైటింగ్

సహాయపడుతుంది! ఈ రాత్రికి వంతు ప్రకారం లారీని డ్రైవ్ చేసే వ్యక్తి అరచేతులు కొద్దిగా, కొద్దిగా నే—వాచేలా ధనీరాం ఏర్పాటు చేసాడు! యుద్ధం పూర్తయ్యాక, అవమానంతో, కోపంతో, డ్రైవర్ అన్యమనస్కంగా వుంటాడు. చేసిన పొరపాటేమిటో అర్థంకాక అనుకున్న విధంగా తిండి తినలేక, తనదికాని, ఊళ్ళో ఎదిరించలేక ఓడిపోయి, కల ఖరాబు అయిపోయిన డ్రైవర్, ఆలస్యం చేయడానికి యేమాత్రం వీలులేని పరిస్థితిలో, ఆదరాబాదరా లారీ ఎక్కి, తిట్టుకుంటూ, జరిగిందాన్ని గురించి సహచరుడితో అపకుండా చర్చిస్తూ కనీసం కొన్ని పదుల కిలోమీటర్ల దూరం ఆవేశంతో లారీని తోలుకుపోతాడు. ఆ పరిస్థితిలో వున్న ఆ డ్రైవర్ మానసికస్థితిమీద తను తన ప్లానంతటినీ బేస్ చేశాడు!

తను ఆ స్థితిలో వుంటే, ఎలా ప్రవర్తించగలడో ఆ డ్రైవరూ అలాగే సహజంగా ప్రవర్తిస్తాడు, ఎక్కువసేపు కాకపోయినా! అయినా తనకి ఆట్టే సమయం అవసరం లేదు కూడా. పైగా వెనక ఎస్కార్టుగా వచ్చే కారు, లారీని ఆగనివ్వదు. ముందు నిర్ణయించుకున్న టైమ్ టేబుల్ ప్రకారం, ఖచ్చితంగా ఆ లారీ ఉరకలెత్తాల్సిందే! ఖచ్చితంగా, నిర్ణయించిన కాలానికి గమ్యస్థానం చేరుకోవాల్సిందే! అది కూడా తన ప్లాన్‌కి బ్రహ్మాండంగా సహకరిస్తుంది.

టేప్ రికార్డర్ని ఆఫ్ చేసి, అతను దూరంలో ఆగిన తనదికాని లారీలోకి ఎక్కాడు. స్టీరింగ్ ముందు కూచున్నాడు. వైర్లని తాకించాడు. స్టార్టు చేశాడు. లారీని పోనిచ్చాడు. కాస్సేపట్లో లారీ మలుపు తిరిగింది. యాంత్రికంగా అతను వేగం పెంచాడు. ఆశ్చర్యంతో అతను

నవ్వుకున్నాడు. ఇప్పుడు తన చేతుల్లో పరుగెడుతున్న లారీ, మూడు రోజులుగా తను తోలుతున్న లారీలాగే వుంది! అప్రయత్నంగా అతను ఈలవేశాడు. ఒక అర గంటపాటు ఆ డ్రైవరు కూడా తనలాగే అనుకుంటే చాలు! తను అనుకున్నది జరిగాక, అతను అసలు విషయం, లారీల మార్పిడి గురించి పసిగట్టి, బొబ్బలెట్టినా మరేం ఫర్వాలేదు!

నవ్వుకుంటూ అతను లారీని మలుపు తిప్పాడు. కుడి చేత్తో జేబులోంచి టేప్‌రికార్డర్ని లాగాడు. బటన్ని నొక్కి, కొద్దిగా రివైండ్ చేశాడు. ఆపాడు. ప్లే బటన్ నొక్కాడు. లతామంగేష్కర్ నూతనోత్సాహంతో ప్రారంభించింది; గుమ్‌నామ్ హైకోయీ....

## 4

మలుపు తిప్పబోతూ అతను లారీని స్లో చేశాడు. ఎర్రగా తయారైన అతని కళ్ళు మూతలు పడకుండా రోడ్డుని తీక్షణంగా చూస్తున్నాయి.

"గంటపైగా ఆలస్యం అయింది. స్పీడుగా పోనీ. చెప్పిన టైమ్‌కి అక్కడికి చేరుకోకపోతే బాస్ మండి పడతాడు!" పక్కనే కూచున్న రెండో డ్రైవర్ కర్తార్ అన్నాడు.

దుర్గాదాస్ వేళ్ళు స్టీరింగ్ చుట్టూ బిగుసుకునే ప్రయత్నం చేశాయి. అతను తన సహచరుడివేపు చూడ లేదు. అప్రయత్నంగా పళ్ళు కొరుక్కున్నాడు.

"లంజాకొడుకులు! దాని మాటలు నమ్మి గొడవకి దిగారు....ఆలస్యమవుతుందని అనుమానించాను. లేక పోతే, ముగ్గుర్నీ తాటవొలిచేద్దును!"

"దుర్గా.. కన్ను గీటావా?" కర్తార్ అడిగాడు.

దుర్గాదాస్ తటాలున తలతిప్పి కర్తార్‌ని ఎర్రగా చూశాడు.

"నోర్ముయ్! ఆ గాడిదల బదులు ఇప్పుడు నిన్ను పుతికేస్తాను!" దుర్గాదాస్ గర్జించాడు. ఈసారి స్లో చేయకుండా లారీని మలుపు తిప్పాడు. లారీ రోడ్డు అంచుదాకా వెళ్ళి ఊగిపోతూ తిరిగింది. అప్రయత్నంగా దుర్గాదాస్ వేళ్ళని స్టీరింగ్ చుట్టూ బిగించాడు. పళ్ళు బిగబట్టి లారీని రెడీ చేశాడు.

"అబ్బ! వేళ్ళు వాచిపోయాయి ..."

"నాకూ కూడా .... ఆ సన్నాసులు పోలీసుల్లాగా వేళ్ళ మీదా, కణుపులమీదా ఆదేపనిగా వాయించారు!" కర్తార్ అరచేతుల్ని మెల్లగా రుద్దుకుంటూ అన్నాడు.

తటాలున లారీ ఆగింది.

"క్యాహువా?" కర్తార్ అరిచాడు.

దుర్గాదాస్ మాట్లాడకుండా లోపలిలైటు వేశాడు. అతని కళ్ళు స్టీరింగ్‌నీ, గేర్ రాడ్‌నీ, బోనెట్‌నీ, తరవాత క్యాబిన్‌నీ అనుమానంగా చూశాయి.

"అరే .... క్యా ...." కర్తార్ ప్రారంభించాడు.

దుర్గాదాస్ ఎర్రటి కళ్ళు అతనివైపు తిరిగాయి. అయితే ఆ కళ్ళల్లో కోపంలేదు. ఏదో అనుమానం....

"కర్తార్ .... గాడీ మనది కాదేమో అనిపించింది, చేతులకి ...కొత్త బండిలోని కొత్త పార్ట్సుని ముట్టు కున్నట్టనిపిస్తోంది ఎందుకో ...."

కర్తార్ కళ్ళు క్యాబిన్‌లో అటూ, ఇటూ పరుగులు తీశాయి. చిన్నగా నవ్వాడతను. "బండి పాతదే. మనదే. చేతులే. నీవి కావు!"

"క్యా ...."

"షేపుమారిపోయి, అరచేతులూ, వేళ్ళూ కొత్తగా తయారయ్యాయిగా! మునుపట్లా స్టీరింగుని పట్టుకో లేవుగా!" కర్తార్ నవ్వుతూ వివరించాడు.

దుర్గాదాస్ మాట్లాడకుండా అరచేతుల్ని పరిశీలనగా చూసుకున్నాడు. కొద్దిగా వాచాయి. కర్తార్ వైపు చూస్తూ కింది పెదవిని కొరుక్కున్నాడు. అనుమానంతో అతన్ని కళ్ళు చిన్నగా అయ్యాయి.

"చేతులు కొద్దిగా మొద్దుబారాయి; నిజమే. అయినా బండి కదలికలో యేదో కొత్తదనం తెలుస్తోంది.... కర్తార్ టార్చిలైటుందికో...." అంటూ అతను డోర్ తెరిచాడు. కర్తార్ అందించిన టార్చి పట్టుకుని కిందికి దిగాడు. లారీ ముందుకి నడిచాడు. లారీ పైభాగాన్నీ, ముందు భాగాన్నీ టార్చి కాంతిలో పరీక్షగా చూశాడు. వై భవానీ ట్రాన్స్‌పోర్టు ...అదే....పాలోచనగా దుర్గాదాస్ టార్చి ఫోకస్ చేస్తూ, చూస్తూ లారీని ఒకసారి ప్రదక్షిణం చేశాడు.

"దుర్గాభాయ్....పదిలిట్లూ, నాలుగు తన్నులూ తినే సరికి నీకు కొద్దిగా బుర్ర తిరిగినట్టుంది! కమాన్ వెళ్దాం!" కిటికీ దగ్గరగా ఆగిన దుర్గాదాస్‌తో నవ్వుతూ అన్నాడు కర్తార్.

దుర్గాదాస్ మాట్లాడకుండా డోర్ పక్కనే రాసి వున్న లారీ వోనర్ షిప్ వివరాలూ, ఛాసిస్ నంబరూ వగైరాల్ని పరిశీలిస్తూ వుండిపోయాడు. నిట్టూరుస్తూ మెల్లిగా కదిలాడు. స్టీరింగ్ ముందు కూచుని కొలిమి తిత్తిలా బుసకొట్టాడు. టార్చిని కర్తార్ వైపు చాచాడు. వెనక్కి వాలి మెల్లిగా సిగరెట్ వెలిగించాడు.

"అరే భలో! కాన్సెప్ట్లో కారు వచ్చేస్తుంది!" కర్తార్ హెచ్చరించాడు.

"అంతా అదే....అయినా ఏదో కొత్తగా అనిపిస్తోంది...." చెదిరిన మీసాల్ని సర్దుకుంటూ మెల్లిగా గొణిగాడు దుర్గాదాస్.

"అరే....భలోయార్! దెబ్బలూ తిట్లూ తిన్నప్పుడు మనిషికి లోకం పూర్తిగా కొత్తగా కనిపిస్తుంది!" కర్తార్ తొందరపెట్టాడు.

దుర్గాదాస్ నిట్టూర్చి, లారీని పోనిచ్చాడు.

• • •

చెట్ల చాటున చీకట్లో—రోడ్డుకి దూరంగా—ఆగిన లారీని ఆనుకుని అతను సిగరెట్ పీలుస్తూ వుండిపోయాడు. కొన్ని నిమిషాల్లో కారు రావాలి....అంతా సక్రమంగా జరిగివుంటే! అంతా సక్రమంగానే జరిగివుంటుందని అతనికి తెలుసు. అన్ని కోణాల్నుంచీ క్షుణ్ణంగా పరిశీలించి వేసిన ప్లాన్ సాధారణంగా బెడిసికొట్టదు. నవ్వుకుంటూ అతను రేడియం డయల్ వాచీ చూసుకున్నాడు. లారీ ఈపాటికి అక్కణ్నుంచీ కదిలివుండాలి. అంత గభసా జరిగాక డ్రైవరిద్దరూ భోంచేస్తూ కూచోలేరు. ధనీరాం, కేవల్‌చంద్ తిట్లతో వాళ్ళ కడుపులు ఎప్పుడో నిండిపోయి వుంటాయి!

చెట్ల కొమ్మలమీద నాట్యంచేసిన వెలుతురు అతన్ని నిటారుగా నిలబెట్టింది. సిగరెట్ పీకని కిందపడేసి అతను టార్చిలైటు తీశాడు. కారు వస్తున్న శబ్దం ఆ నిశ్శబ్ద వాతావరణంలో అతనివైపు దూసుకొస్తోంది. కొంచెం దూరం నడిచి అతను టార్చిలైట్ సిగ్నల్స్ ఇవ్వడం ప్రారంభించాడు....

ఆగిన కార్లోంచి నలుగురూ కిందికి దిగారు. అతను వాళ్ళని చిరునవ్వుతూ చూశాడు. స్టీరింగ్ ముందు కూచున్న వ్యక్తి కిందికి దిగలేదు.

"నమస్తే సాబ్!" సంజా ఉత్సాహంగా అన్నాడు.

"సంజా....అంతా అనుకున్నట్టు జరిగిందిగా?" అతను, శివలాల్ ప్రశ్నించాడు.

"పూర్తిగా సాబ్. అయితే తొమ్మిదికల్లే ఇచ్చాడు సాబ్...." సంజా చిన్నగా నవ్వాడు. "ఫోరకరం దాకా ఆ కార్ని ఫాలో చేశాం. దార్లో, హోటల్ దగ్గర మీరు చెప్పినట్టు కొద్దిగా స్లో చేసి, ధనీరాంనీ, కేవల్ చంద్‌నీ ఎక్కించుకున్నాం...."

"రైట్! ధనీరాం, అక్కడేం జరిగింది?"

"అచ్ఛా సాబ్! నోరెత్తడానికి వీల్లేకుండా లిట్ల కష్టం కలిగించాం. నాలుగు తగిలించాం. మీరు చెప్పినట్టు ఇద్దరి వెళ్ళు కొద్దిగా నలగ్గొట్టాం!" ధనీరాం నవ్వాడు. "తరవాత గుమ్‌నామ్‌పాట విన్నాం. ఆ తరవాత పది నిమిషాలకి నాటకం ముగించాం!"

"రైట్....అదిగో ఆ లారీలో ద్రాక్షపళ్ళ బుట్ట లున్నాయ్. వాటిని కిందికి దించండి!" శివలాల్ ఉత్తరువిచ్చాడు.

"దేనికి సాబ్?" సంజా అడిగాడు.

"ప్రశ్నలు అడక్కండి. పైసలు అడగండి, కావాలంటే...." శివలాల్ నవ్వుతూ అన్నాడు.

"అచ్ఛా సాబ్!"

"ఆ బుట్టల్ని వొకసారి నేను చెకప్ చేస్తాను. తరవాత లారీని, బుట్టల్ని ఇక్కడే వదిలేస్తాం. బుట్టల్ని లోడ్ చేయండి, తరవాత మా డిపార్టుమెంట్ లారీని

స్వాధీనం చేసుకుంటుంది!"

"అలాగే సార్!" సంజా ఉషారుగా అన్నాడు.

• • •

అతని పెదాలమధ్య ఇరుక్కున్న సిగరెట్ పొగని చిమ్ముతోంది. అతని చేతులు స్టీరింగ్ మీద చాకచక్యంగా కదులుతున్నాయి, వజ్రాల్లా మెరుస్తున్న అతని కళ్ళు హెడ్ లైట్స్ చిమ్ముతున్న వెలుగుమీదే వున్నాయి. హెడ్ లైట్ల కాంతి తారు రోడ్డుమీద పరుచుకున్న కారుచీకటిని వెనక్కి తోస్తోంది. కారు ఎనభై కిలో మీటర్ల వేగంతో దూసుకుపోతోంది.

"డార్లింగ్ ...."

వెనక సీటుమీంచి వచ్చిన పిలుపు అతని ఏకాగ్రతకి భంగం కలిగించింది. మాట్లాడకుండా అతను పెదాల మధ్యనుంచీ సిగరెట్ నితీసి, కిటికీగుండా రోడ్డుమీదికి వొదిలాడు.

వెనకనుంచీ రెండు చేతులు అతని భుజాలమీద వాలాయి.

"డార్లింగ్ ....

"ఊఁ ...."

"ఏమిటిదంతా?"

"ఏమిటి?" అతను ఎదురు ప్రశ్న వేశాడు.

"సూటూబూటూ హ్యాటూ తగిలించావు. కారు డ్రైవర్లా నటించుకున్నావు. వాళ్ళ వెకళ్ళనో అక్కడికీ ఇక్కడికీ కార్లో తిప్పి, తిప్పి అలసిపోయాను! అదంతా ఎందుకు?...."

అతని నవ్వు ఆమెకి అడ్డుకగిలింది. "అలసిపోయావుగా; హాయిగా నిద్రపో!"

"నిద్ర...కస్తేగా, పోడానికి?" ఆమె సన్నగా నవ్వింది.

"ఆల్‌రైట్! ఫ్లాస్క్‌లో వేడివేడి మసాలా టీ వుంది. తాగి, కాని నిద్రను రాలేనంత దూరంగా తరిమేయ్. కాస్సేపట్లో కథ చెప్తాను!" అన్నాడతను, ఇప్పుడు తన మెడమీద నిమురుతున్న ఆమె వేళ్ళని ప్రేమగా రాస్తూ.

ఆమె చేతులు దూరంగా జరిగాయి. ఉక్రోషం నటిస్తూ ఆమె రువ్విన నిట్టూర్పు అతనికి నవ్వు తెప్పించింది. తను ఇప్పుడప్పుడే రిలాక్స్ అవలేదు. ఇంకా 'యాక్సిడెంట్ ప్రోన్' ఏరియాలోనే వున్నాడతను! ఎన్నో వాహనాల్ని కడచిపోయిన నాలుగు గంటలుగా తను ఓవర్ టేక్ చేశాడు. కానీ తను దాటాల్సిన, అధిగమించాల్సిన వాహనాలు రెండు ఇంకా తనకి అవుపించలేదు....

ఆలోచిస్తూ అతను సిగరెట్ వెలిగించాడు. గమ్యస్థానాన్ని బట్టీ ఆ రెండింటికీ మరో దారిలేదు. ఈ నేషనల్ హైవేనుంచీ మరో రోడ్డుకి తిరగడానికి లేదు. ఎంత తిరిగినా మళ్ళీ హైవేకి చేరాల్సిందే....తనకన్నా మూడు గంటల ముందు ఆ రెండూ ఆ ప్రాంతాన్ని దాటి వుంటాయి. మూడుగంటల ముందు వెళ్ళిన లోడెడ్ లారీని కార్లో అందుకోడానికి మరీ అన్నిగంటల వ్యవధి అవసరంలేదు. తను వేగం తగ్గించకుండా వస్తున్నాడు....

అప్రయత్నంగా అతను కార్ని స్లో చేశాడు. హెడ్ లైట్లు కాంతిలో ఆ కారు స్పష్టంగా అవుపిస్తోంది. ఎ. యమ్. యన్. 4508....చిరునవ్వు అతని పెదాల్ని కొద్దిగా విడదీసింది. కారు వేగం కొద్దిగా పెరిగింది. లైట్ సిగ్నల్స్ ఇస్తూ అతను కార్ని పోనిచ్చాడు. కాస్సేపట్లో

ముందు వెళ్తున్న కార్ని దాటేశాడు. ఎస్కార్ట్‌ని తను దాటేశాడు. కాసేపట్లో అసలు లారీని దాటేస్తాడు!

కాసేపట్లో చేతులారా ఆడ్రైవర్‌కి తను సప్లయి చేసిన తన లారీని సమీపిస్తూ, అతను కార్ని స్లో చేశాడు. కొద్దిగా తలవాల్చి ఎడంవైపు కిటికీగుండా చూస్తూ వుండిపోయాడు. బుర్రమీసాల డ్రైవర్ మొహం లారీ కిటికీగుండా, కారుకిటికీగుండా అవుపిస్తోంది. బుర్రమీసా అతను చాలా సీరియస్‌గా లారీని తోలుకుపోతున్నాడు....

కారు ముందుకు దూసుకెళ్ళింది. కాసేపట్లో మలుపు తిరిగింది. అయిదు నిమిషాలపాటు అతను ఏకాగ్రతతో కార్ని వేగంగా పోనిస్తూ వుండిపోయాడు.

మెల్లిగా, విశ్రాంతిగా వెనక్కి వాలాడు. వెనక సీట్లోంచీ ఏ చప్పుడూ వినపడ్డంలేదు. కానీ, ఆమె నిద్ర పోడంలేదని అతనికి తెలుసు. కోపాన్నీ, నిద్రనూ ఆమె నటిస్తూంది....

"హనీ. ముందు సీటు మీదికి గెంతు. నాపక్కనే కూచో. కార్ని తోలుతూ నీచెవిలో కథ చెప్తాను!" అన్నాడు శివరామ్.

# 5

గుండ్రటి, బట్టతల పెద్దనుదురు. వెడల్పాటి మొహం. బాగా బలిసిన గొంగళిపురుగుల్లాంటి కనుబొమలు. వాటి కింద లోకాన్ని నిర్లక్ష్యంగా, అసహ్యించుకుంటూ చూసే గర్వం నిండిన కళ్ళు. ఆబోతు అర్రులాంటి మెడ. ఖరీదైన డార్క్‌సూట్‌తో దాగిన పీపాలాంటి భారీ శరీరం. కరోనా సిగార్ని వెడల్పాటి, నల్లటి పెదవుల మధ్య అసహనంగా దూర్చాడు లాలా.

నీడలా అతని దగ్గరగా నిలబడ్డ ఓంకార్ అదరా

లాదరా లైటర్ వెలిగించి, మంటని సిగార్ ముందుకు జరిపాడు. లాలా దవడలు ఉద్రేకంతో కదిలాయి. లైటర్ మంట ఎర్రగా ప్రతిఫలిస్తున్న అతని వడగళ్ళ—కళ్ళల్లోకి ఓంకార్ భయపడుతూ చూశాడు. అప్రయత్నంగా అతని శరీరం ఒకసారి జలదరించింది.

అయిదు నిమిషాల క్రితం తనని గదిలోకి పిలిపించుకున్న లాలా పనేమిటో చెప్పకుండా, విగ్రహంలా నించున్నాడు. అతనిలోపల ఏదో అగ్నిపర్వతం బద్దలవడానికి సిద్ధపడుతోందని ఓంకార్ కి అనిపిస్తోంది. తను గదిలోకి వచ్చేటప్పటికి లాలా బోనులో ఇరుక్కున్న మృగరాజులా గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. మామూలుగా కళ్ళమీదికి వాలే అతని విసనకర్ర కనురెప్పలు, ఏవో తాళ్ళులాగి పట్టినట్టు కిందికి వాలకుండా అలాగేవున్నాయి. రెప్పల్ని కళ్ళమీదికి వాల్చకుండా అట్టేసేపు వుంచడం సాధ్యంకాదు. అయితే, లాలాలో సంకులసమరం సాగే సందర్భాల్లో నిమిషాల తరబడీ రెప్పలు కదలకుండా వుండటం తను చాలాసార్లు చూశాడు....

లాలా తటాలున కదిలాడు. చీకటి వ్యాపిస్తున్న గదిలో గున్నఏనుగులా అతను అడుగులేశాడు. కిటికీ ముందు ఆగిన అతని వెడల్పాటి శరీరం నీడలా అవుపిస్తోంది. యజమాని మౌనం, ప్రవర్తనా ఓంకార్ ని ఆందోళనతో నింపుతోంది. తను ఏదేనా పొరపాటు చేశాడా?

లాలా గిరుక్కున వెనక్కి తిరిగాడు. అతని పళ్ళ మధ్య ఇరుక్కున చుట్ట ఎర్రగా వెలిగింది. ఎర్రటి కాంతి క్షణకాలం అతని కళ్ళకి రక్తం పూసింది. నిప్పుకణాల్లా అవుపించిన అతని గుడ్లగూబ కళ్ళలోకి ఓంకార్ మళ్ళీ కంగారుగా చూశాడు. కిటికీముందు భూతంలా నిలబడ్డ

లాలా కరోనా సిగార్‌ని ఇవతలకి తీశాడు.

"ఓంకార్ ...." అతని కంఠం గదిలో ఉరుములా ధ్వనించింది. అతని కంఠంలోని అధికారం, ఆగ్రహం ఓంకార్ని గొలుసుల్లా పట్టి లాగాయి. ఓంకార్ భయ భక్తుల్తో కదిలి, అతనికి కొద్దిదూరంలో ఆగాడు.

"మాలిక్ ...." అన్నాడతను వినయంగా.

"ఓంకార్ ....ఇందాకా గోడౌన్‌నుంచీ చింతూరాం రిపోర్టు చేశాడు...." లాలా ఆగి, ఎద్దులా బుసకొట్టాడు.

ఓంకార్ మాట్లాడకుండా బుర్రని ఆడించాడు. లాలా మొహం మధ్యలో కరోనా మళ్ళీ ఎర్రగా వెలిగింది.

"ఓంకార్ ...." లాలా కంఠం గంభీరంగా ధ్వనించింది. "ద్రాక్ష బుట్టలో ద్రాక్ష మాత్రమే వుంది...."

ఓంకార్ అదిరిపడ్డాడు. తటాలున అతని చేతిలోని లైటర్ కిందపడి చప్పుడు చేసింది. ఓంకార్ లైటర్ని అందుకునే ప్రయత్నం చేయలేదు. వళంతప్పి వణకడం ప్రారంభించిన తన చేత్తో లైటర్ని పట్టుకోడం సాధ్యం కాదని అతనికి తెలుసు.

"మాలిక్!" వణికే కంఠంతో తన ఆశ్చర్యాన్ని అరుపుగా మార్చాడతను.

లాలా పళ్ళు ఒకదానొన్నటి రాసుకుంటూ కర్కశంగా చప్పుడు చేశాయి.

"ఓంకార్ ....ఏం జరిగింది?" లాలా కంఠం ఖంగుమంది.

"తెలీదు ...."

"ఏం జరిగిందో తెలీకపోతే, ఏం జరుగుతుందో తెలుసుగా?" లాలా ప్రశ్న ఓంకార్ని కొరడాలా తాకింది.

"తెలుసు......మాలిక్.......మ న వా ళ్ళు సరిగ్గా చూశారా?"

"సరిగ్గా చూసేదీ, సరిగ్గా చేసేదీ రాని చవటలు 'మనవాళ్ళు' గా వుండరు ఓంకార్!"

ఓంకార్ అవునన్నట్టు బుర్ర ఆడించాడు. "స్వయంగా నేను దగ్గరుండి లోడ్ చేయించాను. లోడింగ్ జరిగే ప్పుడూ, పూర్తయ్యాకా, లారీ కదిలేదాకా కదలకుండా కన్నార్పకుండా అక్కడే వున్నాను. ఆ తరవాత ఇక్కడికి దూసుకొచ్చి, ఇక్కడ 'వాళ్ళని' కల్సు కున్నాను...."

"నువ్వు చేసిన రొటీన్ పని గురించి నిన్ను అడగ లేదు!" లాలా గర్జన ఓంకార్ నోటిని అట్లకాడలా తాకింది.

గుటకలు మింగి, ఓంకార్ మెల్లిగా ప్రారంభించాడు. "తరవాత మీరే స్వయంగా లోడ్‌ని తెంబడించారు...."

"నాన్సెన్స్!" లాలా హుంకరించాడు." నేను చేసిన పని గురించి నిన్ను అడగలేదు!"

ఓంకార్ అక్షణాల్లో క్షేమకరంగా అ వు టిం చే మౌనాన్ని ఆశ్రయించాడు. గుడ్లు మిటకరిస్తూ లాలాని చూస్తూ వుండిపోయాడు. లాలా గొరిల్లాలా కదిలాడు. దగ్గరగా ఆగి తొరివిలా వున్న కరోనా సిగార్‌తో ఓంకార్ ముందున్న గాలిని పొడిచాడు.

"ఓంకార్, లారీని నేను కార్లో ఫాలో చేశాను. అయినా సరుకు మాయమైంది...." లాలా సాలోచనగా ఆగాడు. "ఓంకార్ నా కార్ని నువ్వు రెడీ చేయించావ్. డిక్కీలో ఏమేం పెట్టించావ్?"

ఓంకార్ ఆశ్చర్యంగా చూశాడు. "మీ దుస్తులూ,

అవీ వున్న సూట్ కేస్ ...."

"ఓంకార్, అబద్ధాల్ని లాలా సహించదు!" లాలా గంభీరంగా అన్నాడు.

"బాస్ ....అనుకున్నది సాధించలేని వ్యక్తి, అనుకున్నవి పొందలేని వ్యక్తి అబద్ధాల్లాడతాడు. మీ దగ్గర నాకు అన్నీ దొరుకుతున్నాయి. నేను—మీతో—కలలో కూడా అబద్ధాలాడను!" ఓంకార్ ఉద్రేకంతో అన్నాడు.

లాలా బుర్ర ముందుకీ వెనక్కీ వూగింది. "డిక్కీలో ఆ వీడియో క్యాసెట్స్ ఎవరు పెట్టారు, ఓంకార్?"

ఓంకార్ ఉలిక్కి పడ్డాడు. అంటే, డిక్కీలో క్యాసెట్సున్నాయన్న మాట.

"మీరు....ఎప్పుడు చూశారు?"

లాలా పెదాలమధ్య చుట్ట ఎర్రగా, రెండు కళ్ళ కింద వున్న అతని మూడో కన్నులా వికృతంగా వెలిగింది. "నేను చూడలేదు ఓంకార్....కటక్ రోడ్‌లో ఖాకీ వెధవలు చూశారు!"

ఓంకార్ ఉలిక్కిపడ్డాడు. "మాలిక్!"

"నీ మాలిక్‌ని బెదిరించారు. నా కారు డిక్కీలో బ్లూ ఫిల్మ్ క్యాసెట్సున్నట్టు రిపోర్టు అందిందన్నారు. డిక్కీ తెరిచారు. కాసెట్స్ చూపించారు. ఎప్పుడూ, ఎవ్వరికీ భయపడని, తలవంచని నీ మాలిక్ వాళ్ళకి లొంగిపోయాడు. పదివేలూ, క్యాసెట్లూ పారేసి తప్పించుకు వచ్చాడు!" లాలా కంఠం కసితో పదునెక్కింది.

"గుడ్ గాడ్! బాస్ ....అయామ్ సారీ...." ఓంకార్ నొచ్చుకుంటూ అన్నాడు. చుట్ట మంటలో ఎర్రగా అవుపిస్తున్న లాలా కళ్ళల్లోకి అతను ఈసారి ధైర్యంగా

చూశాడు. "బాస్....ఆ పోలీసులు....పోలీసులేనా?"

లాలా తటాలున వేళ్ళమధ్యనుంచీ చుట్టని ఇవతలికి లాగాడు.

"పోలీసులే అనుకున్నాను...." అంటూ సాలోచనగా ఆగాడతను.

"ఓంకార్ మాట్లాడకుండా అతన్ని ఆలోచించుకోనిచ్చాడు. లాలా మెల్లిగా, గుండ్రంగా తిరుగుతున్న పీపాలా వెనక్కి తిరిగాడు. గున్న ఏనుగులా కిటికీ ముందుకి నడిచాడు. దూరంలో వెలుగుతున్న లైట్ల గుంపుని తదేకంగా చూస్తూ వుండిపోయాడు.

"ఓంకార్....కాస్సేపు వాళ్ళ 'దొంగ పోలీసులు' అనుకుని ఆలోచిద్దాం......" వెనక్కి తిరక్కుండా అన్నాడు. ఓంకార్, అడుగుల చప్పుడు కాకుండా అతని దగ్గరగా కదిలాడు.

"బాస్, చెప్పండి. వాళ్ళేం చేశారు?" తన ప్రశ్న నీళ్ళతో నిండిన బకెట్ని నూతిలోంచీ ఇవతలికి లాగే తాడులా బాస్నుండీ విషయాన్ని లాగుతుందని అతనికి తెలుసు....

"కార్ని ఆపాడు. కిందికి దిగవద్దని హెచ్చరించారు. భోలాని దబాయించి, తాళాలగుత్తి లాక్కున్నారు. లైసెన్స్ తీసుకున్నారు. ఒకడు వెళ్ళి డిక్కీ తెరిచాడు. వాళ్ళ కారు డ్రైవరూ కిందికి దిగాడు. కాస్సేపట్లో ఆరు క్యాసెట్స్ పట్టుకుని వాడు నా దగ్గరగా వచ్చాడు...."

"మన కారు డిక్కీలోంచీ తీసుకురాడం మీరు చూడలేదు...." ఓంకార్ చేంతాడుని కొద్దిగా లాగాడు.

"డిక్కీ తెరిచాడు. క్యాసెట్స్ తెచ్చాడు. నేను ఆశ్చర్యంలో మునిగిపోయాను. అలాంటి అవాంతరాలకి

నేను సిద్ధంగా లేను. మాట్లాడే అవకాశం, ఆలోచించే వ్యవధి ఇవ్వకుండా వాడు బెదిరింపుగా, ఎగతాళిగా నవ్వుతూ ఏదేదో అంటూ వుండిపోయాడు. వాళ్ళ పీడ వదిలించుకుని లారీని అందుకోవాలన్న ఆతృత తప్ప మరో ఆలోచన అప్పట్లో నాలో లేదు..." లాలా ఆగాడు.

"సహజంగా ఎవరికేనా అంతే, బాస్..."

"వాళ్ళతో గొడవ పెట్టుకుని, వాళ్ళతో పాటు స్టేషన్కి, తరవాత వార్తల్లోకి ఎక్కే అవకాశం నాకు లేదు. ఆ సాహసం నేను చెయ్యలేను! ఎందుకో నీకు తెలుసు!" లాలా సాజాయిషీ ఇస్తున్నట్టు అన్నాడు.

"ఓంకార్ వాళ్ళు 'దొంగ పోలీసులు' అని అనుకున్నాక, నాలో అనుమానాలు పుట్టుకొస్తున్నాయి..." లాలా సాలోచనగా అన్నాడు.

"బాస్?"

"కార్ని ఆపాక అవసరమైందానికన్నా ఎక్కువసేపు వాళ్ళు నాతో సరసాలాడుతూ వుండిపోయారా, అని పిస్తోందిప్పుడు. తెలివిగా మాట్లాడి, లంచం ఇచ్చేలా నా నోటితో చెప్పించారు. నోట్లకట్టలు అందుకున్నాక అనవసరంగా నాతో బెదిరింపుగా మాట్లాడుతూ వుండి పోయారు. 'మామూలు' చేతిలో పడ్డాక, ఇచ్చిన బలి పశువుని అట్టే పెట్టుకుని సాధారణంగా ఎవరూ కబుర్లు చెప్పరు. ఆదరాబాదరా తోలేసి, మరో గిరాకీకోసం ఎదురుచూస్తారు. అవునా?"

"యస్.... బాస్...." ఓంకార్ దరువేశాడు.

"అయితే అవసరాన్ని మించి వాళ్ళు నన్ను ఆపారు. అవసరం లేకపోయినా మనకార్ని ఎస్కార్టు చేస్తామంటూ, టౌన్ లిమిట్స్ దాటాక కూడా చాలాదూరం

వెంబడించారు. ఎందుకు?" లాలా ప్రశ్నించాడు.

"బాస్ మీరు వర్ణిస్తుంటే జరిగిందంతా యేదో ప్లాన్ ప్రకారం జరిగిందనిపిస్తోంది. వాళ్ళు టైమ్ చూసుకున్నారా?" ఓంకార్ జవాబుగా ప్రశ్నించాడు.

"....లేదనుకుంటాను....లేదు.." లాలా సాలోచనగా అన్నాడు. గిరుక్కున అతను వెనక్కి తిరిగాడు. ఓంకార్ అప్రయత్నంగా ఒకడుగు వెనక్కి వేశాడు. లాలా గద్ద గూబలా తన మొహంలోకి చూస్తున్నాడని అతనికి తెలుసు.

"ఓంకార్....వాళ్ళు టైం చూసుకోలేదు. నాతో మాటలో కబడీ ఆడుతూ వుండిపోయారు. అయితే.... అయితే....మన కార్ని పోనిమ్మని చెప్పేముందు వాళ్ళ కారు హారన్ ఒకసారి మోగిందనుకుంటాను... యస్! వాళ్ళ కారు హారన్ ఒకేసారి మోగింది!"

లాలా కంఠంలో ఏదో ఉద్రేకం పలికింది.

"బాస్....అంటే...."

"అంటే, ముందుగా అనుకున్న ప్రకారం, నిర్ణయించుకున్న సమయం పాటు వాళ్ళు నా కార్ని ఆపి వుంచారు!"

"ఎందుకు?" ఓంకార్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎందుకో నాకు తెలీదు....అయితే, నిష్కారణంగా ఎవరూ, ఎవర్నీ నడిరోడ్డుమీద అలా ఆపివుంచరు!"

"బాస్....కారణం వుందిగా! మీ దగ్గర పదివేలు గుంజుకున్నారు."

"గుంజుకున్న వెంటనే మన కార్ని వొదిలేసి వాళ్ళెందుకు ఉడాయించలేదు?" లాలా గంభీరంగా ప్రశ్నించాడు.

ఓంకార్ అసంకల్పితంగా బుర్ర గోక్కున్నాడు.

"ఓంకార్, ప్రయత్నించి వాళ్ళెవరో నన్ను..... ముందు వెళుతున్న లారీకి మార్గంగా వుంచారా?" లాలా ప్రశ్న ఓంకార్ని అదిరిపడేలా చేసింది.

"బాస్...." ఓంకార్ కంఠం కొద్దిగా వణికింది.

"దేనికి?"

"ఎందుకో ద్రాక్షమాత్రమే వున్న ద్రాక్ష బుట్టలు నీకు చెప్తున్నాయ్, ఓంకార్!" లాలా గంభీరంగా అన్నాడు.

"అంటే, ముందు వెళుతున్న లారీని ఎస్కార్ట్ మీరు చేస్తున్నారని వాళ్ళకి తెలిసి వుండాలి. లారీలో వున్న దేమిటో వాళ్ళకి తెలిసివుండాలి. మీరు.. మీరు.... ఎవరో వాళ్ళకి తెలిసి వుండాలి.." ఓంకార్ నోటితో ఆలోచించుకు పోతున్నాడు.

"నేనెవరో తెలీకపోయినా, లారీలో యేముందో వాళ్ళకి తెలుసు. లారీని నేనెందుకు ఫాలో అవుతున్నానో వాళ్ళకి తెలుసు. 'వాళ్ళు' ఎవరో కనీసం వాళ్ళతో సంబంధం వున్న 'వాళ్ళు ఎవరో నాకు తెలుసు ఓంకార్!" లాలా కంఠం ఉద్రేకంతో ప్రతిధ్వనించింది.

"బాస్! ఎవరు వాళ్ళు?" ఓంకార్ ఆశ్చర్యంతో అరిచాడు.

లాలా గిరుక్కున వెనక్కి తిరిగాడు. కిటికీ వెలుగులో మసకగా అవుపిస్తున్న ఓంకార్ మొహంలోకి తదేకంగా చూశాడు.

"నువ్వు సెలెక్టు చేసి, సిఫార్సు చేసిన డ్రైవర్లు; దుర్గాదాస్, కర్తార్!"

లాలా కంఠంలో ప్రతిధ్వనించిన ఆగ్రహం, ఎగతాళీ ఓంకార్ని ఉలిక్కిపడేలా చేశాయి. అతను వెనక్కి జరిగి కంగారుగా చూశాడు.

"బాస్...."

"ఓంకార్, దుర్గాదాస్, కర్తార్ ఇద్దరూ నా ముందు ప్రత్యక్షం కావాలి!" లాలా కంఠంలో నిర్ణయం ఢంకాలా మోగింది.

"బాస్.... వాళ్ళు.... వాళ్ళకి వాళ్ళు..." ఓంకార్ నత్తి నత్తిగా ఏదో చెప్పబోయాడు.

"నా ముందు ప్రత్యక్షం కావాలి!" లాలా గంభీరంగా అన్నాడు.

ఓంకార్ క్షణకాలం తటపటాయించి, వణుకుతూ కదిలాడు. గది మధ్యలో ఆగి, మెల్లిగా వెనక్కి తిరిగాడు.

"బాస్.... లైటు వేయనా?" వినయంగా అడిగా డతను.

"వద్దు. ఆలోచించడానికి చీకటి బావుంటుంది. బైట చీకటిగా వుంటే, లోపల వెలుతురు వెయ్యింతలవుతుంది!" లాలా గంభీరంగా అన్నాడు.

# 6

ఈపస్డ్ ఛర్చీలో అతను ఠీవిగా కూచున్నాడు. అతని మొహం కందగడ్డలా వుంది. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. అతని దగ్గరగా నుంచున్న ఓంకార్ని దుర్గా దాస్, కర్తార్ అమోఘయంగా చూశారు. ఇందాకా ఓంకార్ అడిగిన ప్రశ్న ఇద్దరి తలల్లో చప్పుడు చేస్తూ తిరుగుతుంది.

"నో! మాకేం తెలీదు. మీరు అక్కడ అప్పగించిన

గాడీని, ఇక్కడికి చేర్చాం. ఏ సమయానికి ఏ ఊరు క్రాస్ చేయాలని మీరు ఉత్తరువిచ్చారో ఆదే సమయానికి అదేపూట్లు క్రాస్ చేశాం! టైమ్ టేబుల్ ప్రకారం ప్రయాణం సాగించాం....అంతే మాకు తెలుసు!" దుర్గాదాస్ ఉద్రేకంతో అన్నాడు.

"అదంతా మాకు తెలుసు; దుర్గాదాస్! ద్రాక్షా, ద్రాక్షాబుట్టలూ అవే అనీ తెలుసు. అయితే, ద్రాక్షగుత్తుల కిందున్న 'అసలు సరుకు' ఏమైందో మాకు తెలుసు!" ఓంకార్ ఇద్దరి మొహాల్లోకీ తీక్షణంగా చూశాడు.

దుర్గాదాస్ అర్థంకానట్టు చూశాడు. "అసలుసరుకా? అదేమిటి? అసలు సరుకు ద్రాక్షే!"

ఓంకార్ క్షణకాలం దుర్గాదాస్ మొహంలోకి చూసి, చూపుల్ని కుర్చీలో కూచున్న లాలావైపు తిప్పాడు. లాలా కళ్ళని చదివి, అరక్షణంలో తన చూపుల్ని మళ్ళా దుర్గాదాస్ వైపు తిప్పాడు.

"దుర్గాదాస్, అసలు సరుకు ద్రాక్షే అంటూ అమాయకత్వం నటించొద్దు! మేం స్వయంగా నీకు చెప్పకపోయినా ద్రాక్షగుత్తుల కింద ఏమిటి దాచబడిందో మా ఇద్దరికీ తెలుసు! స్వచ్ఛందంగా మేం చెప్పనందువల్ల మీకు నాటకం ఆడే అవకాశం లభించింది. 'మీరు ద్రాక్షలోడ్ ఇచ్చారు; ఇదిగో మీ ద్రాక్షలోడ్!' అని మాకు నిర్భయంగా చెప్పే అవకాశం నీకు చిక్కింది...."

దుర్గాదాస్ అయోమయంగా చూశాడు. "ఓంకార్ సాబ్, మీ మాటలు అర్థంకావడం లేదు!"

లాలా తటాలున కుర్చీలోంచి లేచాడు. ఏదో అడగబోతున్న ఓంకార్ భుజమ్మీద చేతివివేసి మెరటుగా

దూరంగా తోశాడు. ఓంకార్ అదుర్దాగా అతనివైపు చూశాడు. లాలా అతనివైపు చూడ్డం లేదు. లాలా చూపులు దుర్గాదాస్‌మీదే నాటుకుపోయి వున్నాయి. అతని పెదవులు కదిలాయి.

"ఓంకార్, ఈ నమ్మకద్రోహుల్ని నేను ప్రశ్నిస్తాను...." అన్నాడతను ఓంకార్ వైపు చూడకుండానే.

"బద్మాష్! అక్కడ నీకు అప్పగించిన లారీని ఎక్కడ, ఎవరికి ఎంతకి అమ్మేశావ్?" లాలా కంఠం పిస్టల్ షాట్లా ధ్వనించింది.

దుర్గాదాస్ అయోమయంగా, అదుర్దాగా చూశాడు. "మాలిక్....లారీ....అదే...."

"అయితే, మోరే లారీ సప్లయిర్స్ అంబా దగ్గర తీసుకున్న మరో అశోక్ లేలాండ్‌ని ఏంచేశావ్?" లాలా గర్జించాడు.

"మాలిక్....!" దుర్గాదాస్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. అతనితోపాటు ఆశ్చర్యంలో మునిగిపోయిన ఓంకారు తటాలున లాలావైపు చూశాడు.

"బాస్...."

"ఓంకార్. ఈ హీరోల్ని నిద్రలేపి తీసుకురావడానికి నువ్వు వెళ్ళాక లారీవాలా అంబాకి లైట్నింగ్ కాల్ బుక్ చేశాను. నా అనుమానం నిజమే అయింది. బట్టల్ని మార్చడానికి వీరికి వ్యవధి చాలదు. ఒకసారి అన్‌లోడింగ్ మరోసారి లోడింగ్ సమయం వీరికి లేదు. అంచేత లారీనే మార్చివుంటే....అని ఆలోచించాను. మన లోడింగ్ జరుగుతున్న సమయంలో, నాలుగో తేదీ సాయంత్రం నాలుగున్నరకి వీడు, తన పేరుమీదే మనం

తీసుకున్నలాంటి కొత్త అశోక్ లేలాండ్ నే బుక్ చేశాడు!" లాలా దుర్గాదాస్ వైపే తీక్షణంగా చూస్తూ ఓంకార్‌తో అన్నాడు.

ఓంకార్ చప్పుడు చేస్తూ ఊపిరి బిగబట్టాడు. "మై గాడ్! దుర్గాదాస్ ...."

"షటప్!" లాలా గర్జించాడు.

"దుర్గా, రుద్రసింహాన్ని జాలుపట్టించావ్! లారీ నంబరూ అదీ మార్చేసి, అసలు లారీని ఎవరికో అప్పగించి, నకిలీలారీని ఏమీ ఎరగని వాడిలా ఇక్కడికి తెచ్చావ్! ఏం చేశావో చెప్పు. నీ ప్రాణాలు కాసుక్కో!"

దుర్గాదాస్ వణికిపోతూ చూశాడు. మా.... మాలిక్ .... నేను.... లంబాగాడు.... అబద్ధా లాడుతున్నాడు! నన్ను నమ్మండి! కావాలంటే కర్తార్‌ని...." వెనక్కి తిరిగిన లాలాను చూస్తూ దుర్గాదాస్ ఆపేశాడు.

లాలా కుషన్డ్ కుర్చీలో కూచున్నాడు. ఓంకార్ పక్కకి తిరిగి లాలావైపు ఆదోలా చూశాడు. లాలా మొహం విచిత్రంగా శాంతిమయంగా అవుపిస్తోంది. శాంతిమయంగా కూచుని, వోపిగ్గా, వ్యక్తిగతమైన కక్ష ఏమాత్రం లేకుండా ముద్దాయికి మరణశిక్ష విధించే జడ్జిలా వున్నాడు లాలా.

"దుర్గా, దురాశ నీ చేత దుర్మార్గం చేయించింది. నేను ఏదైనా ఒకసారే అడుగుతాను; ఒకసారే చెప్తాను. అమూల్యమైన ఆ అవకాశాన్ని నువ్వు జారవిడుచుకున్నావ్...." లాలా యేమాత్రం ఆవేశం, యేమాత్రం ఆగ్రహం ధ్వనించని కంఠంతో సాదాగా అన్నాడు.

అతని శాంతం ఓంకార్ని గడగడలాడించింది. అతను కంగారుగా దుర్గాదాస్ వైపు చూశాడు. 'వెంటనే

మా కాళ్ళమీద కూచుని, దోసిలిచాపి, అంతా వొప్పేసుకో. అంతా చెప్పేసుకో!' అంటున్నాయి అతనికళ్ళు. అయితే అతని నేత్రావధానం దుర్గాదాస్ కి అర్థంకాలేదు.

"బాస్ ....నిజంగా.... నేను....ఏతప్పూ చేయలేదు.... నేను...." దుర్గాదాస్ మళ్ళా పాట ప్రారంభించాడు.

"దుర్గా, నువ్వే ప్రాంతంలో లారీని మార్చేశావో నాకు తెలుసు!" లాలా నవ్వుతూ అన్నాడు.

"బాస్ ....ప్లీస్...."

"కటక్ కీ, భువనేశ్వర్ కీ మధ్య నువ్వు నాటకం జరిపించావ్. కిరాయి బద్మాష్ లకి నాకారుగురించి చెప్పావు. నువ్వు లారీలు మార్చే సమయంలో నన్ను ఆ ఊరికి అవతలివైపున ఆపించావు!"

దుర్గాదాస్ కంగారుగా చూశాడు. మొహాన్ని కమ్ముతున్న చెమటల్ని రెండుచేతుల్తో తుడుచుకున్నాడు. వణుకుతున్న అతని చేతుల్ని లాలా తృప్తికరంగా గమనించాడు.

"మీమాటలు వింటూంటే నాకు మతిపోతోంది.... బాస్....అక్కడ లారీ మారిందేమో అన్న అనుమానం నాకూ వచ్చింది. హోటల్ నుంచీ బయల్దేరాక లారీ కదలికలో యేదో మార్పు లీలగా అవుపించింది...."

"అవును, బాస్....దుర్గాదాస్ లారీ ఆపి పరీక్షించి చూశాడు కూడా!" కర్తార్ మొదటిసారిగా నోరు తెరిచాడు.

లాలా పెదవులు వంకరగా కదిలి అతని చిరునవ్వుని వ్యక్తం చేశాయి. "పిల్లికి ఎలక సాక్ష్యం చెప్తోంది! బద్మాష్, నీకు వాటా ఎంతిస్తానన్నాడు వాడు?"

కర్తార్ తన చెవుల్ని నమ్మలేనట్టు చూశాడు. ఆరి

పోతున్న పెదవుల్ని నాలుకతో తడువుకున్నాడు.

"ఓంకార్, నువ్వు ప్రత్యేకంగా సెలెక్టుచేసిన వాళ్ళందరూ నువ్వు చెప్పినట్టు తెలివైనవాళ్ళే. అందుకు సందేహంలేదు! అయితే నువ్వు చెప్పినట్టు నమ్మకస్థులు కారు!" లాలా నవ్వుతూ అన్నాడు.

"బాస్ ...."

"యస్, ఓంకార్! చాలా తెలివైనవాళ్ళు. ముఖ్యంగా దుర్గాదాస్. తను మార్చేసిన లారీలో యేదో మార్పుని తేలిగ్గా గుర్తించాడు! తను ఆడే అబద్ధాల్లో, అపాయకరం కాని నిజాన్ని డంగరించి తనలో లేని నిజాన్ని నిరూపించుకోడానికి అతి తెలివిగా ప్రయత్నిస్తున్నాడు!" లాలా మళ్ళీ నవ్వాడు.

ఓంకార్ అతన్ని ఆందోళనతో చూశాడు. యజమాని నవ్వు అతనిలోని కంగారుని కలియదిప్పుతోంది.

"దుర్గాదాస్," లాలా కంఠం గదిలో వాళ్ళ మధ్య గింగిరాలు తిరిగింది. "నా గౌరవానికే, శక్తిసామర్థ్యాలకీ సంబంధించిన అడ్వెంచర్‌కి నువ్వు అడ్డుతగిలావు. అయినా, లారీని యెవరికి అప్పగించావో చెప్తే, క్షమించి తక్కువశిక్షతో వదిలేస్తాను...."

"మాలిక్... నిజంగా....నిజంగా నాకేం తెలీదు. అందులో ద్రాక్ష కాకుండా మరేదో వుందని నాకు తెలిసి వుంటే, అసలు అంత ధైర్యంగా ఇక్కడిదాకా వచ్చేవాణ్ని కానేమో....నన్ను నమ్మండి!" దుర్గాదాస్ ఆవేశంతో అన్నాడు.

లాలా నిట్టూర్చాడు. తటాలున పైకి లేచాడు. కోటు జేబులోంచి కరోనా సిగార్ తీశాడు. పళ్ళమధ్య ఇరికించాడు. అప్పటికే ఓంకార్ వెలిగించిన లైటర్ మంట,

చుట్టుకొసని తాకింది. అంతసేపూ లాలా కళ్ళు దుర్గాదాస్ మీదే వున్నాయి. రుబ్బుగోలులా వున్న అతని తల ఒకసారి కొద్దిగా పైకి కదిలింది.

మరుక్షణం ఇద్దరు వ్యక్తులు వెనకనుంచీ దుర్గాదాస్ చేతుల్నీ, కర్తార్ చేతుల్నీ రెప్పపాటులో వెనక్కి విరిచి, బేడీలు తగిలించారు. బందీలిద్దరూ కంగారుగా చూశారు, యేం జరుగుతోందో ఊహించేలోపలే బేడీలు తగిలించిన వ్యక్తి దుర్గాదాస్ జుట్టుని బలంగా రెండు చేతుల్తో పట్టుకుని కొద్దిగా వెనక్కి వంచాడు. అసంకల్పితంగా దుర్గాదాస్ గింజుకున్నాడు.

"బాస్ .... నన్ను ...."

బాస్‌కీ తనకీ మధ్య ప్రత్యక్షమైన బోడిగుండు వ్యక్తిని దుర్గాదాస్ అర్థంకానట్టు చూస్తూ, ఆపేశాడు. కర్తార్‌కి బేడీలు తగిలించి, దుర్గాదాస్ ముందు నిలబడ్డ బోడిగుండు వ్యక్తి చిన్నగా నవ్వాడు. నల్లగా మెరుస్తున్న అతని పళ్ళని దుర్గాదాస్ కంగారుగా చూశాడు. పొగ్గుతో తోముకుంటూ, ఇంకా నీళ్ళతో శుభ్రం చేయని వ్యక్తి పళ్ళలా వున్నాయవి. నల్లటి, సన్నటి శరీరం. సన్నటి నడుం. ఎర్రరంగు పాంటుని అతని నడుముకి టైట్‌గా బిగించిన సన్నటి తోలుబెల్టు. అతని చేతులు మెల్లగా పైకిలేచాయి. ఇనప కడ్డీల్లా మెరుస్తున్న అతని పొడుగాటి చేతుల్ని దుర్గాదాస్ భయం భయంగా చూశాడు. పగిలిపోయేలా బిగుసుకుంటున్న చర్మం కింద నరాలు రాగి కమ్మీల్లా కదిలాయి.

అతని రెండు చేతూలూ తటాలున, పాముపడగల్లా కదిలాయి. మెలితిరిగిన దుర్గాదాస్ బుర్రమీసాల్ని రెండు కటింగ్ ప్లయర్లలా పట్టుకున్నాయి. దుర్గాదాస్ తల

వెనక్కి లాగబడింది. బుర్రమీసాలు ఒక్కసారిగా ముందుకి లాగబడ్డాయి. దుర్గాదాస్ భయంకరంగా అరిచాడు.

రెండు నిమిషాలపాటు దుర్గాదాస్ సైరన్‌లా అరుస్తూనే వుండిపోయాడు. బోడిగుండతని చేతులు దూరంగా జరిగాయి. ఉన్నట్టుండి అతని అరుపు మూలుగులా మారింది. రెండు చేతుల వేళ్ళమధ్యా ఇరుక్కున్న వెంట్రుకల్ని బోడుగుండు వ్యక్తి అసంతృప్తితో చూశాడు. అతను నల్లటిపళ్ళు చూపిస్తూ. ఇంకా మిగిలివున్న దుర్గాదాస్ బుర్రమీసాల్ని గమ్మత్తుగా చూశాడు. వేళ్ళని వదులుచేశాడు. మళ్లా అతని చేతులు దుర్గాదాస్ మీసాల వైపు కదలబోయాయి. మనిషి చేతిలో కర్రని చూడగానే కుయ్యో అంటూ అరుపు ప్రారంభించే పిరికి కుక్కలా దుర్గాదాస్ మూలుగు ప్రారంభించాడు.

"భోలా!" లాలా కంఠం గంటలా ధ్వనించింది.

భోలా తలతిప్పి వినయంగా చూశాడు.

"వాడు బడితెదెబ్బతిన్న పందిలా గొంతు చించుకుంటూ వుంటే వినే ఓపిక నాకు లేదు. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. నీకు అయిదునిమిషాలు టైమిస్తున్నా. వాణ్ని, వాణ్ని కింది గదిలోకి తీసుకెళ్ళు. దుర్గాగాణ్ని టేబుల్‌కి తాపడం చెయ్. కర్తార్‌గాణ్ని ఫాన్‌కి వేళ్లాడదీయ్. వాడు చూస్తూ వుంటాడు. ఒకప్పుడు అమెరికన్లు రెడ్ ఇండియన్స్‌ని బతికున్నట్టే పూర్తి చర్మం వొలిచేవారు. ఆ టెక్నిక్ ఉపయోగించు. దుర్గాగాడి చర్మం పూర్తిగా, మళ్ళీ చెప్తున్నా పూర్తిగా వొలిచేయ్!" లాలా కంఠం రాక్షస నగారాలా మోగింది.

భోలా తలతిప్పి దుర్గాదాస్ వైపు చిరునవ్వుతో

చూశాడు. "పూర్తిగా వొలిచే అవసరం వుండదు బాస్. బొడ్డుదగ్గర ప్రారంభించి జానెడు కిందికీ, జానెడు పైకీ వొలిచేసరికి మన దుర్గాభాయ్‌ని దుర్గామాత పూనుతుంది. అతనిద్వారా ఆమే అంతా చెప్పేస్తుంది!" నవ్వుతూ అన్నాడతను.

"వద్దు!" దుర్గాదాస్ అరిచాడు. "బాస్! నిజంగా ఏం జరిగిందో నాకు "

"షేక్ దెమ్ అవే!" లాలా హుంకరించాడు. భోలా చెయ్యి పాంటుజేబులోకి మారింది. అతని చేతిలో ప్రత్యక్షమైన సర్జికల్ నైఫ్‌ని దుర్గాదాస్ భయాందోళనలతో చూశాడు. భోలా యెడమ చెయ్యి అతని భుజమ్మీద పడింది. విసురుగా గుమ్మంవైపు తిప్పుతూ అతని చెవి మీద కత్తిని నిర్లక్ష్యంగా ఆన్చాడతను. దుర్గాదాస్ జుట్టు పట్టుకున్న వ్యక్తి, వదిలేసి కర్తార్ వైపు కదిలాడు. అతని వేళ్ళమధ్య ప్రత్యక్షమైన మంగలి కత్తి కర్తార్ చెవిమీద ఆనింది. ఇద్దర్నీ గుమ్మంవేపు తోశాడు.

ఓంకార్, భయం, ఆశ్చర్యం నిండిన కళ్ళతో లాలా వైపు చూశాడు. "బాస్.." ప్రాధేయపూర్వకంగా పిలిచాడతను.

మరేదో చెప్పబోతున్న అతన్ని, ఉన్నట్టుండి మోగిన టెలిఫోన్ అటకాయించింది. ఆదరాబాదరా నడిచి, తను రిసీవర్ని లాగి చెవికి ఆనించాడు.

"యస్.."

"..........."

"మీరెవరు?" ఓంకార్ కొద్దిగా ఆశ్చర్యపోతూ ప్రశ్నించాడు.

"..........."

ఓంకార్ కళ్ళు పెద్దగా విచ్చుకున్నాయి. కోపంగా ఏదో చెప్పబోయిన అతని చెవిలో అటువైపు కంఠం మళ్ళీ ప్రతిధ్వనించింది. చిటికెలో అతని కోపం కంగారుగా మారింది. మౌత్ పీస్ మీద అరచేతిని మూస్తూ అతను లాలావైపు ఆత్రుతగా చూశాడు.

“మీ కోసం....”

“ఎవరు?” లాలా విసుగ్గా గద్దించాడు.

“చెప్పడంలేదు. మీ చేతికి ఫోన్ ఇవ్వకపోతే, తరవాత మీ చేతిలో నన్ను....” వాక్యం పూర్తి చేయకుండా ఆపేశాడు ఓంకార్. రిసీవర్ని ఛాతీమీద తుడిచి అతనికి అందించాడు వినయంగా. లాలా రిసీవర్ని అందుకోలేదు.

“బాస్....మాట్లాడండి....ఎవరో, ఏదో తెలిసిన వ్యక్తిలా మాట్లాడుతున్నాడు. అతని కంఠం..”

అతను విసుగ్గా రిసీవర్ని లాక్కున్నాడు.

“హూ యీజ్ దట్?” రిసీవర్లోకి మొరిగాడు.

## 7

టెలిఫోన్ రిసీవర్ని పట్టుకుని అతను విశ్రాంతిగా సోఫా వెనక్కి వాలాడు.

“అయామ్ శివరాం.”

“హూ ది హెల్ ఆర్ యూ?” అతని కంఠం శివరాం చెవిలో పోట్లగిత్త రంకెలా గింగుర్లు తిరిగింది. శివరాం చిన్నగా నవ్వాడు. ఎంత పెద్ద పోట్లగిత్త అయినా బుల్ ఫైటర్ చేతిలో సఫా అయిపోవాల్సిందే!

“నీవన్నట్టు నాకు రెండో పేరు లేదు; నీలాగా నేను రెండోసారి జన్మించలేదు! అంచేత అయాం శివరాం అండ్ అయాం శివరాం.”

"వాన్ సెన్స్!" లాలా కంఠం ఉరిమింది. "హూ."

"నన్ అదర్ దేన్ శివరాం!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఆల్ రైట్! వాడ్డూయూ వాంట్?" అతను గర్జించాడు.

శివరాం పకపక నవ్వాడు. "నాకేం కావాలో వెంటనే చెప్తే నువ్వు గుండె ఆగి పంచభూతాల్లో కలిసి పోతావ్ జగ్గా!"

లాలా ఒకసారి ఊపిరి బిగబట్టడం శివరాంకి స్పష్టంగా వినిపించింది. మరుక్షణంలో పూర్తిగా మాడ్యులేషన్ మార్చిన లాలా కంఠం అతి మర్యాదగా అతని చెవిలో సరసాల లెవల్లో ప్రతిధ్వనించింది.

"తమరెవరో నాకు తెలీదు....ఎవరికో రింగ్ చేయబోయి నా నంబరు."

"నీకోసం ఎవరి నంబరో కాకుండా, ఐమీన్... మరెవరికోసమో నీ నంబరు కాకుండా, నీకోసమే నీ నంబరే డయల్ చేశాను; జగ్గాలా!" శివరాం ఎగతాళిగా అన్నాడు. "అది నిరూపించుకోడానికి మరో క్లూ ఇస్తాను; ఈపాటికి నీ లారీ డ్రైవర్లని గానుగ ఆడేపని ప్రారంభించి వుంటావు. దాన్ని వెంటనే ఆపుచెయ్. ఎందుకంటే, వాళ్ళు అమాయకులు. నీ లారీలో ద్రాక్ష కింద దాగిన 'జీడిపప్పు' గురించి వాళ్ళకి ఎలా తెలీదో, కటక్—భువనేశ్వర్ రహదారిలో సాగిన 'రహస్యం' కూడా వాళ్ళకి తెలీదు."

"హూ ఆర్ యూ? వాట్ డూ...."

"నేను కటక్-భువనేశ్వర్ రహదారి రహస్యం తెలిసినవాణ్ని!" శివరాం అద్దుకొగుల్తూ అన్నాడు.

లాలా తన ఆశ్చర్యాన్ని నిశ్శబ్దంగా మార్చి శివరాం చెవులకి వ్యక్తం చేస్తూ వుండిపోయాడు. లాలాలాంటి డాన్‌లు అట్టేసేపు ఆశ్చర్యంలో మునిగివుండిపోరని శివరాంకి తెలుసు. డ్రైవర్లని తను చెప్పేదాకా ఏమీ చెయ్యొద్దంటూ అతను ఎవరికో ఆర్డరివ్వడం శివరాంకి అస్పష్టంగా వినిపించింది.

"ఆల్ రైట్, మిస్టర్ " లాలా ప్రారంభించాడు.

"మిస్టర్ శివరాం!" శివరాం సగర్వంగా అతన్ని సరిదిద్దాడు.

"ఆల్ రైట్ శివరాం, ఏమిటి నీ కథ? త్వరగా చెప్పు. డోంట్ వేస్టు మై టైమ్!" హుందాగా అన్నాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "జగ్గా, లాలా లేకపోతే—'జగ్గాలా', నా కథ కాదు; నీ కథ!"

"జగ్గా..జగ్గా..అది నా పేరు కాదు; ఆ పేరున్న వ్యక్తితో మాట్లాడాలంటే నువ్వు అతనికే ఫోన్ చేయాలి" మెల్లిగా అన్నాడు. ఏదో అనుమానం అతని కంఠాన్ని చాలా కొద్దిగా వణికించింది.

"అలాగా! దెన్ అయామ్ సారీ! రాంగ్ నంబర్" శివరాం ఆశ్చర్యం, విచారం నటిస్తూ రెప్పపాటుకాలం ఆగేడు.

"ఆగు! ఫోన్ పెట్టేయకు!" లాలా అరిచాడు.

"యస్?" శివరాం ఎగతాళిగా అన్నాడు.

"కటక్—భువనేశ్వర్ అన్నావు. ఏదో రహస్యమన్నావు....ఏమిటది?" అతను నెమ్మదిగా అన్న మాటల్లో ఆతురత ఆత్రంగా ధ్వనించింది.

"అదా? అది లాలా వినాల్సిందికాదు; జగ్గా వినా

ల్సింది. ఓకే..వుంటాను."

"శివరాం, పేర్లు మరిచిపో. సంగతి చెప్పు!" అతను గంభీరంగా హుంకరించాడు.

"లాలా, నాతో మాట్లాడినంత సేపూ నువ్వు హుంకారాలూ, ఘీంకారాలూ మరిచిపో. నీ సింహావతారం, గజావతారం వగైరా పెద్ద పెద్ద జంతువుల అవతారాల్ని విసర్జించు. తోక తెగిన నక్కలా ఊళ పెట్టు!" శివరాం గంభీరంగా అన్నాడు. లాలా బుసకొట్టడం అతనికి బిగ్గరగా వినిపించింది. అతనికి తేరుకునే అవకాశం ఇవ్వకుండా శివరాం ప్రారంభించాడు.

"ఇంక, కథ విను: నీ లారీలాంటి లారీనే, అదే ఇయర్, అదే మేక్—నీ డ్రైవర్ దుర్గాదాస్ పేరుతో మోరేలో తీసుకున్నాను. నువ్వు కొన్నచోటే గింజల్లేని ద్రాక్ష కొన్నాను. నీలాగే లోడ్ చేయించాను. నీ లారీ నంబర్ నా లారీకీ ఏర్పాటు చేశాను. చురుకైన నీ డ్రైవర్ వెంటనే గుర్తించకుండా వుండేలా చాలా జాగ్రత్తలు తీసుకున్నాను. నా లారీని నీ లారీ స్థానంలో వదిలేసి, కన్నుగీటేలోగా నీ లారీతో వెళ్ళిపోయాను."

"నువ్వెక్కడ్నుంచి మాట్లాడుతున్నావ్?" అతను ఆత్రంగా అడ్డుతగిలాడు.

"నీ పతేర్ మంజిల్ ఎదురుగా వున్న లాడ్జి గదిలోంచీ. పక్క రోడ్లో వున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచీ. బస్టాండునుంచీ. రైల్వేస్టేషన్ నుంచీ. పక్క ఊర్నుంచీ. పక్క జిల్లా హెడ్ క్వార్టర్స్ నుంచీ. చాలా?" శివరామ్ చకచకా అన్నాడు.

రిసీవర్ లాలా బుసని పొయ్యి ఊదే గొట్టంలా శివరామ్ చెవిలోకి సరఫరా చేసింది.

"సాన్ సెన్స్...." లాలా ఆగ్రహంతో ప్రారంభించాడు.

"సెన్స్‌లెస్‌గా మాట్లాడకు!" శివరామ్ తటాలున అతనికి అడ్డుతగిలాడు. "నేనెక్కడున్నానో కనుక్కొనే ప్రయత్నం చేయకు. ఎందుకంటే, భారతంలో, రాయబార సీనులో కృష్ణుడు అనుకుంటేగానీ ధృతరాష్ట్రుడు అతన్ని ఎలా చూడలేడో, అలాగే నేను అనుకుంటేగానీ నన్ను నువ్వు చూడలేవు! ఏ నంబర్నుంచి మాట్లాడుతున్నానో కనుక్కొని నీ శిష్యుల్ని నాకోసం వేటకి నియమించకద్దు. ఎందుకంటే, రోడ్లో ఎవరు నావైపు అనుమానంగా చూస్తూ వెంటపడినా—చివరికి మూడు కాళ్ళ ముసలమ్మ అయినా సరే—నేను జారుకుంటాను. క్షణంలో అంతర్ధానమైపోతాను! ముఖ్యంగా నేను ఉపయోగిస్తున్న ఫోన్ నంబరు కనుక్కొనే ప్రయత్నం నువ్వు చేసిన మరుక్షణం నాకు తెలుస్తుంది. చేరం మానేసి గాల్లో కలిసిపోతాను!"

లాలా తనని కంట్రోల్ చేసుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నట్టు టెలిఫోన్ శివరామ్‌కి చెప్తోంది.

"ఆల్ రైట్! నువ్వెక్కడున్నావో నాకు అనవసరం. ఆ లారీ ఎక్కడుంది?" అతను రెండు క్షణాల తర్వాత ప్రశించాడు.

శివరామ్ చిన్నగా నవ్వాడు. "ఆ లారీ మోరేలోని సప్లయర్ లంకా దొడ్డిచేసుకోడానికి దూసుకెళ్తోంది!"

"వాట్?" లాలా అరిచాడు.

"లాలా, నీకు లారీ కావాలా, లారీలోని సరుకు కావాలా?" శివరామ్ నవ్వుతూ అడిగాడు.

"ఆల్ రైట్, సరుకెక్కడుంది?" లాలా ప్రశ్న

టపాకాయలా పేలింది.

"నువ్వు కావాలంటే చెప్తాను. అయితే, సాక్షాత్తుగా నేను తప్ప మరో జీవుడు అటువేపు అడుగు పెడితే, అది ఒక్కసారిగా పేలిపోతుంది. ధనరాశికి ఏడు శిరసుల నాగేంద్రుడిని దేవతలు కాపలా వుంచినట్టు, నీ సరుక్కి 'డైనమైట్ సర్పెంట్'ని కాపలా వుంచాను!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"ఇంతకీ నువ్వు చేసేదేమిటి?"

"సింపుల్ థింగ్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. "నేను తప్ప మరెవరూ ఆ సరుకు దగ్గరికి వెళ్ళలేరు. సరుకు భద్రంగా తెచ్చివ్వాలంటే నువ్వు నన్ను అక్కడికి పంపించాలి. పంపించాలంటే, నీకు కొంచెం ఖర్చవుతుంది. ప్రతిఫలం లేకుండా నేను పని చేయను!"

అతను చిన్నగా నవ్వాడు. "డబ్బుకోసం నువ్వు ఈ పని చేశావని నువ్వు చెప్పకుండా నే నాకు తెలుసు! మొరిగే కుక్కకి బిస్కెట్ గిరాటేయడానికి నేనెప్పుడూ వెనకాడను! అడుగు. ఎంత కావాలి?"

లాలా కంఠం శివరామ్ మొహానికి చిరునవ్వు పులిమింది. టీపాయ్ మీదున్న పాకెట్ లోంచి సిగరెట్ తీసి పెదాలమధ్య ఇరికించాడు. అగ్గిపెట్టెని మౌత్ పీస్ దగ్గరగా వుంచి చప్పుడు చేస్తూ పుల్ల గీచాడు. సిగరెట్ కొసని మంటలో ముంచాడు. పొగ ఊదుతూ, తన మూడో కంటితో యెక్కడో వున్న లాలాని చూస్తున్నవాడిలా ఎదురుగా వున్న గోడ వేపు చూశాడు.

"ఎంత?" లాలా కంఠం అతని చెవిలో ఉరుములా ధ్వనించింది.

శివరామ్ చిన్నగా నవ్వాడు. "చిన్న రాష్ట్రమైనా,

నీ కార్యస్థానమైన మణిపూర్ పెద్ద మొత్తం బహుమతిగా స్టేట్ లాటరీస్ నిర్వహిస్తోంది. పోయిన దీపావళికను కుంటాను.... మొదటి బహుమతిగా కోటి రూపాయలు ఇచ్చింది. నాకు అలాంటి బహుమతులు రెండు కావాలి. అంతే!"

"వా అఅఅఅట్?" లాలా పెదబొబ్బ శివరామ్ చెవిలో, చిన్న గుహలో సింహగర్జనలా గింగిరాలు తిరిగింది.

"నేను రెండు పడగలు ఎత్తాలనుకున్నాను. అంటేక రెండు కోట్లు కావాలి. అర్థమైందా? టూ క్రోర్స్.... దో కరోడ్!" శివరామ్ చెవిటివాడికి చెప్తున్నట్టు అరిచాడు.

ఈసారి ఇంకా దగ్గర అరుపుని ఎదురుచూసిన శివరామ్కి ఆశాభంగమైంది. నిశ్శబ్దం బరువుగా, పొడుగ్గా అతని చెవిలో దూరుతూ వుండిపోయింది. లాలా గుండె సమ్మె చేసిందా? శివరామ్ నవ్వుకుంటూ పొగని ఊపిరితిత్తుల నిండుగా లాగాడు.

"శివరామ్...." లాలా కంఠం శాంతంగా, లజ్జింపుగా అతన్ని పిలిచింది. "ఈ డీల్లుకి నువ్వు కొత్త అని నాకు అర్థమవుతోంది. నా లారీని అందులోని ద్రాక్షనీ, నీ లారీనీ, అందులోని ద్రాక్షనీ, నా లారీలోని సరుకునీ, ఆ రెండు లారీల్నీ సప్లై చేసిన లంబాడీ దగ్గరున్న లారీలన్నింటినీ అరడజను సార్లు అమ్మినా నువ్వు రెండే అక్షరాల్తో పలికినంత పైకం రాదు! నీకు తెలీదు...."

"కాసేపు నీ నోటికి విశ్రాంతి ఇవ్వు!" శివరామ్ అతనికి అడ్డుతగిలాడు. "నీ దురదృష్టవశాత్తూ, లాలా,

నాకు తెలుసు. ఎంతో కొంత కాదు. అంతా పూర్తిగా తెలుసు! మనిద్దరం ఇందాకా 'సరుకు' 'సరుకు' అంటూ వ్యాపార సరసల్లో వాడే భాషని ఉపయోగించి గుర్తించిన పదార్థం, ఏమిటో నాకు చక్కగా తెలుసు. హిరాయిన్! హిరాయిన్‌గా రూపాంతరం పొందకముందు అది మార్ఫిన్ పేరుతో లావోస్ నుండీ, థాయ్‌లాండ్ నుండీ బర్మాకి సరఫరా అవుతోంది. అక్కడ 'అక్కడ' అంటే ఎక్కడో కూడా నాకు తెలుసు: సోమ్రాలోయ-ఆ సోమ్రా వ్యాలీలో, టేకు అరణ్యంలో బ్రహ్మాండమైన బందోబస్తు మధ్య ఆ మార్ఫిన్ 'అసిటిన్ అన్‌హైడ్రైడ్' రసాయనం సాయంతో పదను పెట్టబడి మృత్యుభస్మం—హిరాయిన్‌గా మారుతోంది. ఆ తరువాత ఆ సువర్ణ త్రికోణం—గోల్డెన్ ట్రయాంగిల్—నుండీ ఇండియాకీ, ఇతర దేశాలకీ సాఫరా అవుతోంది. టీక్ జంగిల్స్ నుండీ హిరాయిన్ పాకెట్లు అతి చాకచక్యంగా మణిపూర్ ప్రాంతానికి స్మగుల్ చేయబడుతున్నాయి. కూటికిలేని కంగిగోవుల్లాంటి ఆడవాళ్ళ ద్వారా, ఇంకా చెప్పాలంటే 'కంగిగోవుల'ద్వారా హిరాయిన్ పాకెట్లు కంచె దాటేస్తున్నాయి....'' శివరామ్ ఆగి, లాలా రియాక్షన్ కోసం యెదురు చూశాడు. లాలా రియాక్షన్ నిశ్శబ్దంతో బరువుగా వుంది. సిగరెట్ పీకని యాష్‌ట్రేలో నొక్కి శివరామ్ మళ్ళీ ప్రారంభించాడు:

“బోర్డరు ఏరియాలో, హాయిగా, అమాయకంగా పచ్చిక మేసే పశువులు, తమకి తెలీకుండానే నీలాంటి కసాయి లుచ్ఛాలు స్మగ్లింగ్ కార్యక్రమాన్ని సాగిస్తున్నాయి. ట్రీట్ చేసి వాడకానికి సిద్ధం చేయబడిన హిరాయిన్ పాకెట్లని నీ సిబ్బంది ఆ పశువులచేత మింగి

స్తున్నారు. బోర్డరు దాటేక, తిరిగ్గా ఆ పశువులు పేడ వేశాక-మనుషుల ప్రాణాలు తీసే ఆ మృత్యు భస్మాన్ని, పెరట్లకీ, పొక్కులకీ, తద్వారా నీలాంటి ఛండాలుడికి కూడా ప్రాణంపోసే ఆ పేడలోంచీ తీసేసుకుని ఎగుమతి చేస్తున్నారు!"

శివరామ్ ఆగి మరో సిగరెట్ వెలిగిస్తూ, లాలాకి ఆలోచించుకోడానికి అవకాశం ఇచ్చాడు.

"శివరామ్...." లాలా కంఠం ఆవు కాలికింద నలిగిన బోదురుకప్ప అరుపులా ధ్వనించింది. "నువ్వు ఎవరో నాకు తెలీదు. కానీ, నువ్వు చాలా, చాలా ఎక్కువగా తెలుసుకున్నావ్. అలాంటి విషయాలు అతిగా తెలుసుకోడం నీలాంటివారికి అంత మంచిదికాదు, శివరామ్!"

బొంగురుగావున్న లాలా కంఠంలో స్పష్టంగా, నిదానంగా ధ్వనించిన బెదిరింపుని శివరామ్ చిన్ననవ్వుతో తుడిచిపారేశాడు. "లాలాభాయ్, కంగారులో నాలుక తడబడి డైలాగ్ని పొరపాటుగా చెప్పేశావ్! అలాంటి విషయాలు నాలాంటివాడు అతిగా తెలుసుకోడం నీలాంటివాడికి అంతమంచిది కాదు! పోతే, నాకు తెలిసిందంతా నువ్వు ఇంకా తెలుసుకోలేదు. ఏదో లారీలూ, అరడజను సార్లో అమ్మకాలూ అదీ అన్నావు. నాఅధీనంలో వున్న నీసరుకు విలువ—టోకు, చిల్లర ధరల్తోసహా—నాకు కంఠోపాఠంగా తెలుసు! పదిపది మిల్లీగ్రాముల హెరాయిన్ ప్యాకెట్ని నలభై రూపాయలకి నీచిల్లర వర్తకులు వీధుల్లో బలిపశువులకు, చిన్నారి బలిపశువులకీ అమ్ముతున్నారు. అంటే కిలో మూడున్నరలక్ష రూపాయలు మాత్రమే! ఈరేటున నేను 'కాన్ఫిస్కేట్' చేసుకున్న వందకిలోల మృత్యుభస్మం ఖరీదు కేవలం మూడు-

న్నర కోటి రూపాయలు మాత్రమే!"

"నో! యూ ఆర్ రాంగ్! యూ డోంట్ నో అరిథ్మెటిక్! యూ...." లాలా ఆదరాబాదరా అరవడం ప్రారంభించాడు.

"ఓహ్! హెచ్చవేత తప్పుగా, ఆన్సర్ తక్కువగా వేశానా? ఏడుకోట్లు అవుతుందా? అయితే నా ఆఫర్ ఇంకా పెరగాలి. ఎంత....?" శివరామ్ తనలో అనుకుం టున్నట్టుగా అన్నాడు.

"నోనోనో!" లాలా బొబ్బలెట్టాడు. "నా అర్థం అది కాదు. కిలో మూడున్నర అయితే, వందకిలోలు.... మూడున్నర అవడం కరెక్టే...."

"ఐసీ.... థాంక్యూ! నేను లెక్కల్లో పూర్. అందు కని...."

"శివరామ్, వెటకారం వద్దు. ఎవరుదేన్ని ఓవర్ ప్లే చేసినా నేను సహించను!" లాలా హుంకరించాడు.

"దెన్, ఆయామ్ సారీ ఫర్ యూ. ఎందుకంటే ప్రతీదాన్నీ, నీలాంటివాళ్ళతో వ్యవహారించేప్పుడు— ఓవర్ ప్లే చేయడం నా సహజగుణంగా తయారై పోయింది! తప్పదు; నువ్వు తట్టుకోవాలి!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"ఆల్ రైట్ శివరామ్! లెట్స్ టాక్ ప్యూర్ బిజి నెస్. కకారాలు మరిచిపోయి లకారాలు మాట్లాడు. ఆశకు అంతు ఉంచుకో. ఎందుకంటే అడిగినంతా అంది వ్వగలిగే ఆసామితో నువ్వు బేరం చేయడంలేదు!" లాలా గంభీరంగా అన్నాడు.

"లాలా భాయ్, ఆయాం సారీ. నిన్నూ, నీ స్టేటస్సీ,

శక్తిని నేను ఎక్కువగా అంచనా వేసుకున్నాను. అందుకే కోట్లలో మాట్లాడాను. ఆల్ రైట్ నీకోసం, కన్సిడర్ చేస్తున్నా. లక్షల్లో మాట్లాడుదాం...." అంటూ శివరామ్ ఆగాడు.

"నైస్! శివరామ్, యూ ఆర్ ఇంటలిజెంట్! యూ నో యువర్ పొజిషన్!" లాలా ఉల్లాసంగా మెచ్చుకున్నాడు.

"థాంక్యూ. థాంక్యూ...." శివరామ్ నవ్వుతూ అన్నాడు. "ఓకే లాలా భాయ్, నా రేటు రెండువందల లక్షలు..."

"క్యా ఆఆఆ? వా ఆఆఆట్?" లాలా నమ్మలేనట్టు అరిచాడు.

"దో సౌ లాక్. టూ హండ్రడ్ లాక్స్!" శివరామ్ నవ్వాడు.

"గుడ్ గాడ్!" లాలా అరిచాడు.

"ఇందాకా నువ్వే అన్నావ్. నేను తెలివైనవాడిని. నా పొజిషన్ తెలిసినవాడిని. అందుకే నీకు సులువుగా అర్థంకావడంకోసం రెండుకోట్లని లక్షల్లోకి మార్చాను!" శివరామ్ వ్యంగ్యంగా అన్నాడు.

"ఇంపాసిబుల్!" లాలా హుంకరించాడు.

"ఏమిటీ? ఈసారి చెప్పు!"

"అసంభవం!"

"అచ్ఛా అసంభవాన్ని సంభవం చేసే శక్తి వున్న వ్యక్తులు ఈ దేశంలో, పోనీ ఈ లోకంలో చాలామంది వున్నారు! వాళ్ళల్లో నలుగురైదుగురి ఫోన్ నంబర్లు నా మునివేళ్ళమీద వున్నాయి. సారీ ఫర్ ది డిస్టర్బెన్స్. గుడ్ బై!"

"హోల్డాన్!" లాలా కంగారుగా అరిచాడు.

"హోల్డింగ్!" శివరామ్ ఖులాసాగా అన్నాడు.

"శివరామ్, రెండు కోట్లు....గుడ్ హెవెన్స్! రెండు కోట్లు! అది నీకు జీర్ణం కాదు! చెక్ వన్!"

శివరామ్ పకపక నవ్వాడు. "ఈ దేశంలో ఎంతో మంది కోటీశ్వరులున్నారు. వాళ్ళదగ్గర రెండుకాకుండా వందల, వేల కోట్లున్నాయి. వాళ్ళకి జీర్ణం అవుతూనే వుంది. అజీర్తి చేసిన లక్షణాలు అవుపించడంలేదు!"

"వాళ్ళ సంగతి వేరు...."

"నా సంగతి వేరుకాదు అని నువ్వెందుకు అనుకుంటున్నావ్?" శివరామ్ గంభీరంగా ప్రశ్నించాడు.

లాలా జవాబుగా బుసకొట్టాడు.

"నీకు తెలుసో లేదో, ప్రస్తుతం నావల్ల అంతరాయం కలిగిన నీ అడ్వెంచర్ మూలంగా నీకు చాలా కోట్లొస్తాయి. ఇంటర్నేషనల్ డ్రగ్ మార్కెట్లో నీ పేరు ఫారిన్ డాన్ల పేర్ల లిస్టులో చేరిపోతుంది. ఫెయిర్ ఫాక్స్‌లాంటి డిటెక్టివ్ ఏజెన్సీలు వాసన పట్టడానికూడా వీల్లేని విధంగా కోట్లాదిరూపాయలు గుడ్ విల్‌గా స్విస్ అకౌంట్సులో జమవుతాయి. అమెరికా, ఫ్రాన్స్, ఇటలీ, జర్మనీ, వగైరా ఇతర దేశాల నార్కోటిక్ మర్చెంట్స్ నిన్ను 'కింగ్ ఆఫ్ ఏషియా'గా గుర్తిస్తారు. ఆ దేశాలకి వెళ్ళాలని నువ్వు కలలో అనుకుంటే ఏ ప్రధానికీ, ప్రెసిడెంటుకీ కూడా లభించని విధంగా స్వాగతసత్కారాలు నీకు లభిస్తాయి...."

"స్టాప్!" లాలా గర్జించాడు.

"రెండు నాకు ఇవ్వలేక ఆ వందకిలోలకి నువ్వు తిలోదకాలిస్తే, ప్రస్తుతం గోవాలో, హోటల్ 'నియా

గోవాలో బసచేసి, నువ్వు డెలివరీ ఇచ్చే సరుకుకోసం ఊపిరి బిగబట్టి ఎదురుచూస్తున్న వివిధ దేశాలకి చెందిన తొమ్మిదిమంది నార్కొటిక్ కింగ్స్‌కి,- డాన్స్‌కి—ఆశాభంగం కలుగుతుంది. అడ్వాన్స్ పుచ్చుకుని, ఏమార్చి ఎగనామం పెట్టావని వాళ్ళు నికరంగా అనుకుంటారు. తోకలు ముడుచుకొని వెళ్ళిపోతారు. త్వరలో అమెరికన్ మాఫియా తన అదృశ్యహస్తాన్ని కదిలిస్తుంది. ఇండియాలో ఎక్కడో నక్కి దాక్కున్న జగ్గా, ఉరఫ్ లాలా తల బెలూన్లా పేలిపోతుంది!” శివరామ్ ఆగాడు.

“శివరామ్....గోవా....హోటల్ నియోగోవా.... ఇవన్నీ నీకెలా తెలుసు?” లాలా కొత్తకంఠంతో ప్రశ్నించాడు. అతని కంఠంలోంచీ ఇందాకటి రోషం, దర్పం, ధనగర్వం మాయమైపోయాయని శివరామ్ గుర్తించాడు.

“నీలాంటి, చీడపురుగులు, నక్కలు—లోకంనుంచీ దాచిపెట్టే అలాంటి విషయాల్ని తెలుసుకోడమే నా హాబీ!” శివరామ్ సగర్వంగా అన్నాడు. “ఇప్పటికే ఆలస్యం జరిగిందనీ, గోవానుంచి వీరులంతా తెల్లారేలోగా ఇక్కడికి చేరుకుంటారనీ నాకు తెలుసు!”

“నాహోటలోనే ఏదో చిల్లు వున్నట్టు నాకు అనుమానంగా వుంది. అతిరహస్యంగా సాగుతున్న ఈ హిస్టారికల్ ట్రాన్సాక్షన్ గురించి ముక్కూమొహం తెలీని నీకు తెలిసిందంటే నావాళ్ళే నాకు వెన్నుపోటుపొడుస్తున్నారనిపిస్తోంది. నీకు చెప్పిన వాడిపేరు చెప్పు. వాడి పేరులోని అక్షరానికో లక్ష చొప్పున, ఖచ్చితంగా అక్షర లక్షలిచ్చేస్తాను!” ఉద్రేకం, నిర్ణయం, ఆగ్రహం లాలా కంఠంలో మూడు నగారాల్లా ధ్వనించాయి.

శివరామ్ పకపక నవ్వాడు.

"అయామ్ నాట్ జోకింగ్, శివరామ్. అక్షరలక్షలు. చెప్పు!" లాలా హుంకరించాడు.

"లాలా చాచా, చెప్తే నువ్వు పూర్తిగా ఆరిపోతావు. డాన్ పదవినుంచీ ఇరుకు సందుల్లో దొంగతనంగా పది మిల్లీగ్రాముల హీరాయిన్ని నలభైకి కాకుండా, ఇరవైకే అమ్ముకునే బికార్లై పోతావ్!" శివరామ్ గంభీరంగా అన్నాడు.

"వాట్! వై?" లాలా కంఠంలో నివ్వెరపాటు శివరామ్‌కి చక్కిలిగింతలు పెట్టింది.

"బికాజ్, లాలా దాదా, గిన్నిస్ బుక్‌లోకి ఎక్కిపోయేంత భయంకరమైన పొడవుతో, అతి ఎక్కువ సంఖ్య అక్షరాల్తో తయారయ్యే విచిత్రమైన పేరు చెప్తాను. ఇప్పటి బేరం 'రెండు'ని అక్షరలక్షల పంతం దాటిపోయినా ఆశ్చర్యపోనక్కర్లేదు!" శివరామ్ ఆపి పకపక నవ్వాడు.

లాలా కొరుక్కున్న పళ్ళు టెలిఫోన్ కుహాయంలో శివరామ్ చెవిలో కటకటమన్నాయి. "బాస్టర్డ్!"

శివరాం మళ్ళీ ఉల్లాసంగా నవ్వాడు. తటాలున నవ్వాపేశాడు. "హీరాయిన్ హీరో, ఇప్పటికే చాలా సేపు నీతో మాట్లాడుతూ వుండిపోయాను. మరో మూడు నిమిషాలు మాత్రం నీతో నీతో సరసాలాడతాను. ఆ వ్యవధిలో నువ్వేం చెప్పినా చెప్పకపోయినా ఫోన్ని గిరాటేస్తాను. తరవాత సరిగ్గా నలభై ఎనిమిదిగంటలతర్వాత నిన్ను కేకేసి పలకరిస్తాను. గోవా హోటల్లో గోల్‌మాల్ జరిగి, మాఫియా వాళ్ళు నిన్ను చూపించడానికి ఆ వ్యవధి చాలు!"

లాలా పళ్ళు మళ్ళీ శివరాం చెవిలో టకటక

లాడాయి. అతని నిట్టూర్పు కోదెత్రాచు బుసలా ధ్వనించింది. ఆ తరవాత అతని కంఠం స్పష్టంగా, కసిగా శివరామ్‌కి వినిపించింది :

"ఆల్ రైట్, స్కౌండ్రల్! ఈసారికి నువ్వు జయించావ్. నువ్వు అనుకున్నంతా పారేస్తాను; పట్టుకెళ్ళు!"

శివరాం హాస్యసంభాషణ విన్నవాడిలా నవ్వాడు. "గుడ్! అయితే. 'అనుకున్నంత' కాదు; ఆజ్ఞాపించినంత! పారేయడం కాదు; పకడ్బందీగా బ్యాంకుల్లో జమ చేయడం!"

"వాట్! బ్యాంకులా? పిచ్చపట్టిందా?" తన చెవుల్ని నమ్మలేని లాలా ఘీంకరించాడు.

"పిచ్చికాదు; పిచ్చిలాలా, వెర్రి; వేలం వెర్రి! ఈ సిటీలోని, పక్కసిటీలోని ఆపక్క చిన్న టౌన్‌లోని ఇరవై బ్యాంకుల్లోని కొన్ని అకౌంట్ నంబర్లిస్తాను. ఆ అకౌంట్సుకి, నేను చెప్పే మొత్తాలు ఇరవై నాలుగ్గంటల్లో జమ అయిపోవాలి. నీ సౌకర్యంకోసం, నీకు సమయం మించిపోకుండా వుండటంకోసం అన్ని బ్యాంకుల్లోనూ ఒకే సమయంలో పైకం జమ అయిపోవాలి. జమ అయిన క్షణంలో ఆవిషయం నాకు తెలిసిపోతుంది. తెలిసిన మరుక్షణం నిన్ను కాంటాక్టు చేస్తాను. ఏం చేయాలో చెప్తాను...."

"ఆగు!" లాలా గద్దించాడు. "ఖాతాల్లో జమ అయ్యాక యేం చేయాలో చెప్తానని యేమిటి గ్యారెంటీ?"

"లాలా, ఆర్ యూ సీరియస్? గ్యారెంటీ కావాలా?" శివరాం ప్రశ్నించాడు.

"అక్కర్లేదు! నువ్వు నా మేనత్త కొడుకువిగా!" లాలా ఉక్రోషంతో హుంకరించాడు.

శివరామ్ చక్కిలిగింతల నవ్వు నవ్వాడు. "కావాలంటే గ్యారెంటీ ఇస్తాను. గవర్నమెంట్ స్టాంప్ పేపర్ మీద చెయ్యికోసి రాసిస్తాను. 'డ్రగ్ డాన్ జగ్గా, అనే లాలాజీ వందకిలోల హిరాయిన్ అప్పగించినందుకుగాను రెండు కోట్ల రూపాయలు బహుమతిగా స్వీకరించినట్టూ, స్వీకరించాక ఫలానా టైమ్‌లోగా హిరాయిన్ అప్పగించకపోతే, సదరు రెండు కోట్లున్నూ దానికి అయ్యే వడ్డీన్నీ అడిగిన తక్షణం జగ్గా అనబడే లాలాజీ వాపసు ఇవ్వగలవాడను' అని విశదంగా రాసిస్తాను!"

"యూ సన్నాఫ్...."

"షటప్!" శివరామ్ కంఠం టపాకాయలా పేలింది. "నందాలుడా, డబ్బుకోసం హిరాయిన్‌లాంటి మృత్యుభస్మాన్ని పన్నెండేళ్ళ, పదహారేళ్ళ పిల్లలకి అమ్ముతూ దేశం ఆరోగ్యాన్ని సర్వనాశనం చేస్తున్న నీకు గ్యారెంటీ కావాలా? కమాన్, గ్యారెంటీ కావా అని మరోసారి అడుగు!"

"శి....వ....రా....మ్...."

"కాకపోతే, ఒక చిన్న గ్యారెంటీ ఇస్తాను. సరుకు నా స్వాధీనంలో వుంది అని నిరూపించే గ్యారంటీ అది! కటక్‌కీ, భువనేశ్వర్‌కీ మధ్య నీ కార్ని ఇద్దరు పోలీసులు అటకాయించారు. ఆరు వీడియో కాసెట్లు నీ డిక్కీలోంచీ తీశారు. బ్లూ క్యాసెట్స్ అంటూ బెదిరించి నీనుండి పదివేలు గుంజుకున్నారు. తరవాత కార్లో కూచున్న నీతో, రోడ్డుమీద నిలబడి అరగంటపాటు కబడీ ఆడారు. తరవాత దగ్గర్లో వున్న ఊరు దాటేదాకా, ఆ తరవాతా నిన్ను వెంబడించి, వదిలేశారు....

"రెండో విషయం: నీ డ్రైవర్లు దుర్గాదస్, కర్తార్లు
రోడ్ సైడ్ రెస్టారెంట్ లో భోజనానికి ఆగారు. ఒక
యువతి, ఇద్దరు యువకులూ వాళ్ళని యెదుర్కొన్నారు.
యువతిని సైగ చేశాడన్న సాకుతో—లారీలు మారేదాకా
వాళ్ళిద్దర్నీ నోళ్ళతో, చేతుల్తో ఉతికి ఆరేశారు. ఇదంతా
నిజమే అని నీ డ్రైవర్లు నీకు ప్రమాణం చేసి మరీ చెప్తారు.
ఇవన్నీ నాకెట్లా తెలుసు? చేయించిన వ్యక్తికి అన్నీ
తెలుస్తాయి!" శివరాం ఆగాడు.

"శివరామ్, నీ అంతు చూస్తాను!" లాలా శపథం
చేశాడు.

"వెల్ కమ్! ఇంక అరనిమిషమే వుంది. నా అంతు
చూడ్డానికి అది చాలా?" శివరామ్ ఎగతాళిగా
అన్నాడు.

"బాస్టర్డ్! బ్యాంకు పేర్లూ అకౌంట్ నంబర్స్
చెప్పు!" లాలా ఓటమిని దబాయింపుతో వెళ్ళగక్కాడు.

"చెప్తాను. అయితే ఇప్పుడు కాదు. రేపొద్దుట తొమ్మి
దింటికి పేనా, కాగితం పట్టుకుని ఫోనుముందు కూచో.
అప్పుడు చెప్తాను. నంబర్ల ద్వారా, అకౌంట్స్ ఎవరివో
కనుక్కుని, న్యూసెన్స్ క్రియేట్ చేసే అవకాశం నీకు
ఇవ్వను. డబ్బు జమచేశాక ఆ బ్యాంకుల్లో బ్యాంకుల
ముందూ కాపలా అదీ యేర్పాటు చేయొద్దు! నష్ట
పోతావ్!"

"కాపలా ఏర్పాటు చేయకపోయినా, నువ్వు ఎప్పుడు
చెప్పినా, ఏది చెప్పకపోయినా, నేను వేటాడతాను.
నిన్ను ఈ చేతుల్తో పట్టుకుంటాను. ఈ చేతుల్తో కసితీరా
శిక్షిస్తాను!" లాలా హుంకరించాడు.

శివరామ్ పకపక నవ్వుతూ రిసీవర్ని పడేశాడు....

"హమ్మయ్యా! ముగించావ్. రోజంతా టెలిఫోన్ని కాగలించుకుని కూచుంటావేమో అని భయపడిచచ్చాను!" లోపలి గదిలోంచీ ప్రవేశించిన లత నవ్వుతూ అంది.

శివరామ్ ఆమెవైపు నవ్వుతూ చూశాడు. "హనీ, యూ ఆర్ రాంగ్: ముగించలేదు; ప్రారంభించాను!"

"వాట్! డార్లింగ్ బోర్ కొట్టేస్తోంది.... కాసేపు."

"నీకో చిన్న పని ఇస్తాను. బోరూగీరూ పారి పోతాయ్!" శివరామ్ అద్దుకగల్తూ అన్నాడు. "కొన్ని టెలిఫోన్ నంబర్లిస్తాను. ఓపిగ్గా కూచుని ఆ నంబర్ల వ్యక్తుల్ని కాంటాక్ట్ చేయి. 'కౌటిల్య ఫైనాన్స్' అధిపతి లక్ష్మీప్రసన్నరావుగారి పర్సనల్ అసిస్టెంట్ గా నిన్ను పరిచయం చేసుకో...."

"డార్లింగ్..."

"యస్" శివరాం సిగరెట్ ముట్టించాడు.

"రెండు కోట్లు....టూ క్రోర్స్.........అంటూంటే విన్నాను....నిజమా?" లత అనుమానంగా అడిగింది.

"హనీ, నిజంతప్ప మరోటి వినడం నీకు చేతకాదని నాకనిపిస్తోంది!" శివరాం డొంకతిరుగుడుగా అన్నాడు.

"గుడ్ గాడ్!" లత అరిచింది. "ఎట్లా మోసు కొస్తావ్? ఏం చేస్తావ్? అంత మొత్తం....గుడ్ హెవన్స్....ప్రమాదం....డార్లింగ్...."

"మోసేవాడికే బరువు. పథకం లేకుండా చేసేవాడికి ప్రమాదం. మనకి కాదు!" శివరాం సగర్వంగా అన్నాడు.

"డార్లింగ్...."

శివరాం ఆమెని తీక్షణంగా చూశాడు. "కౌటిల్య

అధికారిక పి.ఏగా నిన్ను పరిచయం చేసుకో. రేపు మెసర్స్ కాటిల్యా ఖాతాలో—నంబర్లు ఫోన్ నంబర్లతో బాటు నీకు ఇస్తాను—పెద్ద మొత్తం, జమ అవుతుందని చెప్పు. ఖాతా నంబరు చెప్తే చాలు. జమ అయిన మొత్తాన్ని నేనిచ్చే మరో బ్యాంకులో మరో అకౌంటుకి ఇమిడియేట్ ట్రాన్స్‌ఫర్ చేయమను...."

"డార్లింగ్....నువ్విచ్చే నంబర్లు బ్యాంకు మేనేజర్లవా?" లత అడ్డు తగిలింది.

"అక్కరాలా........లేకపోతే—అంకెలా!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"చేస్తారా? అదే....ట్రాన్స్‌ఫర్?"

"ఎందుకు చెయ్యరు. మెసర్స్ కాటిల్యానుండి ఇంకా వార్త రాక తన్నుకు చస్తుంటారు వాళ్ళంతా. తలో పాతిక వేలూ ఫిక్సడ్ డిపాజిట్ వదిలేసుకున్నాంగా!" శివరాం నవ్వుతూ అన్నాడు.... "ఇదివరకే వాళ్ళందరికీ అంతా చెప్పాను. నువ్వు అఫీషియల్‌గా రిమైండ్ చేస్తున్నావ్; అంతే!"

"డార్లింగ్ మరో సందేహం...."

శివరాం ప్రశ్నార్థకంగా చూశాడు.

"ట్రాన్స్‌ఫరయ్యే బ్యాంకునుంచీ అంత పెద్ద మొత్తం ఎలా తీసుకుంటాం? ప్రమాదం లేదా?"

"హనీ, పదునైన బుర్రని ఆయుధంగా వాడే వ్యక్తి ప్రమాదానికి ప్రమాదం!" శివరాం సగర్వంగా అన్నాడు "నీ సందేహాన్ని. ఈ సీక్రెట్ కాల్చేశాక, ఒకే ఒక ఫోన్ కాల్‌తో నివారణ చేస్తాను!"

లత అతన్ని విడ్డూరంగా చూస్తూ అతని పక్కనే కూచుంది. శివరాం ఆమెని చిరునవ్వుతో చూశాడు.

"హనీ, రిసీవరెత్తు. 68721 నంబరు డయల్ చేయి. 'హలో' అన్న వ్యక్తితో లక్ష్మీప్రసన్నరావుగారు మాట్లాడుతారని చెప్పు!"

అతి ఆదరాబాదరా రిసీవరందుకుంది. చివరిదమ్ము లాగుతూ శివరాం సాలోచనగా కళ్ళు మూసుకున్నాడు. అతి కంఠం అతని ఆలోచనల్ని చెదరగొట్టింది.

"డార్లింగ్ ...." అందామె.

శివరాం కళ్ళు తెరిచి, సిగరెట్ పీకని యాష్ట్రేలో పక్కి రిసీవర్ని అందుకున్నాడు.

"మిస్టర్ భానుమూర్తి, నమస్తే!"

"..........."

"నైస్ థాంక్యూ.... రేపు మన అకౌంటుకి చిన్న మొత్తాలు ట్రాన్స్ఫరవుతాయి. అన్నీ కలిపితే, ఒక పెద్ద చిన్న మొత్తం అవుతుంది ..."

"రావుగారూ.........ఎంత?" భానుమూర్తి కంఠం శివరామ్ చెవిలో ఆత్రంగా ధ్వనించింది.

"అనుకున్నంత కాదులెండి. మనకి ఇవ్వాల్సినవాళ్ళు పార్టు పేమెంట్ చేస్తామంటూ కాళ్ళావేళ్ళాపడ్డారు. ఓకే అన్నాను. మహా అవుతే టూ క్రోర్స్ రావొచ్చు...." శివరామ్ అతివైపు కన్నుగీటుతూ అన్నాడు.

బ్యాంక్ మేనేజర్ భానుమూర్తికి కళ్ళు తిర్లు కమ్ముతున్నట్టు అతని కంఠంచేసే చప్పుళ్ళు శివరామ్కి చెప్తున్నాయి. శివరాం చిన్నగా నవ్వాడు.

"మనం అనుకున్న విధంగా వన్ లాక్ ఎఫ్.డి. లో వేసుకోండి. తతిమ్మాది నేనిచ్చే నంబర్లకి వెంటనే ట్రాన్స్ఫర్ చేసేయండి...."

"మిస్టర్ యల్.పి. రావ్, ఆ రెంటినీ కనీసం

రెండేళ్ళపాటు మా బ్రాంచిలో అలాగే వుంచేస్తారను కున్నా!" భానుమూర్తి ఆశగా అడ్డుకగిలాడు.

"ఇంపాసిబుల్!" శివరాం నవ్వుతూ అన్నాడు. "మనకి ఇవ్వాల్సిన సంస్థలు మనకి ఇచ్చాయి. మనం ఇవ్వాల్సిన సంస్థలకి ఇవ్వాల్సిందేగా! ముందు ముందు చూద్దాం. రెండు కాకపోయినా 'ఒకటి' ఎప్పుడో అప్పుడు మీ దగ్గర నిలబైపోతుంది!"

"రైట్. థాంక్స్ చెప్పండి!"

"రేపు నేను బిజీగా వుంటాను. అకౌంట్ నంబర్లూ అవీ ఇప్పుడే నోట్ చేసుకుంటారా?"

"తప్పకుండా! చెప్పండి."

శివరామ్ కళ్ళు మూసుకున్నాడు. "మిస్టర్ భానుమూర్తీ, ఈ ఆరు అకౌంట్సూ, ఆరు ఊళ్ళల్లో, ఆరు బ్యాంకుల్లో వున్నాయి. చెప్తాను....ప్లీస్ టేక్ డౌన్!"

శివరాం చెప్పసాగాడు....

లత అతన్ని అర్థంకానట్టు చూస్తూ వుండిపోయింది.

"అంతే. ఇవన్నీ పెద్ద సంస్థలు. డోంట్ డిలే ది ట్రాన్స్‌ఫర్. కనీసం 24 గంటల్లో వాళ్ళ ఖాతాల్లో జమ అవ్వాలి!"

"దాన్ని గురించి మరచిపోండి. ఎఫ్.డి. 'ఒకటి' గురించి గుర్తుంచుకోండి, దయచేసి!" భానుమూర్తి ఉషారుగా అన్నాడు.

"తప్పకుండా....ఓకే. థాంక్సలాట్!"

"వెల్‌కమ్ మిస్టర్ ఎల్.పి.రావ్!"

శివరామ్ నవ్వుతూ రిసీవర్ని పడేశాడు.

"డార్లింగ్...." లత ప్రారంభించింది.

"హనీ, అనుమానాలకి అనకట్టవేయ్! నేనిచ్చే

నంబర్లకి ఫోన్ చెయ్. రేపొద్దున నా లిస్టులోని అన్ని బ్యాంక్యూకి వెళ్ళు. లోపలా, బైటా తిరుగు. అనుమానం కలిగించేలా అక్కడ ఎవరేనా తచ్చాడుతున్నారేమో చూడు. మన నంబర్ల గురించి వాకబు చేస్తారేమో గమనించు. ఒకే ఒక బ్యాంకులో, ఒకే ఒక వ్యక్తి ఆ నంబరు గురించి అడిగితే చాలు. తతిమ్మా బ్యాంకులకి నువ్వు వెళ్ళక్కర్లేదు. కోటకి మూసుకురా!" శివరాం నవ్వుతూ ముగించాడు.

లత మళ్ళా అతన్ని ఏమిటో అడగబోయింది. శివరాం ఆమెని వారిస్తూ చూశాడు.

"పి.ఏ, పేపరూ పేనా తీసుకో. చెప్పే నంబర్లు రాసుకో!" అన్నాడు కంఠంలో అధికార దర్పాన్ని నటిస్తూ.

నవ్వుతూ లత పైకి లేచింది....

# 9

తలుపులు మూసిన గదిలో లాలా ఆపకుండా పచార్లు చేస్తున్నాడు. గదిలోని ఏ.సి.ని వెక్కిరిస్తూ అతని మొహంమీద చెమట బిందువులు ప్రత్యక్షమవుతున్నాయి. తలుపు దగ్గరగా చేతులు నలుపుకుంటూ నిలబడ్డ ఓంకార్ తల పచార్లు చేస్తున్న యజమాని ఎటుకదిలితే అటు కదులుతోంది.

లాలా తటాలున ఆగాడు. "ఓంకార్....ఎంత ప్రయత్నించావో నాకు తెలీదు. ఆ గుంటనక్కని ట్రేస్ చేయడంలో ఓడిపోయావ్!"

ఓంకార్ గుటకలు మింగాడు. "ఇరవై బ్యాంకుల దగ్గరా మనవాళ్ళున్నారు. డబ్బుకోసం వాడు రాకుండా పోడు, మాలిక్!"

"ఓంకార్ ....ఓటమిని నేను మన్నించను!" లాలా గంభీరంగా అన్నాడు.

ఓంకార్ భయం భయంగా చూశాడు. ఈసారి, ఓటమిని తన యజమాని మన్నించి, అంగీకరించాల్సి వస్తుందేమో అనిపిస్తోందతనికి. చాలా, చాలా తెలివైన వ్యక్తి తమని ఆడిస్తున్నాడు. చరిత్రలో తన యజమాని లాంటి వాళ్ళు చాలామంది ఓటమిని అంగీకరించాడు....

"ఓంకార్ . " లాలా కంఠం అతన్ని ఉలిక్కిపడేలా చేసింది.

"ఏం చేస్తావో, ఎలా చేస్తావో నాకు తెలీదు. ఇరవై నాలుగు గంటల్లో వాణ్ని నాముందు నిలబెట్టాలి; వాడి శవాన్నైనా సరే!" లాలా మళ్ళీ పచార్లు ప్రారంభించాడు.

"మాలిక్ ...."

"ఇంతకాలం నిన్నూ, నీ శిష్యుల్నీ ఎవడో రాజా వస్తాదుల్ని మేపినట్టు మేపాను! నన్ను బ్లాక్ మెయిల్ చేసిన ఆ శివరామ్‌గాణ్ని నాకు అప్పగించు! చేతకాక పోతే, 'మీ అందర్నీ' అప్పగించు!"

"మాలిక్ ...." ఓంకార్ కంగారుగా అన్నాడు.

లాలా ఎర్రటి కళ్ళతో ఓంకార్ని తదేకంగా చూశాడు. "ఓంకార్ ....మనం చాలా ప్రమాదంలో ఇరుక్కున్నాం. ఎవడో మన గురించి కనిపెట్టాడు. వాణ్ణి నిర్మూలించాలి. లేకపోతే ఇంకా, ఇంకా ప్రమాదాల్లో ఇరుక్కుంటాం...."

ఓంకార్ గంగిరెద్దులా బుర్ర ఆడించాడు.

"రెండు కోట్లు పోయినా, ఐ డోంట్ కేర్!" లాలా అరుస్తున్నట్టు అన్నాడు. "వాడి తల కావాలి

నాకు!"

"మాలిక్....ఎంతకాలమైనా వాడు దాక్కోలేడు. బ్యాంకుల్లో తగిన ఏర్పాట్లు చేస్తాను. ఇవాళ కాకపోతే రేపు వాణ్ని బంధించి, మీకు బహూకరిస్తాను. నా కంగారు....అది కాదు...."

లాలా కళ్ళు చిట్లించాడు.

"వాళ్ళు....వాళ్ళంతా వచ్చేశారు. కంపట్లమీద కూచున్నారు. ఒకరోజు ఆలస్యానికే విసుక్కుంటున్నాడు. వాడు డెలివరీ ఇస్తాడా అని ఆలోచిస్తున్నా...."

లాలా చిన్నగా నవ్వాడు. "ఓంకార్, అది డైనమైట్. వాడు దాన్ని దాచుకోలేడు; అమ్ముకోలేడు! తన చేతుల్లోంచీ త్వరగా దాన్ని జారవిడుచుకోడానికి వాడు సహజంగా ప్రయత్నిస్తాడు!"

ఓంకార్ బుర్ర ఆడించాడు. "మీరు డైనమైట్ ఉంటే గుర్తువస్తోంది......చెప్పడం మరిచాను. అన్ని హోటల్సూ చూశాం. ఎక్కడా వాడు లేడు."

లాలా కసిగా నవ్వాడు. "ఓంకార్, వాడు శివరామ్ పేరుతో హోటల్లో వుంటాడని ఎందుకనుకున్నావ్?"

"అది వాడి పేరు కాకపోవచ్చు. వాణ్ని మనం చూడలేదు. అంచేత మనకి వున్న ఆధారం 'శివరామ్' ఒక్కటే!" ఓంకార్ నవ్వుతూ అన్నాడు. "వాడు చాలాసేపు మీతో ఫోన్లో మాట్లాడాడు. ఏ పబ్లిక్ బూత్ నుంచో అంత తీరుబడిగా వాడు మాట్లాడివుండడు. ఎక్కడో శాంతిమయంగా కూచుని, మాట్లాడాడు. అంచేత అది యేదో హోటల్ గదే అయ్యుండాలి అనుకున్నాను. కానీ, మనకి ఆకాల్ ఏనంబర్నుంచీ వచ్చిందో కనిపెట్టే అవకాశంలేదు. ప్రయత్నించిన మరుక్షణం

మాయమైపోతానన్నాడువాడు!"

లాలా కోపంతో బుసకొడుతూ నిట్టూర్చాడు. "మొట్టమొదటే ఆ స్కౌండ్రల్ మన కాళ్ళూ చేతులు కట్టేశాడు! ఓంకార్, కత్తిలాంటి వ్యక్తితో మనం డీల్ చేస్తున్నాం. కత్తిలాగే ప్రవర్తించి నువ్వు వాణ్ని పట్టాలి. నాకత్తికి యెదురు నేను సహించను!"

"మాలిక్ ....మనం ...." యేదో చెప్పబోయిన ఓంకార్ని టెలిఫోన్ మోత అడ్డుకుంది.

"లాలా చాచా?" శివరాం కంఠం లాలా చెవిలో నవ్వుతూ ప్రశ్నించింది.

"యస్ ....శివరాం సరుకు ...." లాలా ఆత్రంగా ప్రారంభించాడు.

"నా కంఠాన్ని పోల్చుకున్నావ్. గుడ్! లాలా, నీ సరుకు ప్రస్తుతం నా సరుకుగా వుంది. నీవ్యాపారం, ప్రస్తుతం మనం చేస్తున్న వ్యాపారం పూర్తిగా నమ్మకం మీద ఆధారపడింది. ఇది దొంగవ్యాపారం. దొంగ వ్యాపారంలో పార్టనర్స్ ఒకర్నొకరు మోసంచేయరు; చేసి మునిగిపోరు!"

"శివరామ్, నిజం చెప్పావ్. తెలివిగా నిజంచెప్పావ్. సరుకు ...." లాలా ఉద్రేకంతో చెప్పబోయాడు.

"అయితే, నువ్వు నమ్మకాన్ని వమ్ముచేశావ్ లాలా!" శివరాం గంభీరంగా అన్నాడు.

"వాట్ డూ యూ మీన్?" లాలా హుంకరించాడు.

"నా ఫోన్ నంబరుకోసం ప్రయత్నించవద్దన్నాను. నా ఉనికి కోసం వెతకొద్దన్నాను. నువ్వు వెతికావ్ ...."

"నో!" లాలా అరిచాడు.

"అంతేకాకుండా, హోటల్సులో నాకోసం గాలిం

చడం కాకుండా ఇరవై బ్యాంకుల ముందూ నీ రెండేసి కళ్ళని, నలభైకళ్ళని కాపలా వుంచావ్ ...”

“నో! యూ ఆర్ మిస్టేకన్! నేనా పనిచేయలేదు. యేకళ్ళనో చూసి కంగారుపడి, నాకళ్ళనుకున్నావ్!” లాలా మళ్ళీ అరిచాడు.

“లాలా కోట్లవిలువతో నార్కోటిక్స్ అమ్ముతుంటున్నాకూడా నువ్వు తగినంతగా ఎదగలేదు. పోలీసులకి దొరికిపోయి, సొత్తూ, సొమ్ము పోగొట్టుకోడం కన్నా యే శివరామ్‌కో రెండుకోట్లు పారేసి, తరవాత యథేచ్ఛగా బిజినెస్ చేసుకోవాలన్న ఇంగితం నీకెందుకు లేదు?” శివరాం దబాయిస్తున్నట్టు ప్రశ్నించాడు.

“ఎందుకలేదు? నీ రెండుకోట్లూ నాకు రెండులక్షల్తో సమానం. నువ్వు చెప్పిన అకౌంట్సులో అప్పుడే గిరాటేశాం!” లాలా హుంకరించాడు.

“శభాష్ అయినా, పిసినారిలా ఇంకా గుర్తుంచుకునే వున్నావ్! నీమేలుకోరి, నీతో బేరం చేశాను. ప్రభుత్వానికి స్టాకునీ, నిన్నూ పట్టిచ్చి, పారితోషికం, పబ్లిసిటీ సంపాయించడం చేతకాక నీతో వ్యాపారం చేశాననుకుంటున్నావా?”

“శివరాం, యేదో ఊహించుకుంటున్నావ్.... నేను....”

“లాలా, నలభైకాదు; ఎనభై కళ్ళని నువ్వు నాకోసం రెడీగా వుంచొచ్చు. కానీ, నన్ను చూడలేవు చూసినా యేమీ చేయలేవ్! నీ రెండుకోట్లూ నాకూ క్షేమంగా అందాయి....”

“అయితే ఇంకేం? నాది నాకు వాపసు చెయ్!” లాలా

తెలివిగా అన్నాడు.

శివరాం నవ్వు అతనికి వినిపించింది. "చేస్తాను. చేసే ముందు, సూచనల్ని నిర్లక్ష్యం చేసినందుకు పెనాల్టీ వడ్డిస్తాను!"

"ఇంత పైసా ఇవ్వను!" లాలా గర్జించాడు.

"పెనాల్టీ చెల్లించకపోతే, నిన్నూ నీ సరుకునూ మరిచిపోయి, అమ్నేషియా వచ్చినవాడిలా అమెరికా వెళ్ళిపోతాను!"

"ఇది అన్యాయం! బాస్టర్డ్! నిన్ను ...."

"నన్ను గురించి మరిచిపో. గోవానుండీ ఇక్కడికి దూసుకువచ్చి, హోటల్ రెక్స్‌లో అవురావురంటున్న నీ ఇంటర్నేషనల్ మిత్రుల్ని ఒకసారి గుర్తుచేసుకో! ఆలస్యం జరిగితే వాళ్ళు నిన్ను ఎట్లా ఆర్చేస్తారో గుర్తుచేసుకో!" శివరాం ఎగతాళిగా అన్నాడు.

"ఆల్ రైట్! స్కౌండ్రల్ ....ఎంత? ఎంత కావాలో మొరుగు. పారేస్తాను. అయితే మళ్ళీ బ్యాంకులూ ఖాతాలూ వీల్లేదు వ్యవధి లేదు ..."

"లాలాభాయ్, ఎంత కావాలో కాదు; యేమిటి కావాలో అడుగు!" లాలా ఆశ్చర్యంతో కళ్ళు పెద్దగా చేశాడు. "వాట్ డూ యూ వాట్?"

శివరాం ఖులాసాగా నవ్వాడు. "వెరీగుడ్! సింపుల్ థింగ్! నువ్వు అందించే అమృతంకోసం హోటల్ గదిలో కాచుక్కూచున్న నార్కోటిక్స్ నాయకుల పేర్లూ, ఊర్లూ చెప్పు. చాలు!"

"వాట్?" లాలా తన చెవుల్ని నమ్మలేనట్టు అన్నాడు.

"మళ్ళీ చెప్పాలా?"

"వాళ్ళ పేర్లు....అవి నీకెందుకు?"

"అది నీకు అనవసరం" శివరాం నవ్వుతూ అన్నాడు.

లాలా నిట్టూరుస్తూ, కోపాన్ని కంట్రోల్ చేసుకున్నాడు.

"శివరాం, అడిగినంతా, అడిగినవిధంగా ఇచ్చేశాను. ఇంకా వాళ్ళ వివరాలు దేనికి? యేదో పొరపాటు జరిగి వుండొచ్చు. దాన్నంత సీరియస్‌గా తీసుకోకు. స్టాక్ డెలివరీ ఇచ్చేయ్. బీ రీజనబుల్!"

"దుర్వ్య ప్రయత్నం చేస్తున్నావ్; టైం వేస్టు చేస్తున్నావ్. అడిగిన వివరాలు చెప్పకపోతే, నీసరుకూ, నీ డబ్బూ— మొత్తం భారతప్రభుత్వానికి అప్పగించేసి, దేశ సేవ చేశానని తృప్తిపడి, చేతులు దులుపుకుని వెళ్ళిపోతాను!"

"బాస్టర్డ్!" లాలా అరిచాడు. మెల్లిగా కంఠం తగ్గించి, సౌమ్యంగా అడిగాడు "శివరాం, ఆ వివరాలు నీకెందుకు? వాళ్ళని యేంచేస్తావ్?"

"యేమీ చేయను. వాళ్ళ వివరాలూ, నీ వివరాలూ కలగలిపి పోతపోసి, ఒక కవచం తయారు చేసుకుంటాను!"

"డోంట్ జోక్! ఐ డోంట్ లైక్ జోక్స్! నిజం చెప్పు!" లాలా దబాయించాడు.

"నీమీద ఒట్టు లాలాచాచా! మీ అందరి చరిత్రా జాగ్రత్తగా రాసి, భద్రంగా డిపాజిట్ చేస్తాను. ఉత్తరోత్తరా నాకేదైనా అపాయం జరిగితే, నా ప్రాణం, గీణం అనుమానాస్పదంగా పోతేగీతే, నా చావుకి మీ

రందరూ కారకులనిరాస్తాను. ఎందుకు కారకులయ్యారో రాస్తాను. శివరాం హరీ అనగానే బేడీలు మీవైపు దూసుకొస్తాయ్! మీ అందరి వివరాలూ నాకు 'కవచం' అని ఇప్పుడు అర్థమైందా?" శివరాం నవ్వుతూ అడిగాడు.

లాలా ఘొల్లున నవ్వాడు. "శివరాం, అనవసరంగా భయపడుతున్నావ్. నాది నాకు అందిన మరుక్షణం నిన్ను మరిచిపోతాను...."

"అలాంటప్పుడు వాళ్ళ వివరాలు ఇవ్వడానికి నీకు భయం దేనికి? నేను క్షేమంగా వుంటే మీరూ క్షేమంగా లాభాల్లో జీవిస్తారు!"

"శివరాం .. డోంట్ బీ...."

"వాళ్ళ పేరూ, వివరాలూ తప్ప మరో అక్షరం పలికితే రిసీవర్ పెట్టేస్తాను!" శివరాం హుంకరించాడు.

"సన్ ఆఫ్ డెవిల్! రాస్కెల్!" లాలా ఆగ్రహంతో ఊగిపోతూ అరిచాడు.

"యస్ బాస్!" శివరాం ఎగతాళిగా అన్నాడు. "ఒకే ఒక పేరు తప్పుగా చెప్తే మన అగ్రిమెంట్ ఆటోమేటిగ్గా గడ్డవుతుంది. లిస్టు తయారయ్యాక, నాపద్ధతులతో వాళ్ళ గురించి వాకబు చేస్తాను. పాస్‌పోర్టులూ అవీ చెకప్ చేయిస్తాను. రాంగ్ ఇన్ఫర్మేషన్ ఇచ్చినందుకు జీవితాంతం ఏడుస్తూ జైల్లో కూచుంటావ్!"

"స్టాప్ బార్కింగ్! స్టార్ట్ రైటింగ్!" లాలా హుంకరించాడు.

"మైకేల్ ఫెర్గుసన్, శాన్‌ఫ్రాన్సిస్కో....విట్టోరియో, వెనిస్ ఫోన్లోకి దండకం చదవడం ప్రారంభించాడతను.

# 9

రిసీవర్ని పడేసి, లిస్టుని కోటుజేబులోకి తోసి శివరాం సిగరెట్ వెలిగించాడు. అలసటగా కళ్ళు మూసుకున్నాడు. తటాలున పైకి లేచి పచార్లు ప్రారంభించాడు. ఆ సమయంలో లత గదిలో లేనందుకు అతను సంతోషించాడు. తన తదుపరి కార్యక్రమం గురించిన రకరకాల ఆలోచనలు కందరీగల్లా అతని బుర్రలో రొద చేస్తున్నాయి....రిసీవరెత్తి నంబర్ తిప్పాడు.

"యస్?" అవతలి కంఠం వెంటనే అంది.

"మిస్టర్ .... టెంపో!"

"యస్ .... స్పీకింగ్!"

"మిస్టర్ టెంపో, మిస్టర్ శివరాం హియర్ ...."

"శివరామ్! నీ ఫోన్ కాల్ కోసం యెదురు చూస్తున్నా.." డిటెక్టివ్ టెంపో నవ్వుతూ అన్నాడు.

శివరామ్ కనుబొమలు అతని నుదుర్ని పైకి తోశాయి.

"హౌ కమ్?"

"ప్రతీసారీ నువ్వు ఒకడుగు ముందుంటున్నావ్. ఈసారి నేను రెండడుగులు ముందున్నా!" డిటెక్టివ్ టెంపో సగర్వంగా అన్నాడు.

"ఐసీ....ఎందులో?" శివరామ్ ప్రశ్నించాడు.

"శివరామ్, నా అంచనా ప్రకారం ఇవాళా రేపట్లో నువ్వు నాకు ఫోన్ చేయాలి....చేస్తున్నావ్ ...."

"మిస్టర్ టెంపో...."

"చెప్పకు శివరాం: విను!" టెంపో నవ్వుతూ అన్నాడు. "ఏదో కేసుమీద ఇక్కడికి వచ్చాను. ఈ కేసులో విదేశీ హస్తాలున్నట్టు నా పరిశోధనలో తేలింది.

చావబోయే, చచ్చిపడబోయే జంతువుకోసం రాబందుల్లా చాలామంది డాన్‌లు ఇక్కడ కూచున్నారు. వాళ్ళు అలా కూచోడానికి కారణం నువ్వే అని నీ ఫోన్ కాల్ చెప్తోంది ."

శివరాం నుదురు ముడతలు పడింది. "మిస్టర్ టెంపో"

"పూర్తిగా చెప్పరీ, శివరాం! ఆనవాళ్ళు తెలీకుండా ఏదో అడ్వెంచర్ సాగుతోంది. అడ్వెంచర్‌లోని ఈ లక్షణం కూడా నీ టెక్నిక్‌ని గుర్తుచేస్తోంది. ఏమిటి కథ?"

"ఆల్ రైట్ డ్రగ్ డాన్ జగ్గా పేరు విన్నారా?" శివరామ్ ప్రశ్నించాడు.

"కీర్తి శేషుల్ని — వి మీన్ అపకీర్తి శేషుల్ని గురించి మాట్లాడకు, శివరాం!"

"మిస్టర్ టెంపో, మీకెంతో తెలుసనుకున్నాను; కొంతే తెలుసని ఇప్పుడు కనుక్కున్నాను!" శివరాం సగర్వంగా అన్నాడు. "జగ్గా చనిపోయాడు; మీకూ, మీ పోలీసువాళ్ళకీ, పత్రికల వాళ్ళకీ, లోకానికి సంబంధించినంతవరకూ. జగ్గా పునర్జన్మ ఎత్తాడు...."

"శివరామ్!"

"మళ్ళీ జన్మించిన జగ్గాని, 'లాలా'గా జన్మించిన జగ్గాని మీకు పై అంటే షూవ చూపిస్తాను, మిస్టర్ టెంపో!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"శివరాం, నన్ను ఉడికించడానికి కొత్తరకం నాటకం రాసుకున్నావా?" టెంపో అనుమానంగా అడిగాడు.

శివరాం పకపక నవ్వాడు. "మిస్టర్ టెంపో, గోల్డెన్ ట్రయాంగిల్ నుండి వందకిలోల హెరాయిన్‌ని జగ్గా, శకపాతే లాలా గోవాద్వారా విదేశానికి ఎగుమతి

చేయడానికి మణిపూర్ నుండీ తరలించాడు. మార్గ మధ్యంలో ఆ వంద కిలోల్నీ నా జేబులో వేసుకున్నాను. లాలా సరుకు లాలాకే ఇచ్చేయడానికి నాకు అభ్యంతరం వుంది...."

"అంటే?"

"అంటే మిస్టర్ టొంపో, కేసుల్లో మీ ఫీజు మీకు ముట్టినట్లు నా ఫీజు నాకు ముట్టింది!" శివరాం నవ్వుతూ అన్నాడు. "న్యాయంగా అతనిది అతనికి అప్పగించాలి. కానీ, లక్షలాదిమంది ఆరోగ్యాల్నీ, డీసెన్సీనీ నాశనం చేసే ఆ సరుకుని రాక్షసులకి అందించడానికి నాలోని మానవత్వం ఒప్పుకోడం లేదు. అందుకు మీ సహాయం కావాలి...."

టొంపో నవ్వు శివరాంని ఆపింది. "శివరాం, నీకూడా సహాయం అవసరం అని ఒప్పుకుంటావా, ఇప్పుడేనా?"

"సహాయం నాకాదు; ప్రజలకి! చూపుడువేలు కదిపి ఆ మృత్యుభస్మాన్ని నాశనం చేయగలను! అయితే లాలానీ, ఇంకా ఎంతోమంది లాలాల్నీ ఆటకాయించలేను. మీ దేశంకోసం సహాయం చేస్తూ మీరు నా సహాయాన్ని అందుకుంటారేమో కనుక్కోడానికి ఫోన్ చేశాను...."

"శివరాం, పూర్తిగా చెప్పు!"

"మరో రెండు మూడు గంటల్లో నేను సరుకుని అతనికి డెలివరీ ఇస్తాను. ఆ క్షణంలో మీరు కావాలంటే అతన్నీ, అతని సరుకునీ, అతని ఫారిన్ ఫ్రెండ్సునీ మీకు డెలివరీ ఇస్తాను...."

"శివరాం, నిజం చెప్పు! ఉన్నట్టుండి చట్టంతో

సహకరించే సద్బుద్ధి నీకెందుకు పుట్టింది?"

శివరాం సోఫాలో వెనక్కి వాలి, సిగరెట్ వెలిగించాడు. మెల్లిగా అతని పెదవులు కదిలాయి. "మిస్టర్ టెంపో, ఆ సద్బుద్ధి ఇప్పుడు పుట్టిందికాదు; ఎప్పుడో నాతో బాటే పుట్టింది. నా చర్యల మూలంగా నేను చట్టంతో సహకరిస్తూనే వున్నాను. ఆ సహకారాన్ని మీరంతా అర్థం చేసుకోడంలేదు; అపార్థం చేసుకుంటున్నారు!"

"యూ ఆర్ రాంగ్....శివరాం...."

"మిస్టర్ టెంపో, మీతో వాదులాడ్డానికి నాకు ఓపిక లేదు!" శివరాం అడ్డుతగిలాడు. "మీరూ, మీ పృథ్వీరావూ ఓకే అంటే ఇంటర్నేషనల్ డ్రగ్ రాకెట్ ని పట్టుకున్న తృప్తి మీకు లభిస్తుంది! చెప్పండి!"

"శివరాం, నిజం చెప్పు! నీ ఫీజు ఎంత?" టెంపో జవాబు చెప్పకుండా ప్రశ్నించాడు.

"రెండు కోట్లు" శివరాం తాపీగా అన్నాడు.

"వాట్!"

"టూ క్రోర్స్ ఇన్ ఇండియన్ కరెన్సీ, మిస్టర్ టెంపో; వాట్ మోర్!" శివరాం చిన్నగా నవ్వాడు.

"ఆర్ యూ సీరియస్."

"నెవర్ మోర్ సీరియస్ మిస్టర్ టెంపో!"

"శివరాం నువ్వు చెప్పేది నిజమే అయితే, నీకో సలహా ఇస్తాను...."

"వెల్ కమ్!"

"సరుకునీ, ఆసాములన్నీ, పాటలోషిరాన్ని ప్రభుత్వానికి అప్పగించెయ్!"

"తరవాత?" శివరాం నవ్వుతూ అడిగాడు.

"తగువిధంగా సిఫార్సు చేసి, నీకు ప్రభుత్వంనుండీ అవార్డు ఇప్పిస్తాం...."

"ఎంత?" శివరాం అడుగగిలాడు.

"ఎంతో ఇప్పుడు చెప్పను. అఫీషియల్ గా అనౌన్స్ చేస్తాం...."

శివరాం చిన్నగా నవ్వాడు. "శివరాం అవార్డులు స్వీకరించాడు!"

"మరీ మంచిది. స్వచ్ఛందంగా ఇచ్చేయ్!" టెంపో నవ్వాడు

"మిస్టర్ టెంపో, స్వచ్ఛందంగా సేవ చేస్తాను. సేవకు తగినంత తృణమో పణమో స్వీకరిస్తాను!"

"శివరాం, రెండుకోట్లు తృణంకాదు; పణం!" టెంపో నవ్వుతూ అన్నాడు. "ఆల్ రైట్, నువ్వు బుకాయిస్తున్నావ్. రెండు కోట్లు ఎలా కలెక్ట్ చేశావ్, సరుకు ఇవ్వకుండా?"

"భారీ కలెక్షన్లు బ్యాంక్స్ ద్వారా జరుగుతాయి మిస్టర్ టెంపో!"

"వాట్!? ఐ కాంట్ బిలీవ్! బ్లాక్ మెయిల్ సొమ్ముని బ్యాంక్ ద్వారా వసూలు చేశావా?

"నన్ను నమ్మండి! ఒక బ్యాంకు కాదు; ఇరవై బ్యాంకుల ద్వారా!" శివరాం కులాసాగా నవ్వాడు.

"శివరామ్, ఇదంతా ఇలాగే జరిగితే సిబిఐ కేసవుతుంది. క్షణాలమీద కేంద్రానికి విషయం రిపోర్టు చేయబడుతుంది. కేంద్ర ఆర్థిక మంత్రి వెంటనే లక్ష రూపాయలు మించిన అకౌంట్సన్నింటినీ ఫ్రీజ్ చేస్తూ ఉత్తరువిస్తాడు. నీ రెండుకోట్లు బ్యాంకుల్లో ఇరుక్కుపోతాయ్. నా మాట విను!"

"విన్నాను; అర్థం చేసుకున్నాను. ఈ క్షణంనుంచే ఇండియాలోని అన్ని బ్యాంక్స్‌నీ ఫ్రీజ్ చేయమనండి. ఐ డోంట్ కేర్! నా పైకం ఇంకా నా చేతికి రాలేదు; నిజం చెప్పాలంటే. అయితే నేను చెయ్యిచాపిన క్షణంలో నాది నాకు అప్పగించ బడుతుంది. ఇంకా కావాలంటే ఒక యేడాదిపాటు ఖాతాల్ని స్తంభింపజేసుకోండి!" శివ రామ్ సగర్వంగా అన్నాడు.

"శివరామ్"

"మిస్టర్ టెంపో, నన్ను పరీక్షించడానికి మీరు ప్రయత్నిస్తున్నారు. నా శ్రమకి తగిన ప్రతిఫలం నాకు ఎప్పుడూ అందుతుంది. ఆ గ్యారంటీ వుంటేగానీ శివరాం శ్రమించడు! ఆల్ రైట్... తొమ్మండుగురు ఫారిన్ నార్కొటిక్ కింగ్స పేర్లూ, అడ్రసులూ మన డాన్ గారి కథా మీకు చెప్తాను. ఏ సమయంలో, ఎక్కడ ఎలా సరుకు అందజేస్తారో చెప్తాను. అందర్నీ, సరుకునీ ఎలా అధీనంలోకి తీసుకోవాలో చెప్తాను. సరిగ్గా అరగంట తర్వాత ఫోన్ చేస్తాను. ఈ అరగంటలోగా మీరూ, పోలీసులూ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ పూర్తి చేయండి; తయారుగా ఉండండి...."

"శివరాం, ఎక్కణ్నుంచీ మాట్లాడుతున్నావ్?" టెంపో అడ్డొస్తూ అడిగాడు.

"చెప్తాను. అయితే రసీవర్ పడేసిన మరుక్షణం ఇక్కడ మాయమై మరెక్కడో ప్రత్యక్షమవుతాను! నన్ను మీరు ఇప్పట్లో చూడలేరు. ప్రయత్నిస్తే జయించ లేరు. ఎందుకంటే నేను చాలా ప్రదేశాల్లో వుంటున్నా ను! నన్ను ట్రేస్ చేయడానికి మీరు ప్రయత్నిస్తే అన్ని ప్రదేశాల్లోంచీ ఒకేసారి అంతర్ధానమైపోతాను...."

"శివరాం, అదికాదు...."

"మిస్టర్ టెంపో, ఈ క్షణంలో మీకు కావాల్సింది శివరాం కాదు. ప్రపంచ యువతని భ్రష్టుపట్టిస్తున్న నొటోరియస్ డ్రగు రాకెటీర్స్! నన్ను పట్టే ప్రయత్నం చేయకండి. నార్కోటిక్స్ కనెక్టువల్ని పట్టే ప్రయత్నం చేయండి; జయిస్తారు!" శివరామ్ గంభీరంగా అన్నాడు.

"శివరాం....ఒక్క క్షణం!"

"ఒక్క క్షణంకాదు; ముప్పై నిమిషాలు; మిస్టర్ టెంపో! సోలాంగ్!" శివరాం రిసీవర్ని పడేశాడు. అలసటగా సోఫాలో వెనక్కి వాలి, సిగరెట్ వెలిగించాడు.

"డార్లింగ్...."

లలితకంఠం శివరాం కనుబొమ్మల్ని పైకి కదిలించింది. మెల్లిగా తలని సోఫా వెనకభాగానికి నొక్కాడు.

"హనీ....ఇంతసేపూ ఎక్కడున్నావ్?" ఆమెవైపు తిరక్కుండా ప్రశ్నించాడు.

"ఇక్కడే! తలుపు కొద్దిగా తెరిచి, నువ్వు డిటెక్టివ్ టెంపోతో అడిన మాటలన్నీ విన్నాను!" లత నవ్వింది.

శివరాం పకపక నవ్వాడు. "నన్నే ఏమార్చావ్!"

లత నవ్వుతూ అతని ముందుకు నడిచింది. అనుమానిస్తూ అతనివైపు చూసింది. "డార్లింగ్...."

"యస్?"

"నాకో అనుమానం...." లత ప్రారంభించింది.

"హనీ, అనుమానాలకి ఇది అదనుకాదు! రెండు రోజుల్లో ఊటీలో వుంటాం. చల్లటి ఊటీలో చక్కగా కబుర్లు చెప్పుకుందాం!" శివరాం పైకిలేచాడు.

"రెండ్రోజులు....సస్పెన్స్.....నావల్ల కాదు!" లత

మొండిగా అంది.

శివరాం లత భుజం చుట్టూ చెయ్యి వేశాడు. "హనీ, నేను ఒకే సమయంలో చాలాచోట్ల వుంటానని డిటెక్టివ్ టెంపోకి ప్రామిస్ చేశాను. డిటెక్టివ్‌లకి చేసిన వాగ్దానాల్ని విస్మరించకూడదు. కమాన్, లెట్స్ గో టూ అవర్ ఒరిజినల్ హోటల్!"

తనని ముందుకి లాగుతున్న శివరాంని లత వాలుగా చూసింది. "ఈసారి చీటికీ మాటికీ ఈ హోటల్ నుండీ ఆ హోటల్‌కీ, ఆ లాడ్జినుంచీ ఈ లాడ్జికీ మారి మారి అలిసిపోయాను!"

శివరాం నవ్వుతూ తలుపువైపు ఆమెని నడిపించాడు..

# 10

"డార్లింగ్".

"యస్?"

"పేపర్లు చూశావా?"

"ఆ"

"హీరాయిన్ కింగ్ లాలానూ అతని అంతర్జాతీయ సహచరుల్నీ విజయవంతంగా వలవిసిరి బంధించి వంద కిలోల హీరాయిన్‌ని పట్టుకున్న ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్‌నీ, డిటెక్టివ్ టెంపోనీ పేపర్లు ఆకాశానికెత్తేశాయి!" లత ఎగతాళిగా అంది.

"కరెక్ట్" శివరాం నవ్వుతూ అన్నాడు.

"డార్లింగ్, ఇంటర్నేషనల్ నార్కొటిక్ గ్యాంగ్‌ని పట్టిచ్చింది నువ్వు!" లత ఉద్రేకంతో అంది.

శివరాం ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు. "పేరు వాళ్ళది; పెన్నిధి మనది!"

లత పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

"డార్లింగ్, బ్యాంక్ అకౌంట్సన్నిటినీ కావాలంటే యేడాదిపాటు ఫ్రీజ్ చేసుకొమ్మని నువ్వు డిటెక్టివ్ టెంపోతో అంటూంటే విన్నాను. అప్పటికి మొత్తం మనకి అందలేదు! టెంపోతో ప్రభుత్వంతో సవాలుగా మాట్లాడి అంతా పోగొట్టుకుంటావేమో అనుకున్నాను! చెప్పకపోయినా రెండుకోట్లమీద గవర్నమెంటు కన్నేసే వుంటుంది. మనది, మనకి ఎలా వచ్చింది? ఇరవై బ్యాంకుల్నుంచీ ఒక బ్యాంకులోని ఒక అకౌంటుకి ట్రాన్స్ఫర్ చేయించావు....తరవాత?"

"రెండుకోట్లు — పెద్ద మొత్తం. అంత పెద్ద మొత్తాన్ని మనం చాలా జాగ్రత్తగా హాండిల్ చేయాలి; చేశాం!"

"అదే అర్థంకావడంలేదు. బ్యాంకు భానుమూర్తికి మాకేవో సూచనలిచ్చావ్...."

"గుడ్. గుర్తుంచుకున్నావ్?" శివరాం నవ్వుతూ అన్నాడు. "భానుమూర్తి బ్యాంకుకి ఇరవై బ్యాంకుల్లోంచీ మొత్తమంతా చేరుతుంది; నదులన్నీ సముద్రంలో చేరినట్టు. అతనికి వేరే ఆరు నంబర్లిచ్చాను. లక్షరూపాయల ఎఫ్.డి, ఉత్తరోత్రా ఇంకా ఎఫ్.డి. వగైరా ఆశలు అతనికి చూపించాను; చకచకా పనిచేయడానికి. అతను ఆ ఆరు ఖాతాలకీ మొత్తాన్ని వెంటనే ట్రాన్స్ఫర్ చేశాడు...."

"డార్లింగ్, ఆరు అకౌంట్లూ ఆరుచోట్ల యెప్పుడు ఓపెన్ చేశావ్?" లత ఆశ్చర్యంతో అడిగింది.

"మనం ఓపెన్ చేయలేదు. మనకోసం 'మంది' ఆ పని చేశారు!" శివరాం నవ్వుతూ అన్నాడు

"డార్లింగ్...." లత కనుబొమలు అందంగా కల్స

వస్తాయి. శివరాం తటాలున లేచాడు. సిగరెట్ పొగని చక్రంలా ఆమెవైపు రువ్వాడు. "ఈసారి మన అడ్వెంచర్ పూర్తవకముందే టెంపోకి, పోలీసువాళ్ళకి తెలిసింది. సహజంగా, కనీసం క్యూరియాసిటీతో — వాళ్ళు శివరాంమీద ఓ కన్నేసి వుంచుతారు. మన ఫీజు మనకి క్షేమంగా, సునాయాసంగా దక్కాలి. అంచేత బ్రహ్మాండమైన ప్లాన్ వేశాను .... ఆ ఆరు అకౌంట్లూ మన ప్రాణమిత్రులవి...."

"ఎవరు? కమాన్ డార్లింగ్ ...."

"ప్రాణమిత్రులు అంటే తమ ప్రాణాల్ని నా చేతిలో పెట్టి, హాయిగా బతుకున్న మిత్రులు అని నువ్వు అర్థం చేసుకోవాలి!' శివరాం నవ్వుతూ అన్నాడు. "గతం వాళ్ళంతా, పాపం, మనకి అడిగినంతా ఇచ్చారు. రాజవర్మ, సగల వర్తకుడు జూబారి, బఫెల్లో ఫెర్టిలైజర్స్ సత్యసంకల్పం, కామన్ హెల్త్ వామనరావ్, బ్యాంకువాలా లోన్ — లయన్ దండపాణి. ముక్కుసూటిగా వెళ్ళని మరో కోటీశ్వరుడు రాణా — వీళ్ళ అకౌంట్లకి రెండుకోట్లనీ ట్రాన్స్‌ఫర్ చేయించాను!"

"మై గాడ్! గుడ్ హెవెన్స్! గుడ్ ...." లత ఆశ్చర్యంలో అరవడం ప్రారంభించింది.

శివరాం నవ్వుతూ ముందుకి వొంగి, అరచేత్తో ఆమె ఎర్రటి నోటిని సున్నితంగా మూశాడు. అతని అరచేతి మీద ఆమె పెదవులు చప్పుడు చేశాయి. శివరాం చేతిని దూరంగా తీశాడు.

"డార్లింగ్ ....ఇది దుస్సాహసం! దొంగ చేతికి ముల్లె ఇచ్చినట్టు చేశావా?"

శివరాం పకపకా నవ్వాడు. "హనీ, రెండుకోట్లూ

వాళ్ళ ఖాతాల్లో జమ అయింది. వెంటనే అందర్నీ కాంటాక్ట్ చేశాను. ఎవరెవరి ఖాతాలో మని యెంత చేరిందో అంతనీ వాళ్ళ ఇనప్పెట్టెలలోంచీ తీసి నాకు భద్రంగా అందించమన్నాను...."

"అందించారా?"

"రెండు చేతులా! వాళ్ళకి నష్టంలేదుగా? అలాచేస్తే, ఐ మీన్ — మనం చెప్పినట్టు చేయికపోతే వాళ్ళకి కష్టంగా?" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత ప్రశ్నార్థకంగా చూసింది. శివరాం చిలిపిగా నవ్వాడు. "ప్రత్యేకంగా వాళ్ళ సొమ్ము పైసా కూడా వాళ్ళు నాకు ఇవ్వాల్సిన అవసరంలేదు. కేవలం చిన్న సహకారం. మర్యాదగా సహకరించకపోతే, నా సొమ్ముకి వాళ్ళ సొమ్మూ కొంత కలిపి ఇవ్వాల్సి వస్తుందన్నాను. పాత ఫైళ్ళు ఓపెన్ చేస్తానని మాటవరసకి అన్నాను!"

లత ఉషారుగా ఈలవేసింది.

"పాపం, ఆరుగురూ అదరాబాదరా సహకరించేశారు. అలాంటి పరిస్థితిలో గవర్నమెంటు పెద్ద మొత్తాల విత్‌డ్రాల్స్‌ని ఫ్రీజ్ చేసేసినా మనకి భయంలేదుగా!" శివరాం నవ్వాడు. అతని నవ్వులో గర్వం గంటలా ధ్వనించింది.

లత ఒటాలున అతని చేతిని పట్టుకుని లాగింది. శివరాం ఆమె పక్కనే సోఫామీద కూలబడ్డాడు. ఉద్రేకంతో వణుకుతున్న లత వేళ్ళు అతని చెంపల్ని తడిమాయి. వెలుగుతున్న ఆమె కళ్ళు అతనికి జంట నీరాజనాలు పట్టాయి. "డార్లింగ్ .... డార్లింగ్ ...."

"అంతేనా?" శివరాం నవ్వుతూ అడిగాడు.

లత వేళ్ళు ఆగాయి. "ఏమిటి?"

"సందేహాలు...."

"ఓహ్....ఇంకా వున్నాయి! అన్నట్లు అసలు విషయం......వందకిలోల హిరాయిన్......ఎలా వాసన పట్టావ్?"

"గోల్డన్ ట్రయాంగిల్‌గా తయారైన లావోస్, థాయ్‌లాండ్ బర్మా గురించీ అక్కణ్ణుంచీ మణిపూర్ మీదుగా ఇండియా అంతకీ, ఇతర దేశాలకీ దొంగరవాణా అయ్యే హిరాయిన్ గురించీ, టేకు చెట్ల అరణ్యంలో హిరాయిన్ ప్రాసెసింగ్ గురించీ ఈమధ్య పేపర్లలో చదివాను. ఒకప్పుడు ఆ ప్రాంతంలో మకుటంలేని మహారాజుగా, 'డ్రగ్ ఎంపరర్'గా వున్న జగ్గాని శత్రు సంస్థలవాళ్ళు చంపేశారని అంతా అనుకున్నారు. అతను బతికే వుండొచ్చన్న అనుమానం కూడా పోలీసులవాళ్ళకి వుంది. అందుకే, మనం అక్కడికి వెళ్ళాం. నిన్న హోటల్ గదిలో వదిలేసి వారం రోజులపాటు నా పద్ధతిలో పరిశోధించాను. జగ్గా వివరాలున్న పాత పేపర్లు సంపాయించాను. వాడి ఫోటో కూడా. దొంగలకు దొంగలా నటిస్తూ రకరకాలుగా ఇన్‌ఫర్మేషన్ రాబట్టాను. త్వరలో వందకిలోలు గోవాకి రవాణా అవుతుందని తెలుసుకున్నాను. ఇప్పుడు డ్రగ్ కింగ్‌లా వెలుగుతోన్న లాలా మీద నా మైక్రోస్కోప్‌ని ఫోకస్ చేశాను.."

శివరాం ఆగి సిగరెట్ వెలిగించాడు.

"చెప్పు!" లత తొందరపెట్టింది.

"శత్రు ముఠాల తాకిడికి తట్టుకోలేని జగ్గా తను మరణించినట్టు నాటకం ఆడాడు విదేశాలకి జారుకున్నాడు. ప్లాస్టిక్ సర్జరీతో తన రూపం పూర్తిగా మార్చుకున్నాడు. బట్టతల ఏర్పాటు చేసుకున్నాడు. స్పెషల్

ట్రీట్ మెంట్ తో శరీరం బరువూ, లావూ పెంచు తున్నాడు. అయితే జగ్గా చిన్న పొరపాటు చేశాడు. ఆ పొరపాటే అతన్ని నాకు పట్టిచ్చింది...."

"ఏమటది?"

"ముక్కూ, మొహం—అంతా మార్చుకున్న జగ్గా, తన కళ్ళని మార్చుకోలేదు! జగ్గా కళ్ళు, లాలా కి అతి కించబడ్డాయి! సో, జగ్గా—లాలా లేకపోతే 'జగ్గాలా' మనకి ఉపయోగిస్తాడని నిశ్చయించుకున్నాను. అతను పుడ్చిపెట్టిన పాతరూపం, ఇప్పుడు ధరించిన కొత్త రూపం, వందకిలోల హెరాయిన్ స్మగ్లింగ్ ఇవన్నీ మన చేతిలో మూడు కత్తులుగా ఉపయోగించాయి! హెరా యిన్ని లారీల అడ్వెంచర్ ద్వారా...."

"అదంతా తెలుసు... డార్లింగ్.....మరో రెండు గుంజాకని వాణ్ని వదిలేయొచ్చుగా ,వాడితో పాటు మరో తొమ్మిదిమంది విదేశీ గూండాల్ని పట్టిచ్చావు. మనకి ప్రమాదం కదూ?" లత ప్రశ్నించింది.

"వాళ్ళు ఫ్రీగా వుంటే మనకి ప్రమాదం! ఒక లాలా గాణ్ని అయితే మనం తొక్కిపెట్టొచ్చు. కానీ మాఫియా గ్యాంగ్ ని కంట్రోల్ చేయలేం. వాళ్ళని పట్టివ్వడంవల్ల మనకీ, మరో పదిదేశాలకీ—కనీసం వాళ్ళవల్ల ముప్పు తప్పిందిగా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"డార్లింగ్...."

"యస్?"

"రెండు కోట్లు, రెండు వందల లక్షలు....గుడ్ హెవెన్స్....చాలా పెద్ద మొత్తం....ఏం చేస్తాం?"

శివరాం చిన్నగా నవ్వాడు. "పిచ్చి దానీ, రూపాయి

విలువ మనుషుల్లో నిజాయితీలా తగ్గిపోయింది. 'ఈ ఏడాదిలోగా ఈ కార్యక్రమానికి ఇన్ని వందలకోట్లు వెచ్చించడానికి ప్రభుత్వం నిశ్చయించుకుంది' అని మంత్రుల స్టేట్ మెంట్స్ చదివే వుంటావు. వందలాది కోట్ల మొత్తాన్ని ఎంత 'చిన్న' మొత్తాలుగా, ఎంత నిర్లక్ష్యంగా ధ్వనిస్తారో గమనించు!"

"డార్లింగ్ ....అయినా రెండు కోట్లు...."

"పెద్ద మొత్తమే! ఒప్పుకుంటాను. అందుకే కొంత కాలంపాటు విశ్రాంతి తీసుకుంటానని డిటెక్టివ్ వెంకొకి మాటిచ్చాను!"

"నిజంగా?"

"చూడు. ఊటీలో విశ్రాంతి తీసుకుంటున్నాంగా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత చేతులు పూలదండల్లా అతని మెడని కిందికి లాగాయి....

['శివరామ్ అడ్వెంచర్స్' సీరిస్‌లో ఇది ఆరవ నవల]

సీరియల్

# రాక్షసహేలి

వాణిశ్రీ

(గత సంచిక తరువాయి)

"వాడి బావ పేరు గుర్తులేదు. కంట్రాక్టర్ అనుకుంటాను. కారు మెయింటెన్ చేశాడు. లావుగా, ఎత్తుగా వున్నాడు. ఏవో ప్రాజెక్టులో కంట్రాక్టులు చేస్తున్నానని చెప్పాడు. బావమ్మరిదికి గూడా అక్కడే పని ఇప్పిస్తానని అన్నాడు."

"ఏ ప్రాజెక్ట్ భాయ్! కొంచెం గుర్తు తెచ్చుకో." కిరణ్ కి ఆశగా వుంది సత్తార్ కి గుర్తు రావచ్చునని.

సత్తార్ కాసేపు ఆలోచిస్తూ వుండిపోయాడు.

"గుర్తొచ్చింది భాయ్! మహాసాగర్ ఆ ప్రాజెక్టు పేరు" అన్నాడు సత్తార్.

"శుక్రియా భాయ్!" అని చెయ్యి కలిపాడు కిరణ్ ఆనందంతో.

మమత లాడ్జికి చేరుకున్నాడు. రిసెప్షన్ లో వున్న మేనేజర్ కిరణ్ ని చూసి విష్ చేశాడు. రూమ్ బాయిస్ గూడా భయంగా చూశారు అతన్ని. చెప్పిన పని శ్రద్ధగా చేశారు.

లంచ్ చేసి కొంచెం సేపు నిద్రపోవాలనుకున్నాడు. ఈ శుభవార్త వెంటనే విజయకు చెప్పాలనిపించింది. నిద్రలేచి కాల్ చేద్దామనుకున్నాడు. కాని మెలకువ

రాలేదు. లేచేసరికి ఆరుగంటలైంది. రూమ్ ఖాళీచేసి బ్రస్ స్టేషన్‌కి బయల్దేరాడు.

అతని కిప్పుడు చాలా రిలీఫ్‌గా వుంది.

# 13

మహాసాగర్ మహానదిమీద కడుతున్న డామ్. మేజర్ ప్రాజెక్ట్ కావడంతో ప్రాజెక్ట్ ప్రాంతం దగ్గర టౌన్ వెలసింది. అక్కడ అన్ని ప్రాంతాలవారు వుద్యోగాల్లో వ్యాపారాల్లో వున్నారు.

బావగారి అండతో చేరిన అవతారకృష్ణ మొదట మేస్త్రీగా పనిచేశాడు. కాంట్రాక్ట్సులో మెలకువలు నేర్చుకున్నాడు. థర్డ్‌క్లాస్ కంట్రాక్టరుగా రిజిష్టర్ చేయించుకుని స్వంతంగా పనులు చేపట్టాడు. ఒక్కొక్క మెట్టే ఎక్కి ఇప్పుడు ఫస్ట్‌క్లాస్ కంట్రాక్టరు అయ్యాడు.

పెద్దకొడుకు అమెరికాలో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. రెండోవాడు మద్రాసులో మెడిసన్, ఏకైక కుమార్తె అక్కడే పదోక్లాసులో వుంది. డామ్ ప్రాంతంలో పోష్‌లొకాల్టీలో బిల్డింగ్ కట్టుకుని వుంటున్నాడు అవతారకృష్ణ.

కిరణ్ మహాసాగర్ వెళ్ళి వివరాలు సేకరించుకుని వచ్చి విజయకు చెప్పాడు.

ఆమె ఆనందానికి అవధులు లేవు. పట్టరాని సంతోషంతో కిరణ్‌ని కౌగలించుకుని ఒకముద్దు ప్రెజెంట్ చేసింది.

రాత్రి పది దాటింది.

విజయ రోజ్ కలర్ నైటీలో అద్భుతంగా కనిపిస్తోంది. షాంపూ చేసిన కురులు ఫాన్ గాలికి సముద్ర కెరటాల్లా ఎగిసిపడుతున్నాయి. ఆమె కోలముఖం

చూస్తుంటే అతనికి గతకాలంలో జీవిస్తున్నట్లు, ఆమె ఎవరో రాజకుమారి అని భ్రాంతి కలుగుతోంది. ఆమె శరీరంతో నైటీ కలర్ కలిసి పోయింది. పెదవులు ఎర్ర గులాబీలు విచ్చుకున్నట్లు కనిపిస్తున్నాయి ఆమె మాట్లాడు తుంటే. పల్చటి నైటీలోంచి పాంటీ, బ్రా స్పష్టంగా కనిపిస్తుంటే అతని గుండె లయ తప్పుతోంది.

ఈ అపురూప సౌందర్యరాశి విలువైన యవ్వనాన్ని పగ, ప్రతీకారానికి బలిపెట్టడానికి నిర్ణయించుకోవడం ఎంత బాధగానో వుంది.

విజయ లేచి నిల్చుంది.

అతనూ లేచాడు. ఒక్క అడుగు ముందుకు వేసి ఆమె వదనాన్ని రెండు చేతుల్లోకి తీసుకున్నాడు. కళ్ళల్లో కళ్ళు పెట్టి అలా చూస్తూ వుండిపోయాడు అతనికి కాలం తెలియడంలేదు.

"కిరణ్ యేమిటలా పిచ్చిగా చూస్తున్నావ్?" అంది ఆమె అతని చేతుల మీద చేతులు వేసి.

"విజయా!"

"వూఁ...."

"మనం పెళ్ళి చేసుకుందాం."

"వద్దు కిరణ్!"

"ఏం?"

"నా పగ తీరిన తర్వాతే పెళ్ళి"

"అంతవరకూ మనం ఇలా ఒకర్నొకరు, చూసుకుంటూ కాలం గడపగలమా? ఎంత భయంకరమైన శిక్ష?"

"తప్పదు కిరణ్. పెళ్ళయితే పిల్లలు పుడతారు. వాళ్ళపై ప్రేమతో పగ, ప్రతీకారం గాలికి ఎగిరి

పోతాయి. నాకు అది ఇష్టంలేదు."

కిరణ్ అనుకున్నాడు.

'పెళ్ళయిపోయి వుంటే ఎంత బాగుండేది?'

విజయ ఒకరిమాట వినే తత్వం కలదికాదు. ఆమెకు నచ్చచెప్పడానికి ప్రయత్నించడం వ్యర్థం.

"కాని విజయా! మనం పెళ్ళి, పేటాకులు లేకుండా ఇలా తిరగడం బాగుంటుందా? లోకం విషయం ప్రక్కన పెట్టు. మీ నాయనమ్మ ఏమనుకుంటుంది?"

"నలుగుర్ని హత్య చేసి ఆ తర్వాత మనం జీవించి వుంటామనే నమ్మకం నీకుందా కిరణ్!"

"అది వేరే సంగతి! నలుగుర్ని వేటాడి చంపడానికి ఎన్నేళ్ళు పడతాయో! అంతవరకు మనం ఎన్నెన్ని వూళ్ళు తిరగాలో, ఎన్ని వేషాలు వెయ్యాలో! మనతో మీ నాయనమ్మని తిప్పడం భావ్యంకాదు. మన ఇద్దరమే తిరుగుతూ వుంటే ఆమె పైకి యేమీ అనలేకపోయినా మనస్సు క్షోభిస్తుంది. బంధు మిత్రుల దృష్టిలో గూడా చీప్ గా వుంటుంది. ఆలోచించు విజయా!"

అతని మాటలు ఆమెలో ఆలోచనలు రేపుతున్నాయి.

"ఆలోచిస్తాను కిరణ్!" అని గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయింది విజయ.

ఆ రాత్రి విజయకు చాలాసేపు నిద్రపట్టలేదు.

కిరణ్ గురించి ఆలోచనలు చెలరేగాయి.

'జీవితానికి కావాల్సింది పగ, ప్రతీకారమేనా?'

తన నిండు యవ్వనం వృధాగా కరిగిపోవాల్సిందేనా?

ఎప్పటికో ఆమె కళ్ళు మూసింది.

మర్నాడు భవానీ దేవితో చెప్పింది.

"అమ్మా! నేను కిరణ్ని పెళ్ళి చేసుకుంటాను"

భవానీ దేవి చాలా ఆశ్చర్యం వేసింది. కొద్దిసేపు నిశ్చేష్టురాలైపోయింది. కలా! నిజమా! అని అనుమానపడింది. పెళ్ళిమాట ఎత్తితే మండిపడే మనవరాలేనా ఇలా మాట్లాడింది? పగ, ప్రతీకారం అంటూ మధనపడుతున్న విజయ నిజంగా అంటున్నదా పెళ్ళి చేసుకుంటానని?

"విజయా! నిజంగానే అంటున్నావా?" సంభ్రమాశ్చర్యాలతో ప్రశ్నించింది భవానీదేవి.

"అవునమ్మా!" అంది విజయ తలదించుకుని.

భవానీదేవి ఆనందంతో పొంగిపోతూ మనవరాలిని అమాంతం కౌగలించుకుంది.

పెళ్ళి ఆనందపురంలో వైభవంగా జరిగింది. మద్రాసులో విజయతోపాటు చదువుతున్న క్లాస్ మేట్స్ కొందరు, హైదరాబాద్‌లో వృత్త్యరీత్యా స్నేహితులైన మరికొందరు పెళ్ళికి వచ్చారు. కిరణ్, బంధుమిత్రులంతా ఆనందపురంలోను, ఆ జిల్లాలోనే ఎక్కువగా వున్నారు. అంతా పెళ్ళికి తరలి వచ్చారు. జమీందారులు లేక పోయినా వాళ్ళ స్థాయిలో ఇప్పటికీ కొందరు వున్నారు అనేంత ఘనంగా పెళ్ళి జరిపించింది భవానీ దేవి.

కోటికి పడగలెత్తిన జమీందారుల కుటుంబంతో కిరణ్‌కి సంబంధం కలవడం బంధువులు కొందరు ఆనందించారు. మరి కొందరు అతని అదృష్టానికి ఈర్ష్యపడ్డారు.

శోభనం రాత్రి కిరణ్ తన్మయత్వంతో చూశాడు విజయను.

అలనాటి రాజకుమారి తనముందు ప్రత్యక్షమైనట్లు భావన కలిగింది.

ఎర్రటి బోర్డరు కలిగిన తెల్లటి పట్టుచీరలో, మల్లెల వాలుజడ. చేతులకు రత్నాల గాజులు, మెడలో రత్నాల హారంతో అపర రతీదేవిలా వుంది విజయ.

ఫ్రెంచి ఫెర్ఫ్యూమ్ గుబాళింపు, మల్లెల పరిమళంతో కలిసి కలగాపులగంగా వస్తోంది సువాసన.

కిరణ్ ఆమెను కౌగిట్లో బంధించి చాలాసేపు వుండి పోయాడు. అతనికి జన్మ ధన్యమైనట్లు అనిపించింది.

"కిరణ్!"

"వూఁ...."

"నా కొక ప్రామిస్ చెయ్యాలి."

"చెప్పు?"

"మనకి పిల్లలు కలగగూడదు. నువ్వు అందుకు సహ కరించాలి. ఈ విషయం నాయనమ్మకు తెలియగూడదు" అంది విజయ.

కిరణ్ ముఖంలో బాధ చోటు చేసుకుంది.

"అలాగే విజయా! నీ మాటే, నామాట" అన్నాడు కిరణ్.

విజయ కళ్ళు సంతృప్తితో మెరిశాయి.

కిరణ్ కళ్ళు బాధతో రెప్పలు వాల్చుకున్నాయి.

## 14

మహాసాగర్ గెస్టుహౌస్‌లో దిగారు కిరణ్, విజయ.

కోగారావు చనిపోయాక ఆనందపురంలో పొలాలు, తోటలు నమ్మకంగా చూసేవాళ్ళు ఎవరూ కన్పించలేదు. కోగారావు అన్నదమ్ములు కొందరు అతని పోస్టు కోసం ప్రయత్నం చేశారు గాని భవానీదేవి ఎవర్నీ నమ్మలేదు. విజయ పెళ్ళి అయిపోయింది కాబట్టి ఆమెకు దిగులులేదు. రెండు మూడు నెలల కొకసారి వచ్చి కొన్నాళ్ళుంటామని వాళ్ళు

ప్రామిస్ చేసేసరికి ఆనందపురంలోనే వుండిపోవడానికి నిశ్చయించుకుంది.

మర్నాడు ఉదయమే కిరణ్ ఫియట్ కారు డ్రైవ్ చేసుకుంటూ కాలనీలోకి వెళ్ళాడు.

తన టేబుల్లోనుంచి అడ్రస్ వున్న కార్డు తీసిమరొక్క మాటు చూశాడు.

పి. గోవిందరాజులు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్,
డామ్ కన్‌స్ట్రక్షన్ డివిజన్ నెం. 16
క్వార్టర్ నెం. ఇ. ఇ. 33,
రైట్ బాంక్ కాలని,
మహాసాగర్ ప్రాజెక్టు.

దూరం దూరంగా విశాలంగా వున్న క్వార్టర్స్‌ని, నెంబర్స్‌ని చూచుకుంటూ వెళ్ళాడు.

క్వార్టర్ నెం. 33 ముందు కారు ఆపి హారన్ కొట్టాడు. వాచ్‌మాన్ మెయిన్‌గేటు తీశాడు.

లోపల పోర్టికోలో జీప్ ఆగి వుంది.

డ్రైవర్ జీప్ తుడుస్తూ కలిపించాడు.

కిరణ్ జీప్ వెనుక కారు పార్కు చేశాడు.

"గోవిందరాజులుగారు వున్నారా?" డ్రైవర్ని అడిగాడు కిరణ్.

"వున్నారు సార్! సైట్‌కి వెళ్ళబోతున్నారు" చెప్పాడు డ్రైవర్.

కిరణ్ తన విజిటింగ్ కార్డు ఇచ్చాడు. డ్రైవర్ అది ఒక కుర్రాడికిచ్చి లోపలకు పంపించాడు. అతను మరు క్షణంలో తిరిగి వచ్చి "అయ్యగారు రమ్మన్నారు సార్!" అన్నాడు.

ఆఫీసురూమ్‌లో కూర్చొన్నాడు గోవిందరాజులు.

"నమస్తే! నేను మోహన్‌రాజు తమ్ముడిని. కిరణ్ నా పేరు" అని విష్ చేశాడు.

"నమస్తే కూర్చోండి" అన్నాడు గోవిందరాజులు.

కిరణ్ కూర్చొని మోహన్‌రాజు ఇచ్చిన కవర్ అందించాడు. అది అతను అన్నగారికి రాసిచ్చిన పరిచయ పత్రం.

గోవిందరాజులు చదువుకున్నాడు.

"వెరీగుడ్! చెప్పండి మీకేం కావాలో?" అన్నాడు.

"ఎమ్. కామ్. పాసయ్యాను. ఐ డోంట్ వాంట్ ఎనీ జాబ్. ఐ వాంట్ టు బీ ఏ బిజినెస్ మాన్" చెప్పాడు కిరణ్.

"వెరీగుడ్! జాబ్‌లో ఏమి వస్తుంది నా బొంద. మీలాంటి కామర్సువాళ్ళు బిజినెసులోకే రావాలి."

కిరణ్ మందహాసం చేశాడు.

నర్రాదు రెండు కాఫీలు తెచ్చి సర్వ్ చేశాడు.

"తీసుకోండి" అన్నాడు గోవిందరాజులు.

కాఫీ తీసుకున్నాక తమ్ముడి క్షేమ సమాచారాలు విచారించాడు.

"చెప్పండి. ఇక్కడ మీరేం బిజినెస్ చెయ్యాలను కుంటున్నారు?"

"కాంట్రాక్ట్సు" చెప్పాడు కిరణ్.

"లోగడ మీకు అనుభవం ఏదైనా వుందా?"

"లేదండీ."

"పెట్టుబడి ఎంత పెట్టగలరు?"

"ఎంత కావాల్సి వుంటుంది?"

"ముందుగా మీరు థర్డు క్లాస్ కాంట్రాక్టర్‌గా రిజిస్ట్రేషన్ చెయ్యాల్సి వుంటుంది."

"ఆ విషయం మీ తమ్ముడు చెప్పాడు."

"ఒక లక్ష వుంటే దర్జాగా చెయ్యొచ్చు."

"పదిలక్షలైనా కాపిటల్ కావాలంటే తీసుక రాగలను. నాకేమీ ఆస్తిలేదుగాని, మా అత్తగారు బాగా వున్నవారు."

"గుడ్. మీ అత్తగారిది ఏ వూరు?"

"ఆనందపురం. జమీందార్ల వాళ్ళు."

గోవిందరాజులు కళ్ళు మెరిశాయి. కిరణ్ మీద అభిమానం పదింతలు పెరిగింది ఒక్కసారిగా.

"దెన్ నో ప్రాబ్లమ్. నాకు తెలిసిన కంట్రాక్టర్స్ కొందరున్నారు. ఎవరిదగ్గరైనా సబ్ కాంట్రాక్టు కొన్నాళ్ళు చేసినట్టు మీకు సర్టిఫికేట్స్ ఇప్పిస్తాను. మా డివిజన్‌లోనే రిజిస్ట్రేషన్ చేయిస్తాను. ఓ.కె."

"థాంక్యూ వెరీమచ్ సార్" చెప్పాడు కిరణ్.

## 15

జయపూర్ క్లబ్ మహానది ఒడ్డునే ఎకరం స్థలంలో కట్టారు. ప్రాజెక్టు ప్రాంతానికి 'జయపూర్' అని పేరు. ఆ ప్రాంతంలో డామ్ కట్టాలని ఇన్వెస్టిగేట్ చేసి నిర్ణయం తీసుకున్న ఇంజనీర్ జయరావు పేరుమీద టౌన్‌షిప్ వెలిసింది. నది అవతల జయపూర్ సౌత్, ఇవతల జయపూర్ నార్తు.

క్లబ్ జయపూర్ నార్తులో వుంది.

కాలేజీ, హాస్టల్ గూడా నార్తులోనే నిర్మించారు.

నది వుధృతంగా ప్రవహిస్తోంది. క్లబ్ ఫెన్సింగ్ దాటి అలలు లోపలకు చొచ్చుకుని వస్తున్నాయి.

పి.డబ్ల్యు.డి. ఇంజనీర్స్, ఇతర డిపార్టుమెంట్స్‌లో వున్నతాధికారులు సాయంకాలానికి క్లబ్‌కి చేరుకుం

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా గ్యారంటీగా అందుతాయి. ఇంకా రెండేసి నెలల కొకసారి V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

టారు. టెన్నిస్, టెన్నికాయిట్, షటిల్, టేబుల్ టెన్నిస్ కోర్టులేకాక స్విమ్మింగ్ పూల్ గూడా వుంది. రీడింగ్ రూమ్, లైబ్రరీ విభాగాలు గూడా ఏర్పరిచారు.

కిరణ్ కి టెన్నిస్ ఇంట్రెస్టింగ్ గేమ్. గోవింద రాజులు బిజీగా లేకపోతే టెన్నిస్ ఆడతాడు. డి.యస్పీ అర్జున్ సింగ్, సెక్యూరిటీ ఆఫీసర్, మరికొందరు డాక్టర్స్ రెగ్యులర్ గా టెన్నిస్ ప్రాక్టీస్ చేస్తారు.

ఆ రోజు ఆదివారం.

టెన్నిస్ ఆడి కిరణ్ ఛైర్ లో రిలాక్స్ అవుతున్నాడు. అప్పటికి కిరణ్, విజయ ఆ వూరు వచ్చి రెండు నెలలు అవుతుంది.

గోవిందరాజులు, అవతారకృష్ణ మాట్లాడుకుంటూ వస్తున్నారు. ఈ రెండు నెలల్లోను అతని పరిచయం కాలేదు. కావాలని పరిచయం చేసుకోలేదు. కాని అతన్ని గురించిన వ్యక్తిగత విషయాలు నెమ్మదిగా సేకరిస్తూనే వున్నాడు.

"మిస్టర్ కిరణ్ మీట్ మిస్టర్ అవతారకృష్ణ!"

గోవిందరాజులు పరిచయం చేశాడు.

"హల్లో! హౌ డూ యూ డూ!"

"గ్లాడ్ టూ మీట్ యూ!"

ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు.

అవతారకృష్ణని పరీక్షగా చూశాడు.

నల్లగా లావుగా వున్నాడు. బట్టతల. పొట్ట కుండలా వుంది. గ్లాస్కో పంచె, సిల్కు లాల్చీ, భుజంమీద ఎర్రంచు జరీ కండువా వేసుకుని హుందాగా వున్నాడు. గోల్డుఫ్రేమ్ కళ్ళద్దాల్లోంచి చిన్న కళ్ళు లోతుకుపోయి

వున్నాయి. మీసాలు సగం నెరిసి తెలుపు నలుపు కల నేతలా కనిపిస్తున్నాయి. మెడలో పులిగోళ్ళ చైన్ మందంగా చేసి వుంది. అతను స్పోర్ట్సు ఏమీ ఆడడు. పేకాటకోసం క్లబ్ కి వస్తాడు.

"అవతారకృష్ణగారు 'ఏవన్' కంట్రాక్టర్. మీకు తెలిసే వుంటుంది" అన్నాడు గోవిందరాజులు.

"జయపూర్ లో వీరు తెలియని వారెవరుంటారు? పేరు విన్నాను. ఇప్పుడే పరిచయం" నవ్వుతూ అన్నాడు కిరణ్.

అవతారకృష్ణ నవ్వడం చేతగానివాడిలా మౌనంగా ఉండిపోయాడు. అతను సామాన్యంగా నవ్వడు. ఎప్పుడో చీఫ్ ఇంజనీర్ సైట్ ఇన్ స్పెక్షన్ కి వచ్చి నప్పుడో, బిల్స్ పాస్ చేయించుకోవడానికి 'పే' ఆఫీసుకి వెళ్ళినప్పుడో, ప్రియురాలు అలిగినప్పుడో నవ్వుతాడు.

"కిరణ్ మా బ్రదర్ క్లాసుమేట్. జాబ్ చెయ్యడం ఇష్టంలేదు. ఇండిపెండెంట్ గా ఏదైనా చెయ్యాలని కాంట్రాక్టులోకి వచ్చాడు" చెప్పాడు గోవిందరాజులు.

"జాబ్ చేస్తే ఏం మిగులుద్ది నా బొంద. గాజుల బేరం కూటికి సరి అని గతిలేక చెయ్యాలిగాని, బుర్రలో తెలివున్నవాడెవడూ జాబ్ చెయ్యడు. మీవంటి ఇంజనీర్స్, డాక్టర్స్, కలెక్టర్స్ సంగతి వేరనుకోండి" అన్నాడు అవతారకృష్ణ.

"మీరు చెప్పింది సెంట్ పర్సెంట్ కరెక్ట్. అందులోను నాకు మనీ ప్రాబ్లమ్ లేదు" అన్నాడు కిరణ్.

(ఇంకా వుంది)

